# తెలుగు వాచకము

## (పద్యము - గద్యము - ఉపవాచకము)

సామాన్యము

## ఉన్నతోత్తరప్రథమ కక్ష్య

## HIGHER SECONDARY - I YEAR

**(Telugu - Part-I Complete)**

అంటరానితనం అమానుషం
అంటరానితనం నేరం
అంటరానితనం పాపం




**తమిళనాడు పాఠ్యగ్రంథ సంస్థ**
**చెన్నై - 600 006.**

**Tamilnadu Textbook Corporation**
College Road, Chennai - 600 006.

First Edition - 2004

CHAIRPERSON

Dr. **M. CHANDRAVALLI**
Reader & Head of the Dept. of Telugu,
Presidency College, Chennai - 600 005.

REVIEWERS

Tmt. **M. KAMESWARI**
Head of the Dept. of Telugu,
Queen Mary's College,
Mylapore, Chennai - 600 004.

Thiru **P. CHANDRA SEKHARA SARMA**
SR. SPL. GR. P.G. Asst.,
S.K.P.D. Boy's. Hr. Sec. School, Chennai - 600 001.

AUTHORS

Thiru **K. PRABHAKARA NAIDU**
SPL. GR. P.G. Asst.,
Pachaiyappa's College,
Hr. Sec. School,
Chennai - 600 001.

Dr. **T. PADMALOCHANA DEVI**
P.G. Asst. (RTD)
Sri Venugopala Vidyalaya,
Hr. Sec. School,
Chennai - 600 028.

Thiru **G. RAMESHUDU**
SPL. GR. Telugu Pandit,
S.K.P.D. Boy's Hr. Sec. School,
Chennai - 600 001.

Thiru **CH. BUCHAIAH**
P.G. Asst. in Telugu,
Kesari Hr. Sec. School,
T.Nagar, Chennai - 600 017.

**Price : Rs.**

**This book has been prepared by the Directorate of School Education on behalf of the Govt. of Tamilnadu**

**This book has been printed on 60 G.S.M. paper**

# జాతీయ గీతము

జనగణ మన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా !
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగ !
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగ !
తవ శుభనామే జాగే !
తవ శుభ ఆశిష మాగే !
గాహే తవ జయ గాథా !
జన గణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

*- రవీంద్రనాథ్ ఠాకూర్*

# జాతీయగీత సారాంశము

సమస్త జనుల హృదయములను పరిపాలించు భారతదేశ సౌభాగ్యకరమైనట్టి నీకు జయమగుగాక ! నీ శుభనామము పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్రము, ద్రావిడము, ఉత్కళము, బంగాళము మున్నగు దేశ జనుల మనస్సులను ఉప్పొంగజేయుచున్నది. అది వింధ్య, హిమాచల పర్వతములలో ప్రతిధ్వనించు చున్నది. యమునా గంగా నదుల ప్రవాహ గీతములందు విలీనమై, హిందూ సముద్ర తరంగములచే గానము చేయబడుచున్నది. నీ ఆశీర్వచనముల కొఱకు వారు ప్రార్థించుచు నీ కీర్తిని గానము చేయుచున్నారు. భారతదేశ సౌభాగ్య కర్తవగు నీకు జయమగుగాక ! జయమగుగాక ! జయమగుగాక !

# వందే మాతరమ్

వందే మాతరం,
సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం,
సస్య శ్యామలాం మాతరం, వందే మాతరం,
శుభ్ర జ్యోత్స్నా పులకిత యామినీం,
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం,
సుహాసినీం, సుమధుర భాషిణీం,
సుఖదాం వరదాం మాతరం, వందే మాతరమ్

*- బంకిం చంద్ర ఛటర్జీ*

# ప్రతిజ్ఞ

భారత దేశము నామాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు. నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన, నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. దీనికి అర్హత పొందుటకు సర్వదా నేను కృషి చేయుదును.

నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలందరను గౌరవింతును. ప్రతివారితోను మర్యాదగా నడుచుకొందును. నా దేశముపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందమునకు మూలము.

# మా తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు !
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ,
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి !
గల గలా గోదారి కదలిపోతుంటేను,
బిర బిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను,
బంగారు పంటలే పండుతాయి !
మురిపాల ముత్యాలు దొరలుతాయి !
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండే దాక !
రుద్రమ్మ భుజశక్తి ! మల్లమ్మ పతిభక్తి !
తిమ్మరుసు ధీయుక్తి ! కృష్ణరాయల కీర్తి !
మా చెవుల రింగుమని మారుమ్రోగే దాక
నీ ఆటలే ఆడుతాం, నీ పాటలే పాడుతాం !
జై తెలుగు తల్లీ ! జై తెలుగు తల్లీ !

*- శంకరంబాడి సుందరాచారి*

## తమిళ్ తాయ్ వాళ్త్తు

నీరారుం కడులుడుత్త నిలమడందై కెళిలొళుగుమ్
సీరారుం వదన మెనత్తిగళ్ భరత ఖండమిదిల్
తెక్కణముం అదిట్ సిరంద ద్రావిడనల్ తిరునాడుమ్
తక్క సిఱు పిఱై నుదలుమ్ దరిత్తనరుమ్ తిలగముమే
అత్తిలగ వాసనైపోల్ అనైత్తులగుమ్ ఇన్బముఱ
ఎద్దిసయుం పుగళ్ మణక్క ఇరుంద పెరుం తమిళణంగే !
తమిళణంగే !

ఉన్సీరిళమై త్తిఱం వియందు
సెయల్ మఱందు వాళ్త్తుదుమే !
వాళ్త్తుదుమే !
వాళ్త్తుదుమే !

*- మనోన్మణీయం, పె. సుందరం పిళ్ళై*

## జాతీయ సమైక్య ప్రతిజ్ఞ

"నా జాతి స్వాతంత్ర్యమును, ఏకత్వమును సంరక్షించుటకును దృఢతరము చేయుటకును సర్వాత్మనా కృషి చేయగలనని ప్రతిన చేయుచున్నాను."

"మఱియు - హింసా మార్గము నెన్నడును అవలంబింపవలననియు, మత, భాషా, ప్రాంత సంబంధములైన, ఇతర రాజకీయార్థిక అన్యాయ సంబంధములైన సర్వ విభేదములను, వివాదములను శాంతియుతముగానే, చట్ట సమ్మతమైన పద్ధతులలోనే పరిష్కరించుకొనవలెననియు నొక్కి వక్కాణించుచున్నాను."

# తమిళతల్లి వినుతి

భరత ఖండపు భూమి పడతి
జలావృత జలధి వసన;
అతి సుందర మహిమోపేత;
ఆ తల్లి నెలవంక నొసట
తీర్చిన కస్తూరి తిలకం
ద్రావిడనాడు పంట వలతి;
ఆ కమ్మని కస్తూరి వలపు,
తీయదనం, లేఁబ్రాయం, ధీరం
తమిళభాష, తమిళభాష
అది సర్వదిశావృతం,
నిత్య నూతనం, ప్రఖ్యాతం;
సర్వదా విజయోఽస్తు,
విజయోఽస్తని మా వినుతి.

*అనువాదము : ఆచార్య దేవళ్ల చిన్నికృష్ణయ్య*

# ఆముఖము

తమిళనాడు ప్రభుత్వము నూతన పాఠ్యప్రణాళికను, తదనుగుణముగా పాఠ్యపుస్తకములను రూపకల్పన గావించుట సంతోషదాయకమైన విషయము.

ఈ పదకొండవ తరగతి వాచకము పాఠ్యప్రణాళికా సంఘమువారి నిబంధనల ననుసరించి రూపొందింపబడినది. విద్యార్థినీ విద్యార్థులకు తెలుగుభాషపై ఆసక్తి, అభిరుచి ఏర్పడవలెనను సదుద్దేశముతో బాటు, వారిలో భారతీయ సంస్కృతి, రాష్ట్రాభిమానము, దేశభక్తిని పెంపొందించవలెనను దృక్పథముతో పాఠ్యాంశములు కూర్చబడినవి. ప్రాచీనాధునిక ఆంధ్ర వాఙ్మయ చరిత్రలోని భిన్న ప్రక్రియలు, వివిధకవుల రచనలను పాఠ్యాంశములుగా విద్యార్థినీ విద్యార్థుల స్థాయి ననుసరించి సమకూర్చబడినవి.

అధ్యయన వేదిక యందు కఠిన పదముల కర్థాదులు చేర్చబడినవి. పఠనానుకూలముగా నుండుటకై వ్యాకరణమును ప్రత్యేకముగా ఒకేచోట పొందుపరచబడినది.

ఉపవాచకములో చారిత్రకాదర్శ పురుషుడు, అర్థశాస్త్ర రచయితయైన చాణక్యుని చరిత్ర విపులీకరించబడినది. 'కణ్వశ్రీ'గా ప్రసిద్ధులైన చంద్రశేఖరశర్మగారు, సాహితీలోకంలో 'భవదీయుడు'గా పేరు పొందిన కె.ఎల్.నరసింహారావుగారు జంటగా రచించిన 'చాణక్యుడు' గ్రంథ ప్రచురణకర్తలు బాలసరస్వతీ బుక్ డిపోవారికి కృతజ్ఞతలు.

ఈ వాచకములో తమ కవితలను, రచనలను స్వీకరించుటకు అనుమతి నొసగిన మహామహులందరికీ కృతజ్ఞతలు.

ఈ పాఠ్యగ్రంథ రూపకల్పనకు సహకరించిన, ప్రోత్సహించిన సౌహార్ద్రమూర్తులకు, ఆప్తమిత్రులకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

ప్రాంతీయ భాషలకు ప్రోత్సాహమిచ్చి పాఠ్యగ్రంథాలను తయారుచేయుటకు పూనుకొనిన తమిళనాడు ప్రభుత్వమునకు, ప్రభుత్వాధికారులకు, విద్యాశాఖాధికారులకు మా నమస్సుమాంజలులు.

ఈ పాఠ్యగ్రంథమును చక్కగా అందముగా రూపుదిద్ది ఇచ్చిన 'స్పెక్ట్రమ్ గ్రాఫిక్ స్టూడియో' వారికి మా కృతజ్ఞతాభివందనములు.

# విషయసూచిక

## పద్యభాగము



## కంఠస్థము చేయవలసిన పద్యములు

| | | | పంక్తులు |
|---|---|---|---|
| 1. | భాగవత నీతి రత్నావళి | - 1, 3, 4, 6, 8 | 20 |
| 2. | విక్రమార్కుని ఔదార్యము | - 7, 12, 13 | 12 |
| 3. | కపోతోపాఖ్యానము | - 10, 13, 21, 23 | 16 |
| 4. | గృహస్థ ధర్మము | - 18, 39, 41 | 12 |
| 5. | సుశర్మోపాఖ్యానము - పద్మతీర్థ ప్రభావము | - 8, 12, 17, 29 | 16 |
| 6. | గోరక్షణము | - 4, 10, 12 | 12 |
| 7. | ఋతుచక్రం | - 1, 9, 12 | 12 |
| | | మొత్తము పంక్తులు | 100 |

# గద్యభాగము



## వ్యాకరణము



# ఉపవాచకము

## చాణక్యుడు

విద్వాన్ కణ్వశ్రీ చంద్రశేఖర్‌శర్మ &

కె.ఎల్.నరసింహారావు

# 1. భాగవత నీతి రత్నావళి

*— పోతన*

*వేదవ్యాస విరచితమైన సంస్కృత మహాభాగవతమును బమ్మెర పోతనామాత్యుడు ఆంధ్రీకరించెను. పోతనకవి 15వ శతాబ్దమునకు చెందినవాడు. తండ్రి కేసన, తల్లి లక్కమాంబ. సహజ పాండిత్య బిరుదాంకితుడు. వీరభద్ర విజయము, భోగినీ దండకములు వీరి యితర గ్రంథములు. పోతన వర్ణనలు మిక్కిలి విశదములై పఠితల కనులముందు సాక్షాత్కరింపజేయుచుండును. వీరి శైలి అతిమధురమైనది. తెలుగు భాషకు నిసర్గమైన సంగీతమాధుర్యము భాగవతమున సర్వతోముఖముగా గోచరించును. వీరికి అలంకార ప్రీతి మెండు. వర్ణనల సందర్భమున అంత్యాను ప్రాసములు అధికముగా వాడుచుండును. పండితులు, పామరులు అందరి మన్ననలు చూరగొన్న మహాకావ్యము భాగవతము.*

*పోతన భాగవతము భక్తి రసము ప్రధానముగా నుండును. ఉత్తమ కవితా శిల్పము గూడ కాననగును.*

*పోతన భాగవతములో అచ్చటచ్చట రసగుళికలైన నీతి పద్యములను సందర్భ సహితముగా కూర్చెను. అట్టివానిలో కొన్ని మన పాఠ్యాంశముగా గ్రహీతము.*

★క. నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం
తాపార భూత దయయును
దాపస మందార నాకు దయ సేయ గదే! 1

క. అతిథి జనంబుల భక్తిన్
సతతముఁ బూజించి యుచిత సత్కారములు
న్నతి నడుపు సుజను లును శా
శ్వత కీర్తులు ధరించిఁ బడయఁ జాలుదు రనఘా! 2

✶క. శరణమని వచ్చు జంతువుఁ
గరుణం గను విచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికం బనిము
న్నెఱిగించిరి సన్మునీంద్రు లెల్లం బ్రేమన్ 3

✶క. పరహితము సేయు నెవ్వడు
పరమ హితుండగును భూతపంచకమునకున్
బరహితమె పరమ ధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందు ముఖీ! 4

క. కర్మమునఁ బుట్టు జంతువు
కర్మమునన్ వృద్ధిఁ బొందు గర్మమున జెడున్
గర్మమె జనులకు దేవత
కర్మము సుఖ దుఃఖములకుఁ గారణ మధిపా! 5

✶క. జననీ జనకుల వృద్ధులఁ
దనయుల గురు విప్ర సాధు దారాదులనే
జనుడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక,
వనరును జీవన్మృతుండు వాడు ధరిత్రిన్ 6

క. ధర్మము సత్యము ఁ గీర్తియు
నిర్మలదయ విష్ణు భక్తి నిరుపమ ఘనస
త్కర్మ మహింసా వ్రతమును
నర్మిలి గలవారె పుణ్యులవనీ నాథా! 7

✶క. క్షమ గలిగిన సిరి గలుగును
క్షమ గలిగిన వాణి గలుగు సౌఖ్యము లెల్లన్
క్షమ గలుగఁ దోన గలుగును
క్షమ గలిగిన మెచ్చు శౌరి సదయుడు తండ్రీ! 8

క ధర్మేతర వర్తనులును
దుర్మంత్రులు నైన జనుల దురితము లొందన్
మర్మములు గలచి కల్మష
కర్ములు రోగముల నొందు కైవడి విప్రా! 9

క॥ సత్యము ప్రభువుల వచనము
నిత్యము తద్వచన విధిని నిలుతురు పెద్దల్
సత్యా సత్యము గావున
సత్యమనుచుఁ జనరు వారి చరితమున నృపా! 10

## అధ్యయన వేదిక

**అర్థములు :**

భూతదయ = ప్రాణులమీద దయ; అనఘా = పాపరహితుడా (పుణ్యాత్ముడా) అరయగ = ఆలోచించి చూడగా; పర్వేందు ముఖీ = పున్నమినాటి చంద్రునివంటి ముఖముగలదానా; కర్మము = పని, కార్యము (కార్యఫలితము); అధిపా! = ఓ రాజా!; విప్రులు = బ్రాహ్మణులు; దార = భార్య; జీవన్మృతుండు = బ్రతికియుండియు చచ్చినవానితో సమానుడు; ధరిత్రి = భూమి, నర్మిలి = ప్రియము; దురితము = పాపము.

**సంధులు :**

**ఈ క్రింది వానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములు వ్రాయుము:**

సన్మునీంద్రులు, మున్నెరింగించిరి, పర్వేందుముఖీ, మునీంద్ర;

**సమాసములు :**

**ఈ క్రింది వానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము:**

భూతదయ; శాశ్వతకీర్తి; మునీంద్రుడు; భూతపంచకము; సుఖదుఃఖములు; గురువిప్రసాధుదారాదులు.

**అర్థ సందర్భములు :**

1. పరహితమె పరమధర్మము
2. కర్మమె జనులకు దేవత
3. నర్మిలి కలవారె పుణ్యులవనీ నాథా!

**ప్రశ్నలు :**

1. శాశ్వత కీర్తిని ఎవరు బడయుదురు?
2. పుణ్యము, పరమ ధర్మములు అనగానేమి?
3. కర్మ ఫలితమెట్టిది?
4. జీవన్మృతుండెట్టివాడు?
5. పుణ్యులెవరు?
6. క్షమ వలన ఏమేమి కలుగును?
7. కల్మషకర్ములెవరు?

***విశేషాంశములు :***

పంచ భూతములు : నీరు, నిప్పు, గాలి, ఆకాశము, భూమి;

***విద్యార్థులకు సూచన :***

భాగవతములో గల నీతి పద్యములను సేకరించుము.



# 2. విక్రమార్కుని ఔదార్యము

**- జక్కన**

*జక్కన కవి 15వ శతాబ్దము పూర్వభాగమునకు చెందినవాడు. అక్కమాంబ, అన్నయామాత్యులు వీరి తల్లిదండ్రులు. నియోగి బ్రాహ్మణ కుటుంబమునకు చెందినవాడు. జక్కన విక్రమార్క చరిత్రమును రచించి, ప్రౌఢదేవరాయల కొలువులో గణకుడుగా నుండిన వెన్నెలకంటి సిద్ధనామాత్యునికి అంకితము చేసెను. జక్కన బహుశాస్త్ర పారంగతుడు. మరియు అవధాన నిర్వహణ ప్రజ్ఞగలవాడు.*

*విక్రమార్క చరిత్రము పంచమాశ్వాసము నుండి ప్రస్తుత పాఠ్యభాగము స్వీకరింపబడినది. ఇందు, దేవదత్తుడను బ్రాహ్మణుడు విక్రమార్కుని పరీక్షించిన విధానము, విక్రమార్కుని ఔదార్య గుణము రసవత్తరముగ వర్ణించబడినవి.*

క. ఘనవటవిటపిచ్ఛాయను
జనపతి శయనించి యున్న సమయమున, జగ
జ్జనసుతుఁడు దేవదత్తుం
డనుభూసురవర్యుఁ డొక్కఁ డతనిం గాంచెన్. 1

తే. కాంచి యవ్విభుతనుపరిక్లాంతి యెఱిఁగి
చేతికుండి కాజలముల సేదఁదేర్చి
యాత్మపురమున కేతేర నవధరింపు
మండలాధీశ ! యొంటిమై నుండనేల. 2

చ. అనినఁ బ్రమోద మంది వసుధామరవర్యునిఁ గూడి విక్రమా
ర్కనృపవ రేణ్యుఁ డాత్మనగరంబునకుం జనియెన్, ద్విజుండునుం
దనసదనంబు చేరెఁ బ్రమదమ్మున నమ్మఱునాఁడు పిల్చి, య
జ్జన పతి దేవదత్తునకు సమ్మతి నిచ్చెఁ బురోహితత్వమున్ 3

వ. ఇచ్చి యొక్కనాఁడు. 4

తే. కలయఁగాఁ జూచి కొల్వులోఁ గల్గువారు
వినఁగ దేవదత్తుఁడు మున్న విపినభూమిఁ
గోరి నాకుఁ జేసిన యుపకారమునకు
మాఱుసేయ నెన్నఁడు సమకూఱు నొక్కొ! 5

వ. అనిన నమ్మాటకు దేవదత్తుండు నృపోత్తమునియాపన్న వర్తిత్వంబునం జేసి, తనవర్తనం బఖిలజనంబుల పరికీర్తనంబు సేయం బ్రవర్తించుచు నొక్కనాఁడు, సర్వాభరణభూషితుండైన రాజకుమారుండు ముంగిట నాడ ముద్దాడువాఁడునుంబోలె నెవ్వరు నెఱుఁగకుండ గూఢవృత్తి నెత్తుకొని నిజనివాసంబునకుం జనియె, నంత నక్కుమారు నెల్లవారు వెల్లెడల నరసి కానక ధాత్రీశ్వరున కత్తెఱం గెఱింగించిన, నతండును గుమారాన్వేషణంబునకుఁ దలవరుల నియోగించిన నయ్యారెకులు చని పురంబు సర్వంబును శోధించి, విపణివీథిం దదీయాభరణమ్ములమ్మ నమ్మహీసురు మచ్చంబుతోడం బట్టి తెచ్చి సమ్ముఖంబునం బెట్టిన, నమ్మహీపాలుం డుచితాలాపంబుల వెఱవువాపి యడుగుటయు, 6

*ఉ. భూసురముఖ్యుఁ డిట్లనియె భూషణసంగ్రహణాలాభిషినై
యాసురవృత్తిఁ బూని భవదాత్మజుఁ జెప్పఁగరానిచేఁత నేఁ
జేసితి, నావుడున్ సభ నశేషజనమ్ములుఁ గ్రూరదండింతుం
జేసినఁగాక యీచెడుగు చేసిన సేఁత సహింపవచ్చునే ? 7

క. ఈభూషణంబు లెక్కడ
నాభూపకుమారుఁ డేడ నకటా ! కృప లే
కేభంగిఁ దెగి వధించితి
వేభూములఁ జెప్పఁ గలరె యిట్టి దురాత్ముల్ ! 8

వ. అని కలుషించి దండింపం దలఁచి. 9

ఆ. కొలువు వెడల నీడ్చికొనిపోవ నతిసంభ్ర
మమున విక్రమార్క మనుజవిభుఁడు
వారి మగుడఁ బిలిచి వలదని వారించి
యెల్లవారు వినఁగ నిట్టు లనియె. 10

క. మున్నొకపురుషార్థము మది
నెన్నఁడు మఱవంగ రాని దితఁ డొనరించెన్
నన్నును నే నెఱుఁగక పడి
యున్నెడ వనభూమి శీతలోదక మొసఁగెన్. 11

*ఉ. కావున నీతఁ డెంతయుపకారము సేసిన సై ఁపఁ బాడి, యే
నావిపినంబు వెల్వడికదా పురికిం జనుదెంచి రాజనై
యీవిభవంబుమై మనుట, యెంతటి తప్పిది ? నాకుఁ దప్పినన్
దైవముసాక్షి యీతనికిఁ దప్ప నొకింతయు, మాట లేటికిన్? 12

*ఉ. ఆపద చక్కఁ బెట్టి తనయక్కఱలెల్లను దీర్చి, యెయ్యెడం
బ్రాపయినట్టి కార్యములపట్టున నిర్వహణం బొనర్పఁగా
నోపి, తను న్భరించినబుధోత్తము నొప్పరికించు నమ్మహా
పాపికి నెన్ని జన్మములఁ బాయునొకో క్రిమికీటక జన్మముల్ ! 13

ఉ. నావుడు రాజుసభ్యవచనంబున కెంతయు సంతసిల్లి, భూ
దేవుఁడు మందిరంబునకు దిగ్గనఁ బాఱి కుమారుఁ దెచ్చి, ధా
త్రీవరు నంకపీఠి నిడి దీవన లొప్పఁగ నిచ్చి తత్సభా
కోవిదకోటి డెందమునకుం బ్రమదంబు జనింప నిట్లనున్. 14

ఉ. దేవర నేఁడు కొల్వున మదిం గడునెంతయు సంతసించి, సం
భావనమీఱ నాకు నొక ప్రత్యుపకారము సేయఁబూనుటే
నావల నీవల న్విని, యథార్థ మెఱుంగుటకై యొనర్చితిన్
నావెడబుద్ధికి న్మనమునం గలుషింపకుమయ్య వేఁడెదన్. 15

క. అనవుడు ధరామరేంద్రుని
కనుపమ మణిభూషణాదు లగుసంపదలన్
మనమలరఁజేసి గృహమున
కనిచె సభాసదుల నిచ్చ నచ్చెరువందన్ 16

వ. ఇత్తె ఱంగున విక్రమార్కావనీశ్వరుండు సత్యవచన ప్రత్యుపకార పరాయణుండై ధరాపరిపాలనంబు సేయుచుండెను.

# అధ్యయన వేదిక

**అర్థములు :**

ఔదార్యము = ఉదారత్వము; వటవిటపి = మఱ్ఱిచెట్టు; ఛాయ = నీడ; జనపతి = రాజు; భూసురవర్యుడు = బ్రాహ్మణశ్రేష్ఠుడు; తనుపరిక్లాంత = శరీరపు బడలిక; ద్విజుడు = బ్రాహ్మణుడు; కుండికా జలములు = కమండలములోని నీరు; సదనము = గృహము; ప్రమదము = సంతోషము; తలవరులు = భటులు; విపణివీథి = అంగడి వీథి; మచ్చంబు = గుర్తు; ఒప్పరికించుట = ఉపేక్షించుట; అనుపమ = మేలైన.

**సంధులు :**

**ఈ క్రింది వానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

మండలాధీశులు; వసుధామరవర్యుడు; ధాత్రీశ్వరుడు; పురుషార్థము; నృపోత్తముడు; శీతలోదకములు; ప్రత్యుపకారము; ఇత్తెఱంగు;

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

మండలాధీశుడు; రాజకుమారుడు; ఉచితాలాపములు; దురాత్ములు; శీతలోదకములు.

**అర్థ సందర్భములు :**

1. 'మాఱు సేయ నెన్నడు సమకూఱునొక్కొ!'
2. 'నే భూములఁ జెప్పగలరె యిట్టి దురాత్ముల్'
3. 'ఈ తనికి దప్ప నొకింతయు, మాట లేటికిన్'

**ప్రశ్నలు :**

1. దేవదత్తుడు విక్రమార్కుని ఆస్థానమున పురోహితుడెట్లాయెను?
2. దేవదత్తుడు విక్రమార్కుని ఔదార్యము ప్రజలకు తెలియుటకేమి గావించెను?
3. విక్రమార్కుని ఔదార్యమెట్టిదో వివరింపుము?

***విద్యార్థులకు సూచన :***

ఔదార్యగుణములు అలవరచుకొనుటకు అభ్యాసము గావింపవలయును.

***ఉపాధ్యాయులకు సూచన :***

విక్రమార్కునివలె ఔదార్యగుణములు గలిగిన పురాణ పురుషులను విద్యార్థులకు పరిచయము గావించుట యుక్తము.



# 3. కపోతోపాఖ్యానము

- తిక్కన

వేదవ్యాస విరచితమైన సంస్కృత మహాభారతమును ఆంధ్రీకరించిన కవిత్రయములో తిక్కన రెండవవాడు. తండ్రి కొమ్మనామాత్యుడు. తల్లి అన్నమ్మ. తిక్కన కాలము 13వ శతాబ్దము. ఆంధ్ర మహాభారతములోని పదునెనిమిది పర్వాలలో నాల్గవదైన విరాటపర్వము మొదలుకొని చివరిదైన స్వర్గారోహణ పర్వము వరకు మొత్తము పదునైదు పర్వములు తెనిగించి తిక్కన కృతకృత్యుడయ్యెను. నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధి రాజుకు మంత్రిగాను, ఆస్థానకవిగాను ప్రసిద్ధికెక్కినాడు. ''సోమయాగము'' చేసి ''సోమయాజి'' అయ్యెను. తన మొదటి కావ్యమైన నిర్వచనోత్తర రామాయణమును మనుమసిద్ధి రాజుకు అంకితమిచ్చెను. **"కవిబ్రహ్మ", "ఉభయకవి మిత్రుడు"** అనునవి తిక్కన బిరుదములు.

తిక్కన కవిత అలతి యలతి పదములతో అలరారుచు, తెలుగు పలుకుబడితో నొప్పుచున్నది. వీరిది నాటకీయశైలి, **"అల్ప పదములతో అనల్పార్థ రచన''** చేయుటలో తిక్కన సిద్ధహస్తుడు.

శ్రీమదాంధ్ర మహాభారతము, శాంతిపర్వము తృతీయాశ్వాసము నుండి ప్రస్తుత పాఠ్యభాగము గ్రహింపబడినది. ధర్మరాజు పట్టాభిషిక్తుడైన అనంతరము శ్రీకృష్ణునితో గలిసి అంపశయ్యా తల్పముననున్న భీష్ముని జూచుటకు వెళ్ళును. ధర్మజుడు భీష్ముని గాంచి, ''ధర్మములలో నెయ్యవి శ్రేష్ఠంబులు'' అని ప్రశ్నింప, భీష్ముడు ఎల్ల జనులు నాచరింపదగు ధర్మములు అనేకములున్నవి. అవి వేదహితములు, శాస్త్రహితములు, శిష్టాచారములని మూడు విధములు. అవి యన్నియును సద్గతికి హేతువులే యగును. వానిచే జనులకు ఇహపర సుఖములు గల్గును.

శరణాగత రక్షణము ధర్మములలో మేటిగా నెన్నబడుచున్నది. దాని మేలిమి నెఱింగించు నొక పుణ్యకథను వినుమని, కపోతము యొక్క అతిథి సత్కార కథను వినిపించును.

క. శరణాగతసంరక్షణ
పరులకు సమకూరు నెట్టిపాటిఫలము ని
ర్భరకరుణాకర పరమా
దరమున నెఱిఁగింపు నాకు దానితెఱంగున్. 1

ఆ. అనిన భీష్ముఁ డిట్టులను; ముచికుందుండు
నాఁగఁబరఁగు ధరణినాయకుండు
దనుజమంత్రిచేత వినినది యొకకథ
యఖిలపాపహరణ మాచరించు. 2

వ. అయ్యితిహాసంబు సెప్పెద దాన నీయడిగిన యర్థంబు దెలియు నవహి
తుండవై యాకర్ణింపుము 3

సీ. పాపాత్ముఁ డొకబోయ పక్షుల వధియించి
తినియును బెక్కమ్మికొనియు నదియ
బ్రదుకుగా దానికి బహుసాధనంబులు
సవరించుకొని మహాటవిఁ జరింప
నొకనాఁడు పెనువానయును గాలియును ముట్టి
సకలజీవులకు నాశంబువుట్టు
నట్టిదియై కాన యంతయు జలమయం
బైన బెగ్గిలి యన్నరాధముండు

తే. వెరపుతో నల్ల నల్లన వెడలి మిఱుత
నొకవనస్పతిజొంపమై యున్నదానిఁ
జెంది రాతిరి యగుటయు శిలయ సెజ్జ
గాఁగ శీతార్తుఁడై యుండెఁ గౌరవేంద్ర! 4

క. ఆలుబ్ధకుఁ డత్తరువర
మాలోకించి కడుభక్తి ననియె 'నిచటి భూ
తాలిం గొలిచెదఁ గరుణా
శీలత ననుఁ గాచుటకు విశిష్ట వినీతిన్! 5

వ. అని యిట్లవృక్షిధ్వంసకుండు శయనంబు ప్రాపించియుండ నమ్మహీరుహంబు కోటరంబున వసియించి యుండునది యొక్కకపోతంబు దనవల్లభ యెట యేని మేఁతకుం బోయి రాక తడసిన శోకించి, 6

సీ. 'ఎచట నున్నది యొక్కొ? యింతప్రొ ద్దొక చోట
నుండునే నను బాసి యుజ్జ్వలాంగి;
యేకారణంబున నేమయ్యెనో? వాన
యేపునఁ దెగియెఁ గానోపు నకట;
యమ్మెను లేకున్న నిమ్మెనికలిమి ని
రర్థకం బధికానురాగయుక్త;
యగుసతి గుణముల నైహికాముష్మిక
సుఖసాధనంబుల సువ్వె పతికి;

తే. నేమి సేయుదు? మందిరం బిపుడు పాడు
వాఱుచున్నది' యనఁగ నప్పలుకు లెల్ల
బోయవలలోన నున్నకపోతి విని మ
నంబు సంతోషపూరమగ్నంబు గాఁగ. 7

క. పతిమదికి నింత యెక్కిన
యతివగదా పుణ్యవతి; ప్రియాలాపము లీ
గతి వినఁ గాంచితి; జన్మము
గృతకృత్యం బయ్యె నాకు; గెలిచితి జమునిన్. 8

వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన తెఱం గెఱింగించి' విధికృతంబునకు వగవం బనిలే దని పలికి మఱియు నిట్లనియె; 9

★చ. శరణము సొచ్చినం దగఁ బ్రసన్న తఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధికధర్మముగా బుధకోటి సెప్పు; నీ
వరసి మహార్తు వీని శరణాగతు నోపినభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము ప్రభూతపుసీతునఁ గొంకు వోయెడున్. 10

క. అని యేర్పడ భాషించిన
విని శోకము డిగ్గ విడిచి విహగము గరుణం
దనజాతి సెప్పి తగ ని
ట్లనియె మనుజభాషణముల నాలుబ్ధకుతోన్. 11

క. 'ఓయన్న ! డస్సినాఁడవు;
మాయింటికి నతిథివైతి; మసలక నీకుం
జేయవలయు నాతిథ్యం;
బేయది భవదీప్సితార్థమెఱిగింపు తగన్ 12

*చ. అనవుడు నుల్ల మెంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి 'సీ
తున సకలాంగకంబులుఁ బ్రతున్న ము లయ్యెడు దీనిఁ బాపవే,
యనిన విహంగమంబు రయ మారఁగఁ నచ్చటిపుల్లలెల్ల ము
క్కునఁ గొని తెచ్చి ప్రోవిడి యకుంఠితమైనదయాగుణంబునన్. 13

వ. ఆపొంతపల్లియకు రయంబున జని పుల్లతల సంగతంబైన యింగలంబు. 14

క. కొనివచ్చి పుల్లప్రోవునఁ
దనుకంగాఁ జేసి నెమ్మి దళుకొత్తఁగ ని
ట్లను బోయతోడ 'మే నీ
యనలంబునఁ గాఁచికొనుటకై లె మ్మనఘా! 15

చ. అనవుడు వాఁడు గువ్వహృదయం బలరం దనయంగకంబు ల
య్యనలశిఖాకలాపమున నల్లన యల్లన కాంచి శీతబా
ధన ముడుగంగఁ జేయఁగఁ బదంపడి యాఁకలి సాలఁదోఁచెఁ దోఁ
చిన నెఱిఁగించె గువ్వ కదిసేయ నుపాయము లేక యాత్మలోన్. 16

వ. వగచి వెలువెలంబాఱి తలంచికొని వాని కిట్లనియె; 17

తే. ఖగములకు జీవనం బన గలదె? సంగ్ర
హించినట్టిది యాఁకలి కేమి యైన
మాకు దొరకొన్నఁ దిందుము గాక; యైన
నీవు డస్సితి వాతిథ్యనియతి వలయు. 18

వ. నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము: 19

క. అని పలికి యగ్ని వలగొని
తనదేహము దానిలోనఁ దడయక యిడినం
గని బోయ విస్మయంబున
మనమూనఁగఁ గొంతసేపు ప్రాన్పడి యుండెన్. 20

✶మ. కలదే యిమ్మెయి పౌరుషంబు జగతిం; గారుణ్యా మేపార ని
ప్పులుఁ గిట్లిచ్చునె మేను? నాదుచరితంబుల్ నిందకుం బట్టులై
తలఁపన్‌వచ్చిన నింతకీ డగునె? యేతత్క్రూరతాఘోరచే
ష్టలు మానంగలవాఁడ; బక్షి గురువై సంధించె సద్బోధమున్. 21

వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు నంత
నిలుపక. 22

✶మ. 'ఇది యిట్లాలిని బంధులం దొఱగి తా నీయగ్నిలోఁ గూలె; నొ
ప్పిదమై యుండఁగ నిట్టితెంపు వెలయం బెంపారు వైరాగ్యసం
పద పాపంబుల నెల్ల ద్రుంపఁగ మహాప్రస్థానపుణ్యాత్మ మొం
దెద నే నిప్పుడ' యంచు మానసము శాంతిం బొంద నిర్మోహుఁడై. 23

క. వలలోన నున్నపులుఁగుల
వెలువడఁగా విడచి వలయు వెండియుం దనకుం
గల పక్షినిహతిసాధన
ములు నచటనె యుండఁబోయె బోయ నియతుఁడై. 24

ఆ. అక్కపోతినాథుఁ డగ్ని లోఁ బడుటకు
శోకవహ్నిఁ జి త్త మా కులముగ
నెలుఁగురాలుపడగ నిట్లని పలవించె
నశ్రుజలతరంగితాస్య యగుచు. 25

క. నాయాఁకలి కోర్వ వెపుడు;
వేయైనను నే గొనంగ వెండి యనుభవిం;
తాయాసపడుట గనుఁగొని
నోయుదు; ననుఁ బాసి యిటు సనుట దగ వగునే? 26

సీ. ఇగురుజొంపంబుల నింపారువిరులను
బొలుపైన పొదలక్రేవలకుఁ దార్చి
సెలయేఱులందలి తెలినీటఁ దనుపుసొం
పెలసినగిరుల తెప్పలకుఁ జేర్చి,
మావిమ్రోకల నెలదీవల, జెన్నొందు
తోఁటలకడ నలితోడఁ జెంది,
యలరునెత్త మ్ములకలిమిఁ జెల్వుగుడిగ్గి
యలతీరభూముల నల్లఁ బొంది,

తే. నన్ను మనమునఁ దేల్చి యానందమొందఁ
గేలి సలిపెడు నీదగులీల మఱవ
నావశంబె ప్రాణేశ! ప్రాణంబు లిపుడ
నిన్నుఁ గూర్చి యేతెంతు నీచన్నకడకు. 27

క. ఱేనియనుమరణమునఁ దన
మేను విడిచినట్టికాంత మేలిపదవికిం
దాను నతండును నరిగి య
నూన స్థిరసుఖము లందుచుండుట విందున్. 28

క. అని పలికి యపుడ యనలము
ఘనముగ దరికొల్పి మది వికాసముఁ బొందం
దనువల్లభుఁ దలఁచుచు వల
గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. 29

క. స్ఫురితవిమానముమీఁద న
మరతతి వేష్టింప రత్న మయభూషణసుం
దరదివ్యమూర్తి వెలిఁగెడు
వరునిఁ గలిసి పరమసౌఖ్యవై భవ మెసఁగన్. 30

తే. లీల మూరిఁబో నచ్చరలేమపిండు
బలసి యభినందనము సేయఁ బొలిచె; నిట్లు
సనిన పక్షియుగ్మంబు వర్తనము దోఁచెఁ
బుణ్యావర్త నుఁ డగుట నాబోఁయ కపుడు 31

క. ఏనును ని ట్లగుదు ననుచు
నూనిన కౌతూహలమున నుల్లము వొదలన్
మేనెల్ల ముండ్లు సింపఁగఁ
గానఁ దఱిసి గళితరక్తకలితాకృతియై. 32

తే. అరుగుచుండువాఁ డొకచో దవానలంబు
గట్టెదిరి కాననంబెల్ల ముట్టి మండ
సంప్రమోదితచిత్తుఁడై చక్కఁ జొచ్చి 33
యొడలు దొఱఁగి దేవత్వంబు వడసియొప్పె

## అధ్యయన వేదిక

**అర్థములు :**

కపోతము = పావురము; ఉపాఖ్యానము = కథ; శరణాగతులు = ఆపదలలో నున్నవారు; సంరక్షణ = రక్షించుట; ధరణి నాయకుడు = రాజు; ఇతిహాసము = పూర్వ వృత్తాంతము, కథ; బెగ్గిలి = భయపడు; వెరపు = భయము; మిఱుత = ఉన్నత భూమి; వనస్పతి = చెట్టు; సెజ్జ = శయ్య; శీతార్తుడు = చలిచే బాధపడువాడు; లుబ్దకుడు = బోయవాడు; మహీరుహము = చెట్టు; కోటరము = చెట్టు తొఱ్ఱ; వల్లభ = భార్య; ప్రభూతపు సీతునన్ = అధికమైన చలితో బాధపడువాడు; విహంగము = పక్షి; జాతి = పుట్టుక; ప్రతున్నము = మిక్కిలి వ్యథ పెట్టబడినది; యింగలము = నిప్పు; అనలము = అగ్ని; గువ్వ = అడవి పావురము; ఖగములు = పక్షులు; దొరకొన్న = లభించిన; మహాప్రస్థానము = గొప్ప పాండిత్యము; పలవించెన్ = దుఃఖించెను; కల్మషము = పాపము

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

శీతార్తుడు; ఉజ్జ్వలాంగి; సకలాంగకములు; శరణార్థి; కౌరవేంద్ర; ప్రాణేశ; కపోతోపాఖ్యానము; అత్యధికము; అమ్మహీరుహము; అన్నరాధముడు; సద్బోధము

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

దనుజమంత్రి; పుణ్యవర్తనుడు; స్థిర సుఖము; ఉజ్జ్వలాంగి; శోకవహ్ని.

**అర్థ సందర్భములు :**

1. "శిలయు సెజ్జగాగ శీతార్తుడైయుండె"
2. "జన్మము గృతకృత్యం బయ్యెనాకు"
3. "గెలిచితి జమునిన్"
4. "విధి కృతంబునకు వగవఁ బనిలేదని"
5. "భవదీప్సి తార్థ మెఱిగింపుతగన్"
6. "పక్షి గురువై సంధించె సద్బోధమున్"
7. "దేవత్వంబు వడసి యొప్పె"

**ప్రశ్నలు :**

1. బోయవాడు కోటరంబున కెందులకు జేరెను?
2. కపోతము భార్యకై ఎట్లు వాపోయెను?
3. కపోతము బోయవాడినెట్లు కాపాడెనో వివరింపుము?
4. బోయవాడు వైరాగ్యంబు బొంది ఏమి జేసెను?

***విద్యార్థులకు సూచన :***

"శరణాగతులను రక్షించుట" అను అలవాటును అభివృద్ధి గావించు కొనవలయును. తిక్కనగారు రచించిన భారతములోని వివిధ పర్వములలోని ముఖ్య పద్యములను భావయుక్తముగా చదువుటను అలవరచుకొనవలయును.

***ఉపాధ్యాయులకు సూచన :***

శరణాగత సంరక్షణకు సంబంధించిన వివిధ కథలను గూర్చి వివరించుట.



# 4. బాటసారి

*- శ్రీశ్రీ*

*1940 సంవత్సరము తరువాత ఒక దశాబ్దముబాటు ఆంధ్ర సాహిత్యలోకమును ఉత్తేజ మొనర్చిన అభ్యుదయ కవితోద్యమమూల విరాట్టు శ్రీశ్రీ. వాస్తవికతతో బాటు అధివాస్తవికతను, వ్యక్తి చైతన్యముతోబాటు సమాజ చైతన్యమును సమానాధికారముతో ప్రవచించిన ప్రవక్త శ్రీశ్రీ.*

*శ్రీశ్రీ పూర్తి పేరు **శ్రీరంగం శ్రీనివాసరావు.** 1910 సంవత్సరములో గురజాడ కవి **"ముత్యాల సరాలు"** రచించిన సమయములోనే మన శ్రీశ్రీ విజయనగరమున జన్మించిరి. అభ్యుదయ కవిత్వ ఉద్యమ నాయకులుగా, యుగకర్తగా ప్రసిద్ధులు. పీడిత జనుల కోసం కవిత్వాన్ని నడిపించిన మానవతావాది. 1969వ సంవత్సరం వరకు అభ్యుదయ రచయితల సంఘానికి, ఆ తర్వాత విప్లవ రచయితల సంఘానికి అధ్యక్షులు. వివిధ సాహిత్య ప్రక్రియలలో రచనలు చేసి బహుముఖ ప్రజ్ఞావంతులనిపించుకొన్నారు. వీరి రచన **'ఖడ్గసృష్టి'**కి సోవియట్టు భూమి పత్రికవారి నెహ్రూ బహుమతి లభించినది. మరియు వీరు కేంద్ర సాహిత్య అకాడమీ, మద్రాసు రాజ్యలక్ష్మీ ఫౌండేషను వారి బహుమతులు అందుకొనిరి. వీరికి **"సాహిత్యాచార్య"** బిరుదమున్నది. **మహాప్రస్థానం, సిరి సిరి మువ్వశతకం, ఖడ్గసృష్టి, ప్రాసక్రీడలు, మూడు యాభైలు, పరిణయ రహస్యం, లిమబుక్కులు** మొదలగునవి వీరి రచనలలో పేర్కొనదగినవి.*

*మానవ సమాజమును శ్రామిక వర్గ చైతన్యమును గూర్చి శ్రీశ్రీ తమ కవితలో కడు రమ్యముగా వివరించిరి. నలిగిపోతున్న జీవిత సత్యములను కవితా వస్తువులుగా తీసికొని **"బాటసారి"** లో ''కూటికోసం కూలికోసం'' పట్టణంలో బ్రతుకుదామని తల్లి మాటను పెడచెవిని పెట్టి బయలుదేరిన బాటసారి నిస్సహాయ స్థితిలో మరణించుటను శ్రీశ్రీ కడుహృద్యముగా వర్ణించిరి.*

కూటికోసం కూలికోసం
పట్టణంలో బ్రతుకుదామని
తల్లి మాటలు చెవిని పెట్టక
బయలుదేరిన బాటసారికి,
మూడురోజులు ఒక్కతీరుగ
నడుస్తున్నా దిక్కులు తెలియక —

నడి సముద్రపు నావ రీతిగ
సంచరిస్తూ, సంచలిస్తూ,
దిగులు పడుతూ, దీనుడౌతూ
తిరుగుతుంటే —

చండ చండం, తీవ్ర తీవ్రం
జ్వరం కాస్తే,
భయం వేస్తే,
ప్రలాపిస్తే —

మబ్బుపట్టి, గాలికొట్టి,
వానవస్తే, వరదవస్తే,
చిమ్మ చీకటి క్రమ్ముకొస్తే
ఎంతకష్టం !

కళ్ళు వాకిట నిలిపిచూచే
పల్లెటూళ్ళో తల్లి ఏమని
పలవరిస్తోందో......?

చింతనిప్పులలాగు కన్నుల
చెరిగిపోసే మంటలెత్తగ,
గుండుసూదులు గ్రుచ్చినట్లే
శిరోవేదన అతిశయించగ,
రాత్రి, చల్లని రాతి పోలిక
గుండె మీదనె కూరుచుండగ,

తల్లి పిల్చే కల్ల దృశ్యం
కళ్ళ ముందట గంతులేయగా
చెవులుసోకని పిలుపులేవో
తలచుకుంటూ, కలతకంటూ —

తల్ల డిల్లే,
కెళ్ళగిల్లే,
పల్లటిల్లే బాటసారికి
ఎంత కష్టం !
అతని బ్రతుకున కదే ఆఖరు !

గ్రుడ్డి చీకటిలోన గూబలు
ఘూకరించాయి ;
వానవెలసి మబ్బులో ఒక
మెరుపు మెరిసింది ;
వేగు జామును తెలియజేస్తూ
కోడి కూసింది;

విడిన మబ్బుల నడుమనుండి
వేగుజుక్కా వెక్కిరించింది ;
బాటసారి కళేబరంతో
శీతవాయువు ఆడు కుంటోంది !
పల్లెటూళ్ళో తల్లి కేదో
పాడుకలలో పేగు కదిలింది !

## అధ్యయన వేదిక

**అర్థములు :**

తీరు = విధము; సంచలించుట = కదలుట; ప్రలాపించుట = అర్థ శూన్యములైన మాటలు మాటలాడుట; శిరోవేదన = తలనొప్పి; ఘూకరించుట = గర్జించుట.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

దీనుడౌతు; శిరోవేదన; మంటలెత్తగ.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

శిరోవేదన; శీతవాయువు.

**అర్థసందర్భములు :**

1. "సంచరిస్తూ, సంచలిస్తూ"
2. వేగుజుక్క వెక్కిరించింది.
3. అతని బ్రతుకున కదే ఆఖరు.

**ప్రశ్నలు :**

1. శ్రీశ్రీ "బాటసారి" పాఠ్యములో తెల్పిన సందేశమేమో విపులముగా వివరింపుము.

***విద్యార్థులకు సూచన :***

1. శ్రీశ్రీగారి గేయకవితలను చదువుటకు అభ్యాసము గావింపుము.

***ఉపాధ్యాయులకు సూచన :***

1. శ్రీశ్రీగారు "భావకవితాయుగ చక్రవర్తి" అనెడి పేరుకు గల సార్థకతను వివరింపుము.



# 5. గృహస్థ ధర్మము

## - తుమ్మల సీతారామమూర్తిచౌదరి

*అభినవ **తిక్కన, తెనుగులెంక, కళాప్రపూర్ణ** బిరుదాంకితులైన శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా, కావూరు గ్రామంలో 1901 సం॥లో జన్మించిరి.*

*ఆధునిక యుగంలో సంప్రదాయరీతిని అధునాతన భావనకు పట్టుగొమ్మగా నిలచిన జాతీయోద్యమ కవి. సంస్కృతాంధ్రాలలో పండితులు. గాంధీగారి ఆత్మకథను తెనిగించి మహాత్ముని ఆస్థానకవిగా ప్రసిద్ధులయ్యారు. ఆంధ్రులలో కార్యోత్సాహాన్ని కలిగించడానికి కవిత్వాన్ని సాధనంగా ఉపయోగించుకొన్నారు. పొన్నూరులో గంటకు 120 పద్యాల చొప్పున రెండు గంటలపాటు ఆశు కవిత్వం చెప్పి పండితులను మెప్పించారు. వీరి రచనలో తెలుగు నుడికారాలు జాతీయాలు ఎక్కువగా కన్పించును.*

*ప్రస్తుత పాఠ్యభాగమైన **'గృహస్థ ధర్మము', 'కదంబకైత'** అను గ్రంథము నుండి గ్రహింపబడినది. **ఆత్మార్పణము, రాష్ట్రగానము, అమరజ్యోతి, ఉదయగానం** అనునవి వీరు రచించిన ఇతర గ్రంథములు. వీరు సమతకు, మానవతకు ప్రాముఖ్యమిచ్చారు. అన్ని దానాలకన్నా అన్నదానం గొప్పది. సామాన్య మానవుడు తన మంచితనం వలన ఎలా మహిమోపేతుడయ్యాడో చక్కగా వివరించిరి.*

కం. అతడు పరివ్రాజకుఁడా
యతి పుణ్యక్షేత్ర ధర్మ నాస క్త మతిన్
క్షితి నెల్లం దిరుగుచు నొ
క్క తఱిన్ జనుదెంచె నొక్క కటకమ్మునకున్. 1

తే.గీ. మూఁడు నా ళ్లయ్యె నతఁ డన్నమునకు నోచి
సై ఁపలేఁడాయె సన్యాసి జాఠరాగ్ని
అరిగె నంత "భిక్షాందేహి" యనుచుఁ బెక్కు
తావులకు బోయి యడుగులు తడఁబడంగ. 2

తే.గీ. వంట యగుచున్న దనె నొక్కయింటి మగువ
మరల రమ్మనె నొక్కమందిరపులేమ
నేఁడు వీలుగా దనె నొక్క నెలవు నెలఁత
మెతుకు నిప్పచ్చయయ్యె నయ్యతికి నపుడు. 3

ఆ.వె. ఉస్సురనుచు బోయి యొకవీథిలోఁ గూలి
యింత మహికి నన్న మిడు ప్రభుండు
నన్నుఁ ద్రోయఁ గారణంబేమి యే నెట్టి
యెగ్గు సల్పినాడ నిట్లు కుముల 4

కం. ఓ పరమేశ్వర ! నను రా
రాపులఁ బెట్టకుము కనికరమ్మునుఁ గనుమే
నా పన్నుఁడ నా ప్రాణము
గాపాడు మటంచుఁ బెక్కుగతులన్ వగచెన్ 5

కం. భగవంతుఁ డప్పు డొక వృ
ద్ధుగ నయ్యమిమౌళిమ్రోలఁ దోఁచి యలతిగా
నగుచున్ "మనుజుల నడుగక
వగచెద వేలయ్య వెఱ్ఱి వట్టెనె నీకున్" 6

కం. అనవుడు 'నేనెందఱనో
కనివేఁడితి భిక్ష; నరులు కారావారల్?
నను వెఱ్ఱి పట్టె నందువు
నినుఁ బట్టినదందు నే' ననెన్ యతి పెలుచన్. 7

ఆ.వె. ముసలి నవ్వి నవ్వి రుసరుసయేలనీ
కన్నవారు నరులుగారు బోడి !
యీ సులోచనంబు లిడెదను వీనితోఁ
జూడుమని బిరాన సురిఁగిపోయె. 8

ఆ.వె. తబిసి యబ్రపడుచుఁదాత యిచ్చిన కంటి
జోడు నవధరించి చూచెఁ బురము
నదిర ! వీటి వారలందఱాతనికి భీ
కరమృగమ్ములట్లు కానబడిరి 9

కం. ఒక్కఁడు సింహముగా నిం
కొక్కఁడు శార్దూలముగ మఱొక్కఁ డెలుగుగా
నొక్కఁడు ములుపందిగ వే
ఱొక్కఁడు తిమ్మఁడు గఁ దోఁచె నోరల నెల్లన్ 10

తే.గీ. అద్దముల దీసి చూచెనా యన్ని దెసల
మానవులె కాని మఱియొండు ప్రాణి లేదు;
ఏమి విడ్డార మిది యని స్వామి మురిసి
తిరిగి తిరిగి పట్టణమెల్లఁ దేఱి చూచె 11

ఆ.వె. రాచబాట ప్రక్కనేచి తనర్చిన
రావి నీడఁ బాదరక్ష కుట్టి
కుక్షి నింపుకొనెడి గొడగరి మాత్రమే
రీతిఁ గనిన నరునిభాతిఁ బొలిచె 12

తే.గీ. విస్మయంపడి సన్న్యాసి వీట నీత
డొక్కఁడే నరుడా! యిది నిక్కమైనఁ
జనునెయే నిస్సిరో కడజాతివాని
బిచ్చమడుగుట గొదనెంత నొచ్చుచున్న. 13

ఆ.వె. ఏను; వీడు, లోక మిది యెల్ల నాత్మప
దార్థమగుట రూఢమౌనుగాని
దిక్కుమాలినట్టి దేహాభిమానంబు
కదలదయ్యె నన్ను వదలదయ్యె 14

తే.గీ. వనజ భవునుండి చిఱు చీమ వఱకు నఖిల
కాయముల సాక్షిగా నిల్చి క్రాలు నట్టి
దొక్క చైతన్యమే యని వక్కణించు
చదువు నేర్చియు నేర్వని జడుఁడ నైతి 15

ఆ.వె. గంగయందు దోఁచు కమలాప్తునకు మా
తంగవాపి నలరు తరణికినిర
వంతయేని భేద మగపడునాయింత
తెలిసి దారిదప్పు దేబెనైతి 16

కం. చేకొని "త్వయి మయిచాన్య
త్రైకో విష్ణు "వనుసూక్తి నెన్నోసభలన్
వాకొంటిఁగాని పూర్ణవి
వేకము గననైతి మబ్బు వీడమి నకటా ! 17

*కం. చేతలకురాని కూతల
వ్రాత నెవ్వరికి ముక్తి వచ్చును విశ్వ
ప్రీతి వెలివిరిసి తేఱిన
చేతమ్మునఁదక్క సమత చేతను దక్కన్ 18

కం. అని వగచు పరివ్రాజకు
ననుతాపము చర్మకారుఁడాత్మ బలమున్
గని యతి రాజా! మ్రొక్కులు
కొనుఁడనియెన్ వినయ భార కుంచితతనుడై. 19

కం. మీ యంగద మీ యఱమర
మీ యలజడి గంటి సంయమీ! యిక దిగులున్
ద్రోయుఁడు మీ మది కింపగు
చాయన్ దొలగింతు మీవిచారముననియెన్ 20

తే.గీ. మధుర భక్ష్యంబులమ్ము బ్రాహ్మణుని విపణి
తనకు నెదురుగ నుంట నత్తావునకుయ
తీంద్రునిం జేర్చి యీ సామి యెంత కోరు
నంత యిమ్ము మిఠాయి విప్రాగ్ర! యనియె 21

కం. నేఁడేను సిద్ధపఱిచిన
జోడునకున్ ముట్టునట్టి సొమ్మెల్లను నీ
కోడక యిచ్చెదనని నెద
యీడెఱుఁగని కరుణ పొంగి యివతాళింపన్ 22

ఆ.వె. మంచిదనియె బేరి; మస్కరి బూరెలొ
బ్బట్లు లడ్లు కోవ లంగరొల్లె
లౌఁగు లఱిసె లాదియైన పణ్యారముల్
కుతుక బంటి గాఁగఁ గుడిచి త్రేఁచె. 23

కం. రాజును మంత్రియు నపుడే
వాజులపై వచ్చిరటకు; వారికి వినయ
శ్రీ జాటి గొడగరి యెదో
తాఁజెప్పఁ దలంచి వెఱపు దందడి సేయన్ 24

ఆ.వె. పలుకలేక తొట్రు పడుచుండనోయి! జం
కేల నీతలంపు నెఱుక పఱుపు
మనె మహీధవుండు; మనసప్డు పాదునం
బడఁగ నుడివె నిట్లు పాదు కృత్తు. 25

తే.గీ. దేవరా! చర్మకార వృత్తిని రవంత
నేర్పుగల వాడనే, నివి నేఁడు తీర్చి
నట్టి చెప్పులు, చక్కని గట్టి చెప్పు
లర్హమగు మూల్య మిడి వీని నందు కొనవె ! 26

ఆ.వె. అనుడు మానవేంద్రుఁడతనికి శతరూప్య
ములకుఁజాలు పసిడి ముద్ర నొసఁగె
నేల యింతపైఁడి యీ తోలుముక్కల
కోదొరా! యటంచుఁబేద బెదర. 27

కం. ఏమో నామది కరఁగిన
దీమాత్ర కు నన్నుఁబ్రోత్సహించిన దిదిహె
చ్చేమఱిలొచ్చే తడవకు
భీమాను మటంచు రాజు ప్రేమలు కురిసెన్ 28

కం. తామెంత యిచ్చినను నే
నామొత్తము నెల్ల నీ బేహారి కిడవలెన్
భూమీశ! యనె గొడారి య
దేమనెఁబతి; యతడు గ్రంథమెల్లను వినిచెన్ 29

కం. ఆజోడు నిట్లు తెమ్మని
రాజు నిజాక్షులకుఁజేర్పరథ్యాజనమా
భూజాని కుగ్రజంతు స
మాజమయై కానిపించె మది ఱిచ్చపడన్ 30

ఆ.వె. తాను సింగముగ, ప్రధానుండు బెబ్బులి
గా, వణిక్కు కొంగగా, యతీశుఁ
డావుగా, గొడారి యతఁడొక్కడె నరుండు
గా ధరాధిపతికిఁ గానిపించె 31

ఆ.వె. దొరకు నా వహిల్లె దొరలేని యగ్ర; మా
యయ్య చర్మ కారు నట్టె చూచి
యెట్లు వచ్చె నీకు నింత గొప్ప తనమ్ము?
మమ్ము జుట్టు కొన్న మైల యెద్ది? 32

ఆ.వె. శ్రుతులు నేర్వ లేదు వ్రతములు పాటింప
లేదు తపము సేయ లేదు నదుల
మునుఁగ లేదు జన్నముల నేను గావింప
లేదు సురలఁ దేర్ప లేదు గాని 33

తే.గీ. ఈశ్వరార్పణ దృష్టితో నెల్ల పనులు
పూనెదను నేను ఫలసంగబుద్ధి లేక
వచ్చు బడియందు సగము పాలిచ్చుచుందు
నతిథి కభ్యాగతునకు నిండారు పేర్మి. 34

ఆ.వె. కడమ సగములో సగమ్ము నాపితరుల
కర్హమైన తిండికై వ్యయింతు
మిగిలినట్టి నాలుగగు పాలు వెచ్చింతు
నా కుటుంబమున కనాతరముగ 35

ఆ.వె. ఏను బడసినట్టి మానవత్వమునకీ
నియతి హేతువగునె నృపవతంస
యింత నాఁటి నుండి యిదియ నా జీవన
మార్గమనె వినీతమై గొడారి. 36

తే.గీ. రాజపుడు కన్ను విచ్చి యౌరా! త్వదీయ
పథము సామాన్యమా యోగివరుఁడ వీవు
ధర్మమున కవలంబమై తనరె దీవు
దయకు నెలవైన మానవోత్తముఁడ వీవు 37

తే.గీ. చదువులేకున్న నేమి కోవిదుల మదికి
బెదరు పుట్టించు నెఱుక నేలెదవు నీవు
నాగురుండవు నీవని నాటి నుండి
తన్ను దిద్దు కొనెంబ్రజాతతిని దిద్దె 38

★కం. యాగమునకంటె గేహ
త్యాగమ్మున కంటె నధికతరపుణ్యదమౌ
యోగము గృహస్థ ధర్మము
రాగము రావలయు మోక్ష రతులకు నిందున్ 39

ఆ.వె. తల్లి నాశ్రయించి పిల్లలందరు సుఖ
మందురీతి లాఁతి యాశ్రమంబు
లన్నియును గృహస్థు నండదండల నార్తి
భారదూరమైన బ్రదుకు గాంచు 40

★ఆ.వె. అతిథి శిష్టమైన యన్నము, నిజవధూ
తృప్తి, దానశీల, మింద్రియముల
నగ్గపఱుచు కొంట, యణకువ, పితృభక్తి
వలచు గేస్తుఁ జూచి వణఁకు నఘము. 41

## అధ్యయన వేదిక

**అర్థములు :**

పరివ్రాజకుడు = సన్యాసి; కటకమ్ము = రాజధాని; లేమ = స్త్రీ; నిప్పచ్చు = లేకుండుట; రాపు = కష్టము; యమి = ముని; అలతిగా = కొద్దిగా; పెలుచన్ = అతిశయము; కుక్షి = పొట్ట; గొడగరి = చెప్పులు కుట్టేవాడు; తబసి = ముని; దాత = బ్రహ్మ; వాపి = బావి; వాజి = గుఱ్ఱము; పొలిచె = ప్రకాశించె; చేతము = మనస్సు; దేబె = దీనుడు; బేరి = వ్యాపారి; సులోచనములు = కళ్ళజోడు; సంయమి = ముని; గొడారి = చెప్పులు కుట్టేవాడు; దందడిసేయన్ = తొందరచేయగా; వెఱపు = భయము, అఘము = పాపము; వినీతమై = వినయవంతుడై; అగ్గపఱచుట = అణచుట.

**సంధులు :**

**క్రింది వానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వివరింపుము.**

మూడునాళ్ళయ్యె, అయ్యతి, పరమేశ్వర, దేహాభిమానము, కమలాప్తుడు, నిజాక్షులు, భూమీశ, ఈశ్వరార్పణ, మానవోత్తముడు, అత్తావు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి సమాసముల పేర్లు తెలుపుము.**

పుణ్యక్షేత్రము, పెక్కుగతుల, గృహస్థ ధర్మము, రాచబాట, రావినీడ, వనజ భవుడు, విశ్వప్రీతి, విప్రాగ్రుడు, నిజాక్షులు, పసిడిముద్ర, ఉగ్రజంతువు, మానవేంద్రుడు, ఈశ్వరార్పణ, ఎల్ల పనులు, ధరాధిపతి, భీకర మృగము

**అర్థ సందర్భములు :**

1. మనుజుల నడుగక వగచెద వేలయ్యావెట్టి వట్టెనె నీకున్.
2. 'కదలదయ్యె నన్ను వదలదయ్యె'
3. వ్రాత నెవ్వరికి ముక్తి వచ్చును?
4. అధిక తర పుణ్యదమౌ యోగము గృహస్థ ధర్మము.

**ప్రశ్నలు :**

1. పరివ్రాజకుడు భిక్ష దొరకక బాధపడిన విధమెట్టిది?
2. భగవంతుడు సన్యాసికేమిచ్చెను? దాని మహిమ ఎట్టిది?
3. సమత - మానవత - వివరింపుము.
4. చర్మకారుడు సన్యాసినెట్లాదరించెను?
5. రాజు - చర్మకారుల సంభాషణను వివరింపుము ?

***విద్యార్థులకు సూచనలు :***

మంచితనమే మానవత్వమునకు నిదర్శనమనెడి సూక్తిని సార్థకము గావింపుము.

***ఉపాధ్యాయులకు సూచనలు :***

దాన గుణముయొక్క గొప్పతనమును, మానవత్వపు విలువలను తెలుపు కొన్ని కథలు తెలుపుట యుక్తము.



# 6. సుశర్మోపాఖ్యానము - (పద్మతీర్థప్రభావము)

*- తెనాలి రామకృష్ణకవి*

*సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ కవులలో తెనాలి రామకృష్ణుడొకడు. **శృంగారనైషధము, మనుచరిత్ర, ఆముక్త మాల్యద, వసుచరిత్ర, పాండురంగ మాహాత్మ్యములు** ఆంధ్ర పంచకావ్యము లనబడును. అట్టి పంచకావ్యములలో నొకటయిన పాండురంగ మాహాత్మ్యమును తెనాలి రామకృష్ణకవి రచించి తన జన్మను చరితార్థము గావించుకొనెను. ఈ కవి 16వ శతాబ్దమునకు చెందినవాడు. **ఘటికాచల మాహాత్మ్యము, ఉద్భటారాధ్య చరిత్రములు** ఇతని యితర రచనలు. పాండురంగ మాహాత్మ్యమును విరూరివేదాద్రికి అంకితమిచ్చెను. ఈ కవికి **"కుమారభారతి"** అను బిరుదము కలదు. **"వికటకవి"** గా కూడ ప్రసిద్ధులు.*

*పాండురంగ మాహాత్మ్యము భైమీ నదీతీరమందలి పుండరీక క్షేత్ర మహత్వమును వర్ణించు క్షేత్ర మాహాత్మ్యము. ఇది స్కాందపురాణము నుండి గ్రహింపబడినది. క్షేత్రము, తీర్థము, దైవము అను మూడును ఉదాత్తముగా నుండు గొప్ప ప్రభావము గల అయిదు ఆశ్వాసముల ప్రౌఢ ప్రబంధము.*

*పాండురంగ మాహాత్మ్యము పంచమాశ్వాసము నుండి ప్రస్తుత పాఠ్యభాగము స్వీకృతము. తీర్థప్రభావములు వర్ణించుచు, పద్మతీర్థప్రభావము, సుశర్మ యొక్క కథ వివరించుటతో పాఠ్యాంశము ప్రారంభమగును.*

క. ఒకఁడు సుశర్మాఖ్యుఁడు ఘా-
తుకుఁడు గలఁడు; కల్లుద్రాఁగుఁ; దునుము ధరామ
ర్త్యకులులఁ నఱదలఁచున్ గురు-
నకుఁ; గనకము దొంగిలున్ దినము నజపుత్రా! 1

క. ఆ వృషలీపతి యావ
జ్జీవంబుగ నంతనంతఁ జేసిన నానాం-
హో విసరంబులు పటమునఁ
గోవలువడ వ్రాసి చిత్రగుప్తుఁడు దాఁచెన్. 2

శా. ఆ నీచుడొకనాఁడు, వాఁడిమిఁ జతుర్వ్యాధాన్వితుండై, పెనుం
గానన్ దెర్వులు గట్టి యేఁగుప్రజలన్ గట్టిండియై దోఁచి, నీ
రానన్ రోయుచుండె దప్పికొని మధ్యాహ్నోతపాపాత జ-
గ్లానిన్, దత్సమయార్తకాసరముఁ బోలజాచి, నల్దిక్కులన్ 3

ఆ. అంతఁ బద్మతీర్థమట వాఁడు గని, యందుఁ
జెమట వాయ మునిఁగి విమల వారిఁ
గ్రోలి, రావి మొదలఁ గూర్చుండి, యొకయింత
నిలిచి, యింటికరిగె వలయురీతి. 4

క. ఆ విషము మేన నూని త-
దావిర్భవ దఘచయంబు నఱుగఁగ రాచెన్
బోవక, నలసంక్రాంత మ-
హావిషధరవిషము కలి లయము చేయుక్రియన్ 5

ఆ. అంతఁ గొంతకాలమరుగంగ, మృత్యు గో
చరతనున్న యా సుశర్మకడకు
లిఖిత తత్కృతాఘలిపి యైన పటముఁ దె
ప్పించి చిత్రగుప్తుఁడెంచి చూచి. 6

క. దురిత శతకోటులం ద-
క్షరమొకటియుఁ గానలేక, కంపవికృతి భం
గురతాయుతుఁడై, జముకడ.
కరిగి తగం బలుకునతఁడు ప్రాంజలి యగుచు. 7

*ఉ. డక్కఁగ వ్రాసితిన్ మును పటమ్మునయందు సుశర్మపాపముల్;
లెక్క యెఱుంగరాదు లవలేశము దానికి; నట్టి వ్రాఁతయం
దక్కజమిప్పుడొక్కటియు నక్షరరూపము లేదు, దేవ! నేఁ
డక్కడితంబు గట్టియిడినట్టుల యున్నది కప్పుదేఱుచున్. 8

ఆ. హతలతాంతమైన యారామమును బోలె,
విగతతారమైన విన్ను ( బోలె,
గళిత వర్ణమైన కడితంబు; దీనికి
మీరె తెలియవలయుఁ గారణంబు. 9

క. అని పల్కు నమ్మహామతిఁ
గని జముఁడిట్లనియె 'నీదు కవిలయ నీవ్రా
సినలపి యన్నదొ లేదో !
కనుఁగొనుమీసారి లెస్సగా; గణకవరా ! 10

ఆ. అనుడు నట్లకాక యని చిత్రగుప్తుండు
దండధరుని యాజ్ఞ వెండి నేఁగి,
పటము ప్రతిపుటంబుఁ బరికించి, యందు వీ
క్షించెఁ జక్రపాణి చేతివ్రాఁత. 11

✶ఉ. 'ఈతఁడు పద్మతీర్థమునకేఁగి యొకానొకనాఁడు తత్పయో-
ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్రవధాదిపాతక-
వ్రాతముఁ, దొంటిపుట్టువులఁ బ్రాప్తములైన యఘంబులున్ మరు.
ద్ధూతఘనాఘనావలులతో సరియై సరిపోయె నన్నియున్ 12

క. అనునర్థంబులు గల లిపిఁ
గని చని, జముఁ బల్కునతఁడు గానఁబడదు నే-
మును వ్రాసినయది; యన్యము
కనుపట్టెడు నేలిఖితమొ కాని వినఁదగున్.' 13

ఉ. 'ఈతఁడు పద్మతీర్థమునకేఁగి యొకానొకనాఁడు తత్పయో-
ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్రవధాది పాతక-
వ్రాతముఁ దొంటి పుట్టువులఁ బ్రా ప్తములైన యఘంబులున్, మరు
ద్ధూతఘనాఘ నావలులతో సరియై సరిపోయె నన్నియున్.' 14

సీ. 'అని యెప్పు కొతుకజనకాక్షరశ్రేణి
వీక్షించి వచ్చితి విద్వదింద్ర ః
యిది మీరలెఱఁగిపుఁ డేనాట సకృదవ
గాహనంబున మహాకలుషరాశి-
వలనఁ బూరుషు జేర దలఁగు పుణ్యపుఁ దీర్థ-
మెన్నఁడుఁ గన విన; నీ మదు క్త
లిపి పం క్తి నేకవారపయో విమజ్జన
మాత్రచే నణఁచిన మహిమ గలుగు

తే. దివ్యతీర్థంబువై భవమవ్యయప్ర-
సాదమేదుర మానసౌజ్జ్వల్యకల్య
వచనరచనల వివరింప వలయు; నో ప్ర.
పన్నదై న్యలతా దాత్ర! భానుపుత్ర !' 15

వ. అనిన నప్పద్మమిత్రపుత్రుండు చిత్రగుప్తునకిట్లనియె. 16

✶శా. 'ప్రాశస్త్యంబు వహించు దండకమహారణ్యంబు పుణ్యార్థిసం
చాశత్కోటి విశాలభూమి; ఖలదుష్ప్రాప ప్రభావోదయ
శ్రీ శుద్ధుల్ నగు దాని గౌతమి; గుణోత్సేకంబుకల్మిన్ హృషీ
కేశావాసము పౌండరీకనిలయం బీరెంటి గెల్చున్ దుదిన్. 17

సీ. 'అర్కుండు వెలుఁగుట, యనిలుండు వీచుట,
యింద్రుండు వర్షించు, టిల జలము.
మునుఁగక తిరమౌటయు, నెసంగు నేవిష్ణు-
నాజ్ఞప్తిచే, నెవ్వఁడఖిల జగము
బ్రహ్మయై సృజియించుఁ, బద్మాక్షుఁడై ప్రోచు,
మదనారియై త్రుంచు, మత్త్రభృతుల
లోకపాలకుల నేలోకేశు కరుణా క-
టాక్షంబె యధికృతియందు నిలుపు.,

తే. 'నా విభుండెందునుండు మర్త్యమునఁ బుట్టి
భూతకోటి ననుగ్రహంబునఁ బెనుచుచు

నెందుఁ గ్రుంకి సుశర్మయుఁ జెందె ముక్తి,
దానికెనవచ్చు తీర్థ మీధరణిఁ గలదె' ? 18

వ. అని పద్మతీర్థంబు తీర్థచరణవిహరణచరితార్థంబగు దాని
నానాగుణంబులు నగణితప్రభావంబులని గొనియాడి, 19

క. పెనుఁగృప సుశర్మఁ గనుఁగొని
తనువు నిమిరి యాదరించి దండధరుఁడు, చం.
ద్రునిలీలఁ జల్లనగు చం
దన భూషణ వసన మాల్య తర్పితుఁ జేసెన్. 20

క. ఈగతిఁ గృతాంతుకృపగని
సాఁగి చనియెనతఁడు గగనచరయానమునన్
నాగ నర యక్ష సురపు -
న్నాగానీకములు గొలువ నాకంబునకున్. 21

మ. అమరాధీశుఁడు గౌరవంబెసఁగఁ దన్నర్ధాసనాసీనుఁ జే -
య మరుద్భోగములెల్లఁ గాంచి ధరయందగ్రాన్వయోద్భూతుఁడై.
కమలావల్లభుఁ బౌండరీకపతి సాక్షాద్బ్రహ్మముం గొల్చి. ని-
త్యముఁ దన్మందిరరాడలంకృతియె చేయంజాలె; నేలెన్ ధృతిన్. 22

శా. ఆపంచత్వము గాఁగ నిట్లు హరిగేహక్షోణి సమ్మార్జనం -
బాపాదింప ఘటిల్లు పుణ్యమునఁ, జంద్రావాసముం జొచ్చి, హ-
ర్షాపూర్ణస్థితిఁ బెక్కుభోగములఁ బెక్కబ్దావళుల్ గాంచి, ధా-
త్రీపాలోత్తముఁడై, సుకీర్తియన నుర్విం బెంపునం బుట్టుచున్. 23

క. అతఁడధికభక్తితో నా-
యతకీర్తి స్ఫూర్తివర్తియై వెలసి, జగ-
త్పతి నుచిత పూజనంబులఁ
బ్రతిఘస్రముఁ దెలచు భక్తి పరతంత్ర మతిన్. 24

ఆ. అతఁడు సన్న్యసించె నఖిలభోగంబులు
నిండువయసునాఁడ యుండి యుండి,
నందనందనాంఘ్రి నాళీకసేవోప -
యోగ రాగభోగమొకటి దక్క. 25

సీ. నిలువున నొలిపించె విలువంగడములెల్ల
శరముల యాయంబుఁ బొరయుటుడిపెఁ;
దగ శబ్దమాత్రపాత్రము చేసె గుణలత,
త్రాకుఁనఁ గట్టించె మౌలబలముఁ;
గంచుకివశము గావించె సేనానాథుఁ;
గమరించె సహచరుఁ గటికియెండఁ;
బ్రతిపక్షభావసంగతు డని హితుఁజూచె
వరకేతనము కీర్తిభరము డులిపె;

తే. ధర్మనిర్మలబుద్ధి సుశర్మఁ గదిసి
గెలువఁగా లేక చని, కోపగించి, మదనుఁ;
డుఱక తనవారలతనికి నోడుమనిరె !
పతికిఁ గీడౌట బంట్లపాపంబు గాదె ! 26

క. ఆరాజర్షి పదంపడి
క్షీరోదన్యాయమున విచిత్రగతిన్ ల-
క్ష్మీరమణుఁ గదిసి యేకా -
కారంబున నలరె ముజ్జగంబులు వొగడన్. 27

క. విను, మఖిలదురిత కుల భం -
జన, మంజనమమృతనిధి వశంబగుటకుఁ, గా -
వున సర్వజనోపాస్యం -
బనూన,మత్తీర్థరాజ, మనుపమ, మనఘా ! 28

✶ఉ. భూరిసుఖానుషంగములు పూరుషుఁ బొందవు సోమపాన కై -
దారజలోపయోగములు తత్కలనన్ బసరెక్కు నెత్తికిన్ ;
బేరు శిలాకృతుల్ జఠరపేటిక: కత్తెవులేల ? యెందు నె -
వ్వారికిఁ బద్మతీర్థపతివారికిఁ జేరినఁ గల్గుసౌఖ్యముల్. 29

## అధ్యయన వేదిక

**అర్థములు :**

ఉపాఖ్యానము = కథ; ఘాతుకుడు = క్రూరుడు; ధరామర్త్యకులులన్ = బ్రాహ్మణులను; అఱ = ద్రోహము; నానాంహోవిసరంబులు = పెక్కులైన పాపముల

గుంపులు; కోవలు = దొంతులు; జతుర్వ్యాధాన్వితుండై = నలుగురు వేట కాండ్రతో కూడినవాడై; తేర్పులు కట్టి = దారులు అడ్డగించి; తత్సమయార్తకాసారమున్ = మండుటెండలో బాధపడు దున్నపోతు; విమలవారిన్ = నిర్మలోదకమును; విషము = నీరు; తదా విర్భవదఘచయంబున్ = వాడు చేసిన పాపముల సమూహమును; లిఖిత తత్కృతాఘ లిపి = వ్రాయబడి (సుశర్మచే) చేయబడిన పాపముల వ్రాతకలది; కంప వికృతి భంగురతాయుతుడై = గద్గద స్వరము కలవాడై; అక్కజము = ఆశ్చర్యము; కప్పు దేఱుచున్ = నలుపురంగు తేఱుచు; మిన్ను = ఆకాశము; కవిలియ = గుడ్డ కాగితపు లెక్కల పుస్తకమున; చక్రపాణి = విష్ణువు; ప్రసన్నదైనలతాదాత్ర = శరణార్థులగువారి దైన్యమనెడి తీగకు కొడవలియైనవాడా!; పద్మమిత్రుండు = సూర్యుడు; ఖలదుష్ప్రాప = దుర్మార్గులకు పొందరానిది, హృషీ కేశావాసము = విష్ణువునకు నివాసమగు; మర్త్యమున్ = భూలోకము, గగనచర యానమునన్ = విమానము పయిని, అగ్రాన్వయోద్భూతుడై = బ్రాహ్మణ కులమున బుట్టినవాడై; ఆపంచత్వముగాగన్ = చచ్చువఱకును; ప్రతిఘస్రము = ప్రతిదినము; మౌల బలమున్ = మూలమైన సేనను; సోమపానకైదార జలోప యోగములు = సురత్రాగుట, పొలమునకు పెట్టిన నీరు తానుపయోగించుకొనుటయు.

**సంధులు :**

**ఈ క్రింది వానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

అమ్మహీపతి; పుణ్యార్థి; ప్రభావోదయము; గుణోత్సేకంబు; అమరాధీశుడు; రాజర్షి; క్షీరోదకములు; ముజ్జగములు; దామోదరుడు.

**సమాసములు :**

**ఈ క్రింది వానికి విగ్రహవాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

వృషలీపతి; శతకోటులు; దండధరుని యాజ్ఞ; చక్రపాణి; విశాల భూమి; అమరాధీశుడు; క్షీరోదకములు; ముజ్జగములు; దామోదరుడు.

**అర్థ సందర్భములు :**

1. గోవలు వడ వ్రాసి చిత్రగుప్తుడు దాచెన్.
2. మహావిషధర విషము కలి లయము చేయు క్రియన్.

3. విగత తారమైన విన్ను బోలె
4. దానికెన వచ్చు తీర్థమీ ధరణి కలదె?
5. పతికిఁ గీడొౌట బంట్ల పాపంబుగాదె

**ప్రశ్నలు :**

1. సుశర్ముని గుణగణము లెట్టివి ?
2. యమునకు చిత్ర గుప్తునకు జరిగిన సంభాషణను వివరింపుము ?
3. పద్మతీర్థ ప్రభావము నెన్నునది ?
4. సుశర్మను ఇంద్రుడు ఆదరించిన విధమెట్టిది ?
5. సుశర్మ హరి నెట్లు సేవించెను ?

**విద్యార్థులకు సూచన :**

విజ్ఞాన యాత్రలకు వెళ్ళి తీర్థ ప్రభావములను తెలిసికొనుము.

**ఉపాధ్యాయులకు సూచన :**

పాండురంగ మాహాత్మ్యములోని సుశర్మ కథ వంటి కథలను తెల్పుట యుక్తము.

తీర్థ ప్రభావములను విద్యార్థులకు తెలియ బరచుడు.



# 7. గోరక్షణము

## - *గడియారం వేంకట శేషశాస్త్రి*

*గడియారం వేంకట శేషశాస్త్రిగారు కడప జిల్లా జమ్మలమడుగు తాలూకాలో, నెమళ్ళదిన్నె గ్రామంలో నరసమాంబ, రామయ్యలకు **1901** సం॥లో జన్మించిరి. వీరికి **అభినవ తిక్కన, మహాకవి, కవిసింహ, కవివతంస, సాహిత్యభాస్కర, శతావధాని, అవధాని పంచానన** అను బిరుదములు గలవు.*

*వీరు విద్వత్కవులు, పురాతన, నవీన సంప్రదాయ పారంగతులు. పత్రికా సంపాదకులు. ఆధునిక కాలంలో వీర రస ప్రధానంగా, సంప్రదాయ రీతిలో కావ్యాలు రచించిరి. ప్రొద్దటూరులో కన్యకాపరమేశ్వరీ పాఠశాలలో సంస్కృత అధ్యాపకులుగా, వయోజన విద్యాకేంద్రంలోనూ, మునిసిపల్ హైస్కూలులో తెలుగు పండితులుగా పనిచేసిరి. శాసనమండలి సభ్యులుగా నుండిరి. వీరు, అవధానప్రక్రియకు గుత్తిలో **స్వర్ణ హస్త కంకణం,** బహుమతి పొందారు. భాషలో ఛందస్సులతో, అలంకారాలతో, పూర్వ కవుల ధోరణిలోనే నడచినా స్వతంత్ర ప్రయోగాలు, పదలాలిత్యం, ఉక్తిచాతుర్యం, శైలీ సారళ్యం వీరి ప్రత్యేకతలు.*

*ప్రస్తుత పాఠ్యభాగమగు గోరక్షణము వీరి శివ భారతము నుండి గ్రహింపబడినది. వైదిక ధర్మనిర్వహణమును, గోరక్షణ ప్రాధాన్యమిందు నిరూపించబడినది.*

చం. మఱియొకనాఁటిఁ మాపునఁ గుమారశివుండు విహారమేఁగు సం
బరమున రాచబాటఁ గనుపట్టు వినోదములెల్ల వింతగా
నరయుచుఁ బోవుచుండి, యొక యంగడి దాపున బట్టబైల న
ల్గురు గుదిగట్టి నేలఁ బడఁగొట్టఁ, గలంగెడు గోవుఁగన్గొనెన్. 1

సీ. యమకింకరులువోలె నదిమి పైఁబడి కూఁత
క్రోవినొక్కఁడు ఘాతుకులను జూచి,
బలివెట్టఁగా నొడ్డి జళిపించుచోఁ దళ

త్తళలీను వారి కత్తులను జూచి,
యూపిరి బిగఁబట్ట నుబికిన కడుపు డొ
క్కలుఁ దన్నుకొను గుదికాళ్ళుఁ జూచి
ప్రాణభయంబునన్ బదరు నెమ్మేను నీ
రొలయించు తేలకన్ను లను జూచి,

తే. అదుకు లదుకులుగాఁగ "నంబా" యటంచు
సుడిసికొను కూయితో మోము చొక్కఁజూచి,
చుట్టుముసరుచుఁ బ్రేవులు స్రుక్కిపోవ
నఱచులేగఁను జూచి, మైమఱచె శివుఁడు. 2

మ. "ఎవరా పాపము లుక్కళించునరు ? లిస్సీ సాధు గోమాత హైం
దవదై వంబనియైన నెంచ, కిటులన్యాయంబుఁ గావింతురే ?
యివి సై పందగు పాటివే ?" యనుచు నట్లే బాణమట్లేఁగి, ధే
నువుపై వ్రాలు కటారి కడ్డముగ నుందుం దూఁకి, తానిట్లనెన్. 3

★మ. "ఇదియే ధర్మపథంబు ! మానవులుగారే ? జాలి లేదయ్యెనే
మది ? మీ కొండొకముల్లు గ్రుచ్చుకొన 'నమ్మా' యంచు వాపోదురే
గద ? మీ బిడ్డల నెవ్వఁడై నఁ జెనకంగా వాదుకుం బోదురే
గద ? యే దిక్కునులేని జంతువనియేగా కత్తులన్ దూయుటల్?' 4

ఉ. మీవలెఁ గాకింకరులు మేకొని, మీ యసిధార కంటెనున్
జేవగలట్టి శస్త్రములఁ జేకొనుచున్, యమలోక వీథి నీ
యావును బోలె మిమ్ము సుడియన్ బడ నేలను గొట్టి, కుత్తుకల్
గావు గొనంగ రారె ? నరకమ్ములతో నిటు నవ్వు లాటయే ? 5

చం. అటు గనుఁడయ్య ! పేద మొగమై కనుగోపుల నీరు వాఱ ను
త్కటముగ నార్చుచున్ గుములు తల్లియుఁ, దల్లినిఁ జుట్టు ముట్టి సం
కటపడు దూడ, మీ కులముకై యొక శాపము వోయఁ గన్ను డో
యిట జలమె త్రైడున్, బ్రతుక నెంచిన నీ విస మారగింతురే? 6

ఉ. ఈ బలవంతమౌ మరణ, మిట్లు కులమ్ముల పోక, దీనికిన్
లోఁబడు రాజుకున్ గలుగు లోఁ కువ, యిన్ని సహింపఁ గూడ ; దే
యే బెడిదమ్ములైన నెలయించిననున్ సొలయించుఁ గాక ; నా
చేఁబడి యావు దూడయు నశింపఁగరాదు ; భరించి తీరెదన్. 7

ఉ. నన్నెడ చేసి గోతనువునన్ ములు మోయఁగరాదు ; బుద్ధిసం
పన్నుల కింతకంటె నుడువన్ బనిలే ; దొకవేళ మీకు ని
ష్పన్నము గాక పోయిన నవాబునకున్ వినిపించు ; డింతకు
గన్నులు రేఁగి డెందములు క్రాగెడు నంతకుఁ బోమి యెప్పగు 8

చం. అని యొక ధర్మము నయభయమ్ములు ముట్టఁగ బల్కి, ధేనుపా
లన దృఢ నిశ్చయంబున నిలంబడి యుండె శివాజి; వారలా
తని యెదిరించు ఠీవి, యెడఁద గల తెంపు, షహాజి రాజు పెం
పు నెఱిఁగి, నోటి కండ పడిపోయినటుల్ వెతఁగూరి, మెల్లనన్ 9

★ "మము మన్నింపుము ; పొట్టకూటి కిదియే మార్గమ్ముగా నమ్మియుం
టిమి; పాపమ్ముల జేసియుంటిమి; కడున్నీచమ్ముగానిందువిం
టిమి ; మీ యాన భరింప నుంటి" మనుచున్ డెంద మ్ముల విప్పి దీ
నముగా వేఁడ, శివుండు వారి మది నాంతర్యంబు మన్నించుచున్ 10

ఉ. మీకు శుభమ్ము లౌత, గడిమించు నఘమ్ము లడంగు గాత"మం
చాకరుణామయుండు తగవౌ ప్రతికారము గాఁగ దోయిటన్
రూకలు వోసి పంచి, యెడరుం గొను ధేనువు బంధ మూడ్చి య
ఙ్ఞాఁకల లేవనెత్తి, మెయినంటు దుమారము వాయ దువ్వుచున్ 11

★తే. బలము తేజంబు జీవన భాగ్యమిచ్చు
సాధు గోమాత భరత భూశ్వాస కోశ ;
మురియనద్దాని బంధింప, నుడికిపోదె
వటదళమ్మునఁ గనుమూయువాని కడుపు ! 12

తే. పదరకుము తల్లీ ! నీ కేమి భయము గలదు ?
బాలకృష్ణుడు నిన్నుఁగాపాడఁ గలడు ;
తల్లి గండానఁ బాయు నీ తఱపితోడ
నాడు కొనవమ్మ పసరు బయళ్ళయందు !" 13

చం. అనికదలింప, నల్ల నడయాడుచు ధేనువుపోవ, లేఁగ దా
నిని వెనుముట్ట, నాయడుగు నీడల బాలశివుండు వోవుచున్
దన యదలింపు, ఘాతుకులు తాలిమి దేఱి మనమ్ము మాఱిచూ
పినవినయంబు, పౌరుల నవీన గుణాదరణంబు నెంచుచున్ 14

తే. తలఁపులో నున్న గోదేశ ధర్మ రక్ష
పలుకు తోడన చేసేతఁ గలుగఁ జేసి,
ప్రథమ విజయంబు గూర్చు శాంభవికి మ్రొక్కి,
యావు నడిపించుకొని, యింటి కరిగె శివుఁడు 15

## అధ్యయన వేదిక

**అర్థములు :**

గోరక్షణ = గోవులను రక్షించుట; మాపు = సాయంకాలము; అరయుచు = తెలిసికొనుచు; ఘాతు కులు = చంపువారు (క్రూరులు) ధేనువు = ఆవు; కటారి = కత్తి; ధర్మపథము = ధర్మమార్గము; చెనకము = ఎదిరించుట; కాలకింకరులు = యమభటులు; అసిధార = కత్తియొక్క వాడియైన అంచు; ఉత్కటముగ = అధికముగా; తనువు = శరీరము; నిష్పన్నము = సిద్ధించినది; తెంపు = సాహసము; డెందము = మనస్సు; అఘము = పాపము; తగవు = న్యాయము; దుమారము = దుమ్ము; తఱపి = ఆరునెలల దూడ; తాలిమి = ఓర్పు; శాంభవి = పార్వతీదేవి.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము :**

విహారమేగు; బలివెట్టగా; నన్నెడ; గుణాదరము.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములను వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

ప్రాణభయము; ధర్మపథము; అసిధార; గోతనువు; నయ భయమ్ములు; దృఢ నిశ్చయము; ప్రథమ విజయము.

**అర్థ సందర్భములు :**

1. అఱచు లేఁగను జూచి, మైమఱచె శివుడు.
2. ఏదిక్కులేని జంతువని యేగా కత్తులన్ దూయుటల్.
3. వటదళమ్మునఁగనుమూయువాని కడుపు !
4. నీ తఱపి తోడనాడుకొనవమ్మ పసరుబయళ్ళ యందు"

**ప్రశ్నలు :**

1. కుమార శివుడు గాంచిన గోవు పరిస్థితి ఎట్టిది?
2. శివాజీ గోవును బంధించి తీసికొనిపోవు వారితో ఏమని పల్కెను?
3. శివాజీ ధేనువు నెట్లో దార్చెను?
4. గోరక్షణ కథలోని నీతిని తెలుపుము.

***విద్యార్థులకు సూచన :***

1. గోరక్షణ - దేశరక్షణ అను వ్యాసము వ్రాయుటకు అభ్యాసము గావింపుము.
2. 'అహింస' ప్రాధాన్యమును గూర్చి ప్రజలకు ప్రచారము గావింపుము.

**ఉపాధ్యాయులకు సూచన :**

వైదిక ధర్మ నిర్వహణమును గూర్చి విద్యార్థుల కవగాహనము గావింపుము.



# 8. ఋతు చక్రం

**– డా॥ సి. నారాయణరెడ్డి**

*డాక్టర్ సి.నారాయణరెడ్డిగారు 1931 సం॥లో జన్మించిరి. ప్రముఖ ఆధునిక గేయ కవి - వక్త - వ్యాఖ్యాత, పరిశోధకులు. బహు భాషావేత్త. ప్రామాణికమైన వీరి పరిశోధన గ్రంథం **"ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు, ప్రయోగములు"***

*వీరు ఉస్మానియా విశ్వ విద్యాలయంలో తెలుగుశాఖలో ఆచార్యులుగా ఉండిరి. తరువాత అధికార భాషా సంఘం అధ్యక్షులుగాను - అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయానికి, తెలుగు విశ్వ విద్యాలయానికి వైస్ ఛాన్స్‌లర్‌గా పనిచేసిరి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భాషా సాంస్కృతిక వ్యవహారాల సలహాదారుగా పనిచేసిరి. రాజ్యసభ సభ్యులుగా నుండిరి.*

***నాగార్జునసాగరం - కర్పూర వసంతరాయలు, మధ్యతరగతి మందహాసం - విశ్వంభర** మొదలైన కావ్యాలు నలభైకి పైగా వ్రాశారు. ప్రతిష్ఠాకరమైన **'జ్ఞానపీఠ్'** బహుమతి పొందారు. **'పద్మభూషణ్'** బిరుదము నలంకరించారు.*

*ప్రస్తుత పాఠ్యభాగం వీరి **ఋతుచక్రం** అనే ఖండకావ్యం నుండి గ్రహింపబడినది. ఋతువుల సౌందర్యాన్ని ప్రకృతిలోని మార్పులను మనోహరంగా ఈ కవిత యందు వర్ణింపబడినది.*

**వసంత ఖండం :**

* చిగురు చిగురున రాగ శీకరము, లొలికించి
ఆకు నాకున మరకతాకృతులు పలికించి
పూవు పూవున మధువు పులకింత లొనరించి
వచ్చె కుసుమాస్త్ర భాస్వంతము వసంతమ్మ 1

మూల కొదిగిన శుకమ్ముమను రచ్చ కెక్కించి
ముడి వడ్డ పికగళమ్ముమను తీగ సాగించి
రిచ్చ వడి యున్న భ్రమరికి రెక్క లెత్తించి
సాగె సమ్మోహిత దిశాంతము వసంతమ్ము 2

## గ్రీష్మఖండం :

యక్షగానములోని రాక్షసు
నట్లు హుమ్మని వచ్చె గ్రీష్మము;
కోటి దివిటీల్ భగ్గు మన, జన
కోటి గుండెలు దిగ్గు రనగా. 3

ప్రసవ బాణుని రెప్పపాటున
భస్మ సాత్కృతు చేసి వైచిన
నాటి రుద్రుని క్రోధమాయ
న్నట్లు తీండ్రించినది గ్రీష్మము 4

ఇనుడు వంగెనొ లేదొ కణ కణ
మనెడు కొఱవులు చేతబట్టుక
మిడిసి పడి వడగాలి వచ్చెను
మిద్దె మిద్దెకు గుడిసె గుడిసెకు. 5

## వర్షాఖండం :

నీలి నీలి మబ్బులు కన్పించెనవే! గ్రీష్మాది
త్య ప్రచండ కరణమ్ముల కడ్డము నిల్చిన గొడుగులు
లేత లేత మబ్బులు వ్రేలిన వవిగో ! నీలి నింగి
పందిరి నొరిగిన ద్రాక్షా పక్వఫల గుళుచ్ఛమ్ములు. 6

చినుకు పడెను; వాయు వలయమున మృత్స్నా పరిమళములు
గుప్పుమనెను; ప్రాణికోటి క్రొత్త ఊపిరులను పైకి
చేదుకొనెను; నెర్రెలు వాసిన భూసతి నొసటిపైన
బంగారము పండించెడు భాగ్యరేఖ లిగు రొత్తెను 7

## శరత్ఖండం :

పిండి వెన్నెల గంద వొడిమెయి
నిండ నలది వియద్దునీసిక
తావితర్దిక పైన సాక్షా
త్కార మొందెను శారదేందిర 8

* రాత్రులందున కల్వ పువ్వులె
నేత్రములుగా; పగళులందున
కమలములె కన్నులుగ సరసుల
గాంచినది శారదవిలాసిని 9

ఈ శరల్లక్ష్మీ కరమ్ముల
కేమి అమృత గుణమ్ము కలదో
పొగలు గ్రక్కెడు విషధరమ్ములు
పుక్కిలించెను పాల వెన్నెల 10

## హేమంత ఖండం :

చూపుతోనె ప్రాణమ్ముల
జువ్వనిపించెడు హేమం
తమ్ము వచ్చి పడె రా యని
దద్దరిల్లెలోకమ్ములు 11

* జనపద రంగమ్ములందు
సస్య రమణి ఆకు పచ్చ
చేలమ్ముల బదులు పసుపు
చీరలు ధరియింపసాగె. 12

పెరడులోన తీగ నిండ
విరిసిన గుమ్మడి పూవులు
కన్పించెను క్షేత్ర లక్ష్మి
కై బంగరు గిన్నెలవలె 13

**శిశిర ఖండం :**

శిశిరమ్ము వచ్చె వచ్చె; హిమార్తుచండశా
సనమింక రెండు మాసములు పొడిగిన యట్లు
తుహినాద్రి శిఖరపంక్తులు లఘువులై పోయి
తెరలుగ ధరిత్రిపై తెప్ప దేలినయట్లు 14

ఎండవానలు రెండు రెండు నెలలేయుండ
శనివోలె వచ్చి యీచలి కారు నాల్గు మా
సముల తరబడిగ వేసట లేక జీవించు;
భువి మొండివాని కాయువు దీర్ఘమౌ గదా! 15

శిశిరమ్ములో వికృతి చెంది విరికారులో
చిగురు పోసికొని నిల్చెడు వృక్ష సంతతుల్
మానవుని లయ సృష్టి మర్యాదలకు ప్రకృతి
అచ్చ తెనుగున తెల్పి నట్టి భాష్యము లౌను 16

షడృతు చక్ర భ్రమణ సంచాలి తమ్మైన
నాబ్రతుకులోని ఘటనము లేరి ఈ కృతిగ
నిలిపితిని; దీని లోతులలోన ఒక రసా
త్మకు డైన తన బ్రతుకుదర్శించినం జాలు 17

## అధ్యయన వేదిక

**అర్థములు :**

శీకరము = తుంపర; భాస్వంతము = ప్రకాశవంతము; భ్రమరి = తుమ్మెద; ప్రసవబాణుడు = పుష్పములను బాణములుగా గల మన్మథుడు; ఇనుడు = సూర్యుడు; మృత్స్నపరిమళములు = మట్టి వాసనలు; సికతా వితర్దిక = ఇసుక తిన్నె; తుహినాద్రి = మంచుకొండ; వియద్దుని = ఆకాశము నందలి నది; విషధరము = నీటిని ధరించునది మేఘము; చేలము = వస్త్రము; కర్ణోల్లసితము = చెవులకింపైనది; సంచాలితమైన = బాగుగా చలించిన; గళము = గొంతు; సమీరోర్మి = పిల్ల తెమ్మెర; ఆదిత్యుడు = సూర్యుడు.

**సంధులు :**

**ఈ క్రింది పదములను విడదీసి, సంధి పేర్లను సూత్రములను వ్రాయుము**

కుసుమాస్త్రము, దిశాంతము, సమీరోర్మి, గ్రీష్మాదిత్య, శరల్లక్ష్మి, తుహినాద్రి, రసాత్మకుడు, కర్ణోల్లసితము, రథమ్మిది, షడృతువు, సమ్మోహితము.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి సమాసముల పేర్లు వ్రాయుము,**

రాగశీకరములు, మరకతాకృతులు, సుమాస్త్రము, దిశాంతమ్ము, జనకోటి, కుసుమవల్లిక, ప్రసవబాణుడు, జలధార, అమృతగుణము, చండశాసనము, రెండు మాసములు, ఎండ వానలు.

అర్థ సందర్భములు :

1. సాగె సమ్మోహిత దిశాంతమ్ము వసంతమ్ము.
2. మిద్దె మిద్దెకు గుడిసె గుడిసెకు.
3. బంగారము పండించెడు భాగ్యరేఖ లిగు రొత్తెను.
4. విషధరమ్ములు పుక్కిలించెను పాల వెన్నెల.
5. దద్దరిల్లె లోకమ్ములు.
6. అచ్చ తెనుగు తెల్పినట్టి భాష్యములౌను.

**ప్రశ్నలు :**

1. ఋతువులెన్ని? అవి ఏవి?
2. వసంత, గ్రీష్మ ఋతువులను కవి వర్ణించిన విధమెట్టిది?
3. వర్ష, శరదృతువుల వర్ణనలో కవి జూపిన నైపుణ్యమెట్టిది?
4. హేమంత, శిశిర ఋతువుల వర్ణనలో కవి జూపిన కవితా శిల్పమెట్టిది?

**విశేషాంశములు :**

ప్రసవబాణుడు : శివుని తపస్సు భంగము గావింప దలచిన మన్మథుడు శివునిపై తన పుష్పబాణములు ప్రయోగించెను. శివుడాగ్రహముతో మూడవ కన్ను

తెరచి మన్మథుని భస్మము గావించెను. పుష్పములే బాణములుగా గలవాడు గనుక మన్మథుని ప్రసవ బాణుడనిరి.

**విద్యార్థులకు సూచన :**

ప్రకృతిలో జరుగు మార్పులను ఋతువులను బట్టి తెలిసికొనుటకు అభ్యసించవలయును.

**ఉపాధ్యాయులకు సూచన :**

ఋతువులను, ఋతు ధర్మములను విపులముగా వివరించుట యుక్తము.



# 9. కన్యక

*- గురజాడ అప్పారావు*

*"దేశమంటే మట్టి కాదోయ్*
*దేశమంటే మనుషులోయ్"*

*అని చాటి చెప్పిన మహనీయుడు గురజాడ. ఆధునిక కవులలో గురజాడ బహుప్రసిద్ధులు. **1861**వ సంవత్సరమున విశాఖపట్టణ ప్రాంతమున జన్మించిరి. తల్లిదండ్రులు కౌసల్యమ్మ, వేంకట రామదాసులు.*

*గురజాడకవి స్త్రీ జనోద్ధరణము, సంఘ సంస్కరణములకు, **కన్యాశుల్కము, పూర్ణమ్మ, కన్యక"** మొదలగు ఖండకావ్యములు చక్కని యుదాహరణలు. ఆయన గొప్ప సంఘ సంస్కర్త. కందుకూరి వారి సాంఘిక విప్లవమును, గిడుగు రామమూర్తి పంతులుగారి భాషా విప్లవమును తనలో సమన్వయించుకొని సరిక్రొత్త సాహిత్య విప్లవమును లేవనెత్తిన నవయుగ వైతాళికుడు **"గురజాడ". "కవి శేఖర" "మహాకవి" "అభ్యుదయ కవితా పితామహుడు"** అనునవి వీరి బిరుదములు.*

*తెలుగు సాహిత్యాన్ని క్రొత్త మలుపు త్రిప్పి తెలుగు పలుకుబడికి క్రొత్త ఊపిరి పోసిన యుగకర్త. మానవతావాదం, ప్రేమతత్త్వం వీరి రచనలలో ప్రధానముగా నున్నవి. **కన్యాశుల్కం, దిద్దుబాటు, నీలగిరిపాటలు, సుభద్ర, ముత్యాల సరాలు, ఋతుశతకము, మెరుపులు, పూర్ణమ్మ, లవణరాజుకల, బిల్హణీయం, కొండుభట్టీయం** మొదలగునవి వీరి యితర రచనలు.*

*ప్రస్తుత పాఠ్యభాగము వీరి ఖండ కావ్యమైన కన్యక. ఇందు బాల్య వివాహమను సాంఘిక దురాచారమును రూపుమాపుటకై వ్రాసిన చక్కని కథ వర్ణింపబడినది.*

తగటు బంగారు చీరెకట్టి
కురుల పువ్వుల సరులుజుట్టి
నుదుట కుంకుమబొట్టు పెట్టి
సొంపు పెంపారన్ ;

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్
రాజవీథిని

పసిడి కడవల పాలు పెరుగులు
పళ్ళెరమ్ముల పళ్ళు పువ్వులు
మోము లందున మొలక నవ్వులు
చెలగి చెలికత్తెల్
వెంటనడిచిరి.

అంతపట్టపురాజు యెదురై
కన్నె సొగసుకు కన్ను చెదురై
మరుని వాడికి గుండె బెదురై
యిట్లు తలపోసెన్.

"ఔర ! చుక్కలనడుమ చందురు
నట్లు వెలిగెడు కన్నె ముందర,
వన్నె కాంచిన నగరిసుందరు
లందరొక లెక్కా ?

నాలనడుమను నట్టివీథిని
దుష్టమంత్రులు తాను పెండెం
కట్టి కన్నెను చుట్టి నరపతి
పట్టనుంకించెన్,

మట్టి వచ్చిన దైవగతి కిక
దైవమే గతియని తలంచుక
దిట్టతనమును బూని కన్నియ
నెట్ట నిటు పలికెన్.

"ముట్టబోకుడు దేవకార్యం
తీర్చివచ్చెద, నీవు పట్నం
యేలురాజువు, సెట్టికూతుర,
నెటకు పోనేర్తున్."

చుట్టములు తన చుట్టు నిలవగ
భృత్యవర్గం కాచి కొలవగ
సెట్టి కరములు మోడ్చి రాజుకు
ఇట్లు వినిపించెన్.

"పట్టమేలే రాజ ! బలిమిని
పట్టవలెనా ? నీదు సొమ్మే
కాద కన్నియ ? నీవుకోరుట
కన్న మరికలదా
వైశ్యజాతికి వన్నె ?

గాని మన్ననజేసి, మమ్ముల
బంధువర్గం, కులంపెద్దల,
ధర్మ మన్నది అరసి కొంచెం
దారి కనబడితే,

అగ్నిసాక్షిగ కన్నె గైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందుకొమ్మెం తెంత వలసిన,
మనుచు మా జాతిన్."

నవ్వి హేళన నవ్వు, నరపతి
పల్కె "నోహో ! ధర్మమార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టి కరపడమా !

రాజు తలచిందేను ధర్మం,
రాజు చెప్పిందెల్ల శాస్త్రం,
రాజులకు పేరైన పద్ధతి
కాద, గాంధర్వం ?

తడవు చెయ్యక తల్ల డిల్లక
నేడు రేపని గడువు పెట్టక,
నెమ్మిగోరితి వేని, కన్నియ
నిమ్ము !
లేకుంటే, పొమ్ము !

డేగ, పిట్టను పట్టి విడుచున ?
కన్నె, యింటికి మరలినడుచున,
తెమ్ముకానుక లిమ్ము, నీ విటు
వచ్చి నందాకన్

కదల'' నంతట సెట్టి పలికెను,
"దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద రాజా !
శలవు నీవి స్తే

యింటిదై వం వీరభద్రుడి
దేవళానికి పోయి యిప్పుడె
పళ్ళెరం సాగించి వత్తును
పైని తమ చి త్తం !''

"మంచిదే, మరినడువు, మేమును
తోడవత్తుము, దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే
మందుకొనగలము''

నాడు గుడిలో మండె గుండం
మంట మింటిని ముట్టియాడగ
కన్న నరపతి గుండె దిగులై
పట్టు విడజొచ్చెన్.

భ క్తి పరవశమైన మనసున
దుర్గ నప్పుడు కొలిచి, కన్యక,
ముక్తి వేడుచు వూడ్చి నగలను
శక్తి కర్పించెన్.

దుర్గకొలనున గ్రుంకి పిమ్మట
రక్తగంధం రక్తమాల్యం
దాల్చి గుండం చుట్టునిలిచిన
జనుల కిట్లనియెన్ !

"అన్నలారా తండ్రులారా
ఆలకించం డొక్కవిన్నప
మాలుబిడ్డల కాచుకొనుటకు
ఆశలే దొక్కో
కులము లోపల ?

పట్టమేలే రాజు అయితే
రాజునేలే దైవ ముండడొ ?
పరువు నిలపను పౌరుషము మీ
కేల కలుగదొకో ?

విద్య నేర్చిన వాడు విప్రుడు
వీర్యముండిన వాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మపద్ధతి
మరచి, పదవులకై

ఆశచేయక, కాసువీసం
కలిగివుంటే చాలు ననుకొని,
వీర్య మెరుగక, విద్యనేర్చక,
బుద్ధిమాలినచో

కలగవా యిక్కట్లు ? మేల్కొని,
బుద్ధిబలమును బాహుబలమును
పెంచి దై వమునందు భారం
వుంచి, రాజులలో

రాజులై మనుడయ్య !'' ఇట్లని
కన్య నరపతి కప్పు డెదురై
నాలుగడుగులు నడచి ముందుకు
పలికెనీరీతిన్.

"పట్టపగలే, నట్టివీథిని
పట్టబోరే జార చోరులు
పట్టదలచితి వింక నీవొక
పట్ణమేలే రాజు వట !

కండకావర మెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా వొక దై వమంటూ,
వుండి వూర్కొనునా ?

కులం పెద్దలు కూడి రదుగో !
అగ్నిసాక్షికి అగ్ని అదుగో !
కన్నుకోరిన కన్నె యిదిగో !
జాల మే లొక్కో !

పట్ణమేలే రాజువైతే
పట్టునన్నిపు''డనుచు కన్యక
చుట్టిముట్టిన మంటలోనికి
మట్టి తాజనియెన్.

పట్లమేలే రాజుగర్వం
మట్టిగలిసెను, కోటపేటలు,
కూలి నక్కల కాటపట్లై
అమరె

యెక్కడైతే కన్య, మానం
కాచుకొనుటకు మంటగలిసెనొ,
అక్కడొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగై,

పట్లమేలే రాజుపోయెను
మట్టికలిసెను కోటపేటలు.
పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తు లపకీర్తుల్

## అధ్యయన వేదిక

**అర్థములు :**

పసిడి = బంగారు; సొగసు = అందం; మరుడు = మన్మథుడు; నరపతి = రాజు; భృత్యవర్గం = సేవక సమూహం; మింటిని = ఆకాశమును; మనుడు = బ్రతుకుడు; దుండగము = తప్పు; రక్త గంధం = ఎఱ్ఱని చందనం; రక్తమాల్యం = ఎఱ్ఱని పూలదండ; నెమ్మి = ప్రేమ.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

మరునిరాజ్యం, దుష్టమంత్రులు, కోట పేటలు, పాలు పెరుగులు.

**అర్థ సందర్భములు :**

1. 'ముట్టబోకుడు దేవకార్యం తీర్చి వచ్చెద'
2. 'ధర్మమార్గం పట్టమేలే రాచ బిడ్డకు సెట్టి కరపడమా'

3. 'దేవకార్యం ముందు ఆవల రాచకర్యం కాద'
4. 'రాజులలో రాజులై మనుడయ్య'
5. మట్టి కలిసెను కోట పేటలు.

**ప్రశ్నలు :**

1. రాజు కన్యకను ఎందులకు, ఎట్లు అడ్డగించెను?
2. కన్యక తన వారి నుద్దేశించి పల్కిన పల్కులేమి?
3. కన్యక రాజుతో ఏమని పలికెను?
4. ఈ కథవలన తెలియదగు నీతి యేమి?

***ఉపాధ్యాయులకు సూచన :***

బాల్య వివాహములనెడి దురాచారముల నిషేధించుటకు దోహదపడినవారిని విద్యార్థులకు తెలియపరచుట ముఖ్యము.



# 1. స్వభాష

## – పానుగంటి లక్ష్మీనరసింహారావు

*పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రాజమహేంద్రవరము సమీపమునగల సీతానగరమున రత్నమాంబ - వేంకటరమణయ్య దంపతులకు 1865వ సంవత్సరమున జన్మించిరి.వీరు బహుభాషా పండితులు. పిఠాపురం సంస్థానమున ఆస్థానకవిగాను, లక్ష్మీ నరసాపురం, ఉర్లాం, ఆనెగొంది - సంస్థానములలో దివానుగాను పనిచేసిరి. గొప్ప సంఘ సంస్కర్త. సమాజములోని అవినీతి, మూఢనమ్మకాలను విమర్శించిరి.*

*పానుగంటి కవి గ్రాంథిక భాషావాదులు.* ***ఆంధ్రా ఎడిసన్, ఆంధ్రా షేక్స్పియర్,*** *అభినవ కాళిదాసు అనునవి వీరి బిరుదములు.* ***కోకిల, రాధాకృష్ణ, ప్రచండ చాణక్యము, విప్రనారాయణ, రాతిస్తంభము, బుద్ధబోధసుధ, సాక్షి, కంఠాభరణము, పద్మిని, చూడామణి*** *మొదలగునవి వీరి యితర రచనలు.*

*ప్రస్తుత పాఠ్యభాగము వీరి 'సాక్షి' వ్యాసముల నుండి గ్రహింపబడినది. జోసఫ్ ఎడిసన్, రిచర్డు స్టీల్ ఆంగ్లములో వ్రాసిన 'స్పెక్టేటర్' వ్యాసాలు పానుగంటి వారికి స్ఫూర్తిని కల్గించి యుంటాయని సాహిత్య పరిశీలకుల అభిప్రాయం. స్వభాష గొప్పతనాన్ని తెలుపుచు జంఘాలశాస్త్రి యిచ్చిన ఉపన్యాసమిందలి ముఖ్యాంశము.*

నేను సభాభవనమునకేగుసరికి జంఘాలశాస్త్రి దేనిని గూర్చియో యుపన్యసించుచున్నాడు. అదివరకే మాటలు చెప్పి యుండెనో నేనెరుగనుగాని నేను సభాప్రవేశ మొనర్చిన పిమ్మట నిట్లు చెప్పెను.

"మీకసత్యముగా దోఁప వచ్చును. నాయనలారా! అనిత్యము కాదు. ఆయన ఆంధ్రుఁడు. కృష్ణాతీరమున పుట్టినవాడు. శుద్ధ శ్రోత్రియ కుటుంబములోనివాడు. ఎం.ఏ.బి.యల్., పరీక్షలలో నుత్తీర్ణుడైనవాడు. న్యాయవాద వృత్తిని నిరాఘాటముగా నిరంకుశముగా నిర్వర్తించువాడు. అట్టివానిని ఆహ్వానించి,

ఆదరించి ఆంధ్ర బాలక సంబంధమగు ఒక సభలో అధ్యక్షుడుగా నుండుడని పాఠశాల బాలకులు ప్రార్థింపగా నుండెదనని యొప్పుకొని తుదకు చేసిన పని యిది!''

"నాకాంధ్ర భాష రాదు. నేనాంధ్రమున మాట్లాడలేను. మీకిష్టమగు నెడల ఆంగ్లభాషలో మాట్లాడుదును.'' అని యర్థమిచ్చు మాటలను అతడాంగ్ల భాషలో పలికెను. తెల్లబోయి తెలివి తప్పి నిలువు గ్రుడ్లు వేసుకొనిన పసిబాలురప్పుడేమి చేయగలరు? కొంతసేపు మాట్లాడలేక నిరుత్సాహులై దీర్ఘ నిశ్వాసము లిచ్చి, "మీయిష్టమెటులో యటులే'' యని అయిష్టముగా పలికిరి. అప్పుడా యధ్యక్షుడు ఒక పావుగంట కాలము ఆంగ్లభాషలో దేహసాధన విషయమును గూర్చి యుపన్యసించి తన యుపన్యాసమునకు ఉపసంహారమును చెప్పి,

'విల్ ఎనిజంటల్మెన్ కం ఫార్వర్డు టు స్పీక్' అని సభవారిని ప్రశ్నించెను. బాలకులు భగ్నోత్సాహులై యుండుట వలన ప్రత్యుత్తరమీయక ఊరకుండిరి. అయ్యా! నేను మాట్లాడెదనని లేచితిని. "మనము చూడనే లేదయ్యా! మన జంఘాలశాస్త్రియే నయ్యా'' అని వారిలో వారనుకొనుచు "ఎప్పుడు వచ్చినారు? ఎక్కడినుండి వచ్చినారు? ఈ నడుమ రెండు పర్యాయములు కాబోలు సాక్షి రాలేదేమి? మీరు సభకు వచ్చిన తర్వాతనైనను మాకు తెలియజేయనక్కరలేదా? ఏమి న్యాయమయ్యా?'' అని ఏవేవో అనురాగ సూచకములగు అసందర్భాలాపము లాడి నన్ను వేదికవద్దకు తీసికొని పోయిరి. నేనిట్లుపన్యసించితిని.

"నాయనలారా! మీరు గూడా వింటిరి గదా! నేనొక్కడివే వింటినా? ఏదో విని మరేదో యని భ్రమ పడితినా? అట్లే యగు నెడల నేను అదృష్టవంతుడిని గదా! నేనొక్కడును మాత్రమే అదృష్టవంతుడనా? ఆంధ్రులందరు అదృష్టవంతులే కాదా? ఆంధ్రదేశమంతయు నదృష్టవంతమైనదే కదా? ఆంధ్రదేశమున పుట్టి, ఆంధ్ర మాతా పితలకుద్భవించి, ఆంధ్ర సాంప్రదాయములు అభ్యసించి, ఆంధ్ర జాతీయ తత్త్వ సంపత్తిచే అభివృద్ధిని పొంది, ఆంధ్ర భాషలో పండితులై, ఆంధ్ర గ్రంథములను రచించి, ఆంధ్ర భాషామ తల్లికి అమూల్యాలంకారములుగా నర్పించి, ఆంధ్ర దేశ సేవ నాచరించి తమ అంగములు అసువులు ఆత్మలు పవిత్రములుగా చేసికొని, ప్రాణములను బాసి పరమపదమును చేరిన ప్రాచీనాంధ్రులందరు గూడ అదృష్టవంతులు గదా!

అయ్యయ్యో! అంత యదృష్టము పట్టునా? పట్టదు. వింటిని. నిజముగా వింటిని. నాది భ్రమ కాదు. తాత్కాలిక ఉన్మాదమూ కాదు. మీరు గూడ నాతో బాటు వింటిరి.

గుండెలు పగిలిపోవ వింటిమి. మనస్సులు మండిపోవ వింటిమి. ప్రాణములు పైకెగిరిపోవ వింటిమి. నాయనలారా! "బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు" నని కవి చెప్పినాడే ఇంకను జీవించి యున్నందులకు యిది యా ఫలము? ఇదియా సుఖము? ఆహాహా! ఇంతవరకు జీవించకుండ నిదివరకే దేహములు చాలించుకొనిపోయిన దేశీయులు అదృష్టవంతులు గారా? వారిట్టి మాటలను విని యుండక పోవుట వలన వారి భాగ్యము యింతింత యనవచ్చునా? మాట యన్న మాటయా? మాణిక్యముల మూట. మౌక్తికముల పేట. ఆహాహా ! ఏమని? ఏమని? మన అధ్యక్ష భగవానుని ఆలాపకలాపమేది? వారు సాయించిన సూక్తి యేది? వారి ఆస్య గహ్వరము నుండి అవతరించిన ఆగమ సూత్రమేది? చెప్పనా? ఆంధ్రుడు వచింపదగినది కాదే? చెప్పనా? చెప్పక తప్పునా? మన యగ్రాసనాధిపతి దేవునికి ఆంధ్ర భాష రాదట. ఆయన ఆంధ్రమున మాట్లాడనే లేరట. ఆంధ్ర మాతా పితలకు పుట్టిన వాడే - అట్టి వాడాంగ్ల భాష నభ్యసించినంత మాత్రమున యిప్పుడు ఆంధ్రమున మాట్లాడలేకుండునా? ఆశ్చర్యము. అసత్యము. ఆంధ్రమున అతనిని మాట్లాడకుండ చేసినది అశక్తి కాదు. అనిష్టత. అసహ్యత. అది శిలాక్షరమైన మాట. "ది వెల్నోను తెలుగు స్కాలర్" అని ప్రసిద్ధి పొందిన బ్రౌను దొరగారు ఆంధ్రమున ఏమాత్రము పండితులో మనకు తెలియక పోవచ్చును గాని అప్పటి వారెరుగరా?

స్వభాష నేర్చుకొనుటకు ఏమంత శ్రమయున్నది? అక్షరాభ్యాస దినము నుండియే మీరు స్వభాషను అభ్యసించుచున్నారని యనుకొనవలదు. మీ తల్లి కడుపులో నున్నప్పుడే నేర్చుకొనుట మొదలుపెట్టినారు. ఆమె భుజించిన పదార్థముల రసమును నాభిగుండా మీలో ప్రవేశపెట్టుచున్నప్పుడే ఆంధ్ర భాషా జ్ఞానమును గూడ దానిలో జోడించినది. తర తరాలనుండి వంశానుక్రమముగా మీరక్తములో జీర్ణమై, మీ మాంసమునకు మాంసమై, శల్యమునకు శల్యమై, మెదడుకు మెదడై - మీ తత్వములో నైక్యమొందిన ఆంధ్ర భాషను మీరిప్పుడు క్రొత్తగా నేర్చుకొనుట యేమి? గురువులు లేకుండగ గ్రంథములు చదువుకొనుచు పోయిన యెడల భాషాజ్ఞాన సంపాదనము మీకెంతసేపు? నాకాంధ్రభాష రాదని మన అధ్యక్షుడు కంఠోక్తిగాఁ బలికినాడు. మా భాష మాకు రాదను అనర్హ వాక్యము ఆంధ్రుని నోట నుండి రాతగదు. ఆంధ్రదేశము, ఆంధ్రజాతి పుట్టి ఎంతకాలమైనదో..... యిట్టి అనుచిత వాక్యము నేడు బయలు వెడలినది. కానిమ్ము. మనము అనేక సంవత్సరముల నుండి అలవాటు పడి యున్నాము. భాష మీకు రాదేమి? మీరు ఏప్రయత్నము చేసినారని రాదనుచున్నారు? భాష తనంత తాను వచ్చుననియే మీరనుకొనుచున్నారా? మీకు భాష రాకపోవుట

భాష లోపమా? మీ లోపమా? భాషను కొంచెము దీక్షతో పఠించిన యెడల అది రాని వాడుండునా? పఠించకనే భాష రావలయునన్న అదంత పై పైన నున్నదా? భాషపై మీకు నిర్లక్ష్యమున్నప్పుడు భాషకు మీ యందభిమానముండునా? భాషా గ్రంథము మీకు తలక్రింద దిండుగానైనా పనికిరానప్పుడు భాషాజ్ఞానము మీతలలోనెట్లు దూరును? చదివినను భాష రాని వాడెవ్వడు? ఎవ్వడో వ్రేలు మడచి ఒక్కని పేరెత్తి చెప్పుడు? భాషలో పుట్టి, భాష నేర్చుకొని భాషరాక భ్రష్టుడైన ప్రపంచాతీత పురుషు డెవ్వడో చూతము. చూచి యధార్థముగా స్వభాషా జ్ఞానమున కర్హుడు కాని అద్భుతాజ్ఞాన తత్వమే..... అగునెడ ..... నన్నయభట్టు కాలము నుండి యిప్పటివరకున్న భాషాగ్రంథములన్నియు కట్ట కట్టి బంగాళాఖాతములో పాఱవేయుదుము. మనకు రాని భాషతో మనకేమి పని? భారత భాగవతములను పఠింపని నీవు బారిష్టరువైననేమి? ప్రభూత్తముడవైననేమి? ఆంధ్రుడవై ఏల పుట్టితివోయి నాయనా! నాకు బోధపడక అడుగుచున్నాను. క్షమింపుము. నీవే పుస్తకములను చదవనక్కరలేదు. దినమునకు ఒక్కసారి పావుగంట తెరపి చేసికొని రాత్రి భోజనమైన తర్వాత ఇల్లాలు, పిల్లలను నీచుట్టు కూర్చుండఁబెట్టుకొని తాంబూలము నములుచు నడుమ నడుమ ముచ్చటలు చెప్పుకొనుచు ఆంధ్ర పత్రికను చదువరాదా! నాలుగు మాసములిట్లు చదువుము. నీకాంధ్ర భాషాజ్ఞానము ఎంత వృద్ధి యగునో, తెలుగు భాషలో ఏదైన పస యున్నదని నీకప్పటికి తెలిసిన యెడల భాషాగ్రంథములను చదువవచ్చును. ఆంగ్ల భాషను ఏల చదువుకొంటివని నేనధిక్షేపింపను. ఇంతకన్న అధిక జ్ఞానమును గూడ నీవాభాషలో సంపాదింపుము. నాకు మరింత యిష్టము. కాని, ఈ యాంగ్ల భాషాజ్ఞానమెందులకో నీవెఱుగవా? ఆంగ్ల భాషయే కాదు. ఇంకననేక భాషలు గూడ నేర్చుకొనుము. నీవు సంపాదించిన పరభాషా జ్ఞానమంతయు నీస్వభాషను అభివృద్ధి పరచుటకే. అంతకంటే వేరుకాదే. ఆంధ్రభాషలో అ... ఆ..... ల కంటె అవతలి యక్షరములు ఎఱుగని వాడవు కదా! ఆంధ్రుడివై యుండియు ఆంధ్రభాషలో 'అ' ..... యని నోరు మెదపలేని వాడవుకదా. నీ యాంగ్ల భాషాజ్ఞానమును దేశమునకెట్లు ఉపచరింపఁదలచితివో చెప్పుము. నాయనా! నిన్ను గ్రంథములు వ్రాయుమని కోరుచున్నాననుకొంటివేమో! గ్రంథమును నీవు వ్రాయవలదు. ఏ గ్రంథమునూ చదువవలదు. రేపటినుండియే ఆంధ్ర పత్రికను ఆమూలాగ్రముగా చదువుచుండుము.

ఆంధ్రభాష బొత్తిగా రానివానితోడ, మీరు ఆంగ్లమున ఎన్నడును మాట్లాడ వలదు. మీరు మీ మిత్రులకు ఉత్తరములు వ్రాయునప్పుడు 'డియర్ ఫ్రెండు తో...... ఆరంభించి 'యువర్సు ట్రూలీ' తో పూర్తిచేయక, "బ్రహ్మశ్రీ" తోడనో లేక

"మహారాజశ్రీ" తోడనో ఆరంభించి; "చిత్తగింపవలయును" తో పూర్తిచేయవలెను. ఆంధ్రభాష వచ్చినవానికి ఆంగ్లభాషలో ఉత్తరములెన్నడును వ్రాయకుడు. క్రొత్తగా అచ్చుపడుచున్న ఆంధ్ర గ్రంథములన్నింటిని విమర్శనా బుద్ధితో చదువుడు. తొందరపడి అధిక్షేపింపకుడు. స్వభాషా పత్రికలను చూడకుండ ఆవల పారవేయకుడు. ఆంగ్లభాషా గ్రంథములు మీరు చదువుచున్నప్పుడు వానిలో "మనకక్కరకు వచ్చు అంశములేమియా"..... యని తదేక దృష్టితో చూచుచు వానిని మదిలో పదిలపరుచుడు.

మీరీ నియమములను పట్టుదలతో పాటించి, పుట్టుకచేతనే గాక, బుద్ధిచేతను, స్వభావముచేతను, యోగ్యముచేతను ఆంధ్రులని యనిపించుకొనుడు.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

కర్కశము = కఠినము; ప్రణవము = ఓంకారము; ఉపసంహారము = ముగింపు; ఉద్భవించుట = పుట్టుట; ఉన్మాదము = పిచ్చి; దీక్ష = పట్టుదల; అధిక్షేపణము = ధిక్కరణ; ఆస్యము = ముఖము.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను సూత్రములను వ్రాయుము.**

వివిధాంశములు, అగ్రాసనాధిపతి, ప్రాచీనాంధ్రులు, అక్షరాభ్యాసము.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

అసత్యము, రెండుపర్యాయములు, భాషాజ్ఞానము, తాత్కాలికోన్మాదము, మాతాపితలు, పరమసత్యము, భాషాపాండిత్యము.

**అర్థ సందర్భములు :**

1. "బ్రతికి యుండిన సుఖములు పడయవచ్చు"
2. జీవించి యున్నందులకు ఇదియా ఫలము.

3. మాట యన్న మాటయా? మాణిక్యముల మూట. మౌక్తికముల పేట!
4. అంత యదృష్టము పట్టునా?
5. గుండెలు పగిలిపోవ వింటిమి.

**ప్రశ్నలు :**

1. జంఘాలశాస్త్రి ఆంగ్ల ఉపన్యాసకుని విమర్శించిన విధమును వివరింపుము.
2. పానుగంటి వారు సూచించిన స్వభాషాభిమాన నియమములుఎట్టివి?

***విద్యార్థులకు సూచన :***

స్వభాషాభిమానమును పెంచుకొనుటకు కృషి సల్పుడు.



# 2. ఆరుద్ర

## – డా॥ శ్రీమతి నాయని కృష్ణకుమారి

*డాక్టరు. నాయని కృష్ణకుమారి 1930వ సంవత్సరమున జన్మించిరి. జానపద సాహిత్యములో విశేషముగా కృషి చేసిరి. **"తెలుగు జానపద గేయ గాథలు"** అను పరిశోధనా గ్రంథం రచించి ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి **"డాక్టరేట్"** పట్టమును పొందిరి.*

***"అగ్ని పుత్రి", "కాశ్మీర దీప కళిక"*** *వీరి యితర రచనలు. ఉస్మానియా విశ్వ విద్యాలయము తెలుగు విభాగములో ఆచార్యులుగా పనిచేయుచు, ఎందరో రిసెర్చి విద్యార్థులకు పర్యవేక్షకులుగా నుండిరి. పిదప పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయమున ఉపకులపతిగాను పనిచేసి పదవీ విరమణ పొందిరి.*

*ప్రస్తుత పాఠ్యభాగము **"యువభారతి"** వారి ప్రచురణ **"నవోదయలహరి"** నుండి గ్రహింపబడినది. ఈ పాఠ్యాంశమునందు ఆరుద్రగారి రచనలు, వారు - భావకవిత్వమునకు గావించిన విశేషకృషి చక్కగా వివరింపబడినది.*

నవ్య సాహిత్య చరిత్రలో ఆరుద్ర స్థాన మేమిటి? తన కవిత్వ పాథేయంతో, ఈ నిరంతర ప్రయాణీకుడు సాహిత్య ప్రస్థానంలో ఎక్కడ ఒదుగుతాడు? పుట్టుకతో కవితా బీజానను సంతరించుకొన్న ఆరుద్ర వాటికి చేసిన దోహద విశేషాలేమి? తీర్చి దిద్దిన ఆకారమెటువంటిది? ఈనాటికి, ఆరుద్ర ఇంకా కవిగా మిగిలే వున్నాడా? ఇవన్నీ ప్రశ్నలు? 1925లో పుట్టిన ఆరుద్ర చాలా చిన్నవయస్సులోనే కలం పట్టి కాగితాలమీద కవితాక్షరాలను చెక్కడం ఆరంభించాడనాలి. 1942లో అంటే కవికి 17 సంవత్సరాలప్పుడు ఆరుద్ర అంతకుముందు ఏది వ్రాసినా మెచ్చుకోని శ్రీ శ్రీ **'లోహవిహంగాలు'** అనే గీతం విని "అబ్బీ'' పెడదారివదిలేసి ఎడద దారి ఎక్కావ్. గుడ్, ఇదీ నీ రస్తా'' 'ఊ' సాగిపో అన్నాడట.

ఆరుద్ర కవిత్వాన్ని విశ్లేషించి చూస్తే కొన్ని లక్షణాలు స్పష్టంగా మనకు దర్శనమిస్తాయి. అవి, కవి సంప్రదాయమంటే ఇష్టం కలవాడే. మాతృదేశం మీద భక్తి ఉన్నవాడు. ఆయన కవిత్వం ప్రారంభించిన తొలిదశలో రూపొందించిన ఖండికల్లో ఈ విషయాలు స్పష్టమౌతాయి. **'గాయాలు - గేయాలు'** అనే కావ్యంలో చేర్చిన ఖండికలన్నీ పత్రికల్లో అచ్చయినవీ, రేడియోల్లో పాడినవీ, సినిమాలకు వ్రాసినవీ. విశాలాంధ్ర రాష్ట్రావతరణం వలన కలిగిన ఆనందాన్ని సూచిస్తూ, 'విజయీభవ, విజయీభవ' విశాలాంధ్ర జననీ అని కీర్తించాడు. ప్రజలంతా సుఖాలతో బ్రతుకంతా మననీ అని ఆకాక్షించాడు.

తెలుగు పాటకు "నేడు కొత్త పల్లవి పాడు" "తెలుగు వాకిట కొత్త రంగు వల్లిక చూడు" అని వివశుడవుతూ భావావేగంతో, తెలుగు కోడళ్ళు, కుందనపు చేతులకు గోరంట గోళ్ళతో వీణెలు మీటు తారనీ, తెలుగు జవరాళ్ళు, అమృతపు జల్లుతో పెదవి విప్పకనే పాడతారనీ కాల్పనికతకు దారులు వెదుక్కున్నాడు. ఈ వేళ సంక్రాంతి కాదు. దీపావళి కాదు. ఎందుకిన్ని వేడుకలు. రేయంతా ఇన్ని దీపాలు తెలుగు కన్నెలకళ్ళ కాటుకరేకలు, కాళ్ళపారాణి, మొగలిపువ్వుల వాల్జడ పరిమళాలు, ఈ సంబరమంతా ఏ పర్వదినమని? అంటూ పరివశించిపోతూ,

"జాజర పాటలు పాడుతు నీకు జాతర చేస్తామో తల్లీ! బాజా భజంత్రీలు మోగగా నీబావుటా ఎగరవేస్తా మళ్ళీ" అని తన్మయత్వాన్ని భజిస్తున్నాడు. ఇక్కడ మనకు కనిపించే ఆరుద్ర మార్క్సిజాన్ని కవిత్వంలో చాటి తీరాలనే ఆరుద్ర కాదు. అందువల్లనే ఈ ఆరుద్ర దేశ నాయకులైన గాంధీ, నెహ్రూలను కూడా కీర్తించగలిగాడు. అమరజీవి పొట్టి శ్రీరాములను అగ్గించాడు. ఇక్కడ మార్క్సిస్టు ఆరుద్ర లేడు. సిసలైన సంప్రదాయవాది ఆరుద్రే మనకు కనిపించేది, దేశభక్తిగల ఆరుద్ర మనకు దర్శనమిచ్చేది.

1962 లో చైనాతో మన దేశం యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు దేశభక్తిని చాటుకునే కవిత్వం చాలా వెలువడింది. శ్రీశ్రీ కూడా చైనాను తిడుతూ కవిత్వం వ్రాయక తప్పలేదు. ఆరుద్ర వ్రాసిన కవిత్వమంతా వృత్తాలలోనో లేదా మాత్రాచ్ఛందంలోనో నడిచింది. చైనా యుద్ధం జరిగినపుడు అధికార రీత్యా అత్యయిక పరిస్థితి యేర్పడ్డది. ఆ సమయంలో పౌరుడికి మల్లే కవికి కూడా డిసిప్లిన్ ఉండాలనీ, డిసిప్లిననేది కవిత్వంలో ఛందం వాడితేనే గాని రాదనీ, అందువల్లే నేను ఛందస్సుకు

కట్టుబడుతున్నాననీ వ్రాసుకున్నాడు. 1965లో 'ఎంచిన పద్యాలు' అనే పేర ఆరుద్ర ప్రకటించిన కావ్యంలో వెనుక ఎప్పుడో వ్రాసిన ఈ దేశభక్తి కవితలు చాలా కనిపిస్తాయి.

"తల్లి దాస్యముబాప త్యాగధను లెందరో
అసువులిచ్చిన ఫలము అతుల స్వాతంత్ర్యమ్ము
శక్తినంతయు చూపి కట్ట కడపటి వరకు
రక్త బిందువు లోడ్చి రక్షించు కుంటాము" అని
దీక్ష పూనుతున్నాడు. కవి ఆ సందర్భంలోనే శ్రీ శ్రీ కవిత్వచ్ఛాయల్లో

పాటలాగ పాములాగ
వేగంగా, కోపంగా
ప్రతి ఒకడూ సైనికుడే
ప్రతి ఒకడూ అతిరథుడే
ప్రతి ఒకడూ రణయంత్రం
ప్రతి నేత్రం శివ నేత్రం
ప్రతి హస్తం యమ నేత్రం
ప్రతి ఒకడూ ప్రతి ఒకడూ
ప్రతి ఒకడూ బ్రహ్మాస్త్రం - అని కదును త్రొక్కుతున్నట్లుగా కలాన్ని కదిపాడు.

అందరూ కవులకు మల్లె ఆరుద్ర కూడా కవిత్వారంభ దశలో చాలావరకూ సెంటిమెంటలిస్టు. ప్రేమగీతాలు ఎక్కువగానే వ్రాశాడు. ప్రేమకు ఎన్నో రకాలయిన నిర్వచనాలు చెప్పాడు. తర్వాత శ్రీశ్రీ సాహచర్యంవల్ల ఆరుద్ర దృక్పథంలో మార్పు వచ్చినట్లుగా కనిపిస్తుంది. శ్రీశ్రీ ఆరుద్రకు చుట్టం మీదు మిక్కిలి నెచ్చెలికూడాను. కమ్యూనిస్టు భావాలమీద ఆదరం పెంచుకున్నాడు. ప్రేమకు సంబంధించిన తీవ్రత నశించింది. తన చుట్టూ వున్న సమాజాన్ని పరిశీలించాలనే జిజ్ఞాసా, దాన్ని మార్క్సిజంతో అన్వయించి అర్థం చేసుకోవాలనే కుతూహలము హెచ్చాయి. ఫ్యూడ్యలిజం, వర్గ పోరాటం, దుష్టశక్తులు, అభ్యుదయం, సామాజిక చైతన్యం వంటి పదాలు వాటికి సంబంధించిన రక రకాల భావాలు గట్టిగా వచ్చి యితని కవిత్వానికి అతుక్కుపోయాయి. ఈ దశలోనే కొన్నాళ్ళు, ఆరుద్ర అభ్యుదయ కవిగా భాసించాడు.

**'లోహవిహంగాలు'** గీత రచనతో "శ్రీశ్రీ" వెన్ను తట్టగా ఆరుద్ర అభ్యుదయ కవిగా ఆవిర్భవించాడు. ఆరుద్ర తానే చెప్పుకున్నట్లు అప్పటికి నాలుగేళ్ళ నుండే

పురుటినొప్పులు పడి కన్న గీతం ఇది. విశాఖమీద జపాన్‌వాడు బాంబులు కురిపించిన ఉదంతానికి సంబంధించింది. కవి విశాఖపట్టణానికి రెండా మడల దూరంలో ఉండే బుచ్చిరాజుపాలెంలో పదిగంటల పగటివేళ పుష్టిగా ఆరగించి పడుకున్నాడు. రెండు గంటలప్పుడు ఎండ ప్రచండ గ్రాంథిక భాషలాగా నిప్పులు చెరుగుతుంటే తెలివి తెచ్చుకొన్నాడు. తన కుటీరానికి దూరంగా జనం పరిగెడుతున్నారు. అప్పుడే విశాఖమీద బాంబులు కురిసి వెలిశాయి. మనుషులు ప్రాణాలు పిడికిట పెట్టుకొని గుండెలు చేత్తో పట్టుకుని బలుసాకు వెతుక్కుంటూ బ్రతుకుబాటమీద పయనిస్తున్నారు. మనుషుల వరద పారుతోంది. కారు మేఘాల్లో మోటారుకార్ల మాదిరి అక్కుపక్షి గాళ్ళమీద ఉక్కుపక్షులు రెట్టలు కురిపిస్తూ తిరిగాయి. జపానువాడు మృత్యువుకు టిఫిన్ కారియర్లను తెచ్చి బే ఆఫ్ బెంగాల్‌లో పెట్టాడు. విశాఖ షిప్ యార్డునూ, లోకో షెడ్‌నూ ఖచ్చితంగా తినడానికి నిశ్చయించుకున్నాడు. ఈ రకంగా సాగిన 'లోహవిహంగ' అప్పటి సామాన్య జనజీవన స్థితిని వివరించడానికి మాత్రమే ఉద్దేశింపబడింది. మానవతావాద, వాస్తవవాద, దృష్టి ఉన్నా కూడా అది అభ్యుదయ కవిత్వమే, అని హేమాహేమీలందరే ఒప్పుకొని నడుం కట్టిన దశ అది. అందుకే శ్రీశ్రీ లోహ విహంగాలను మెచ్చుకోవడం జరిగిందనుకుంటాను. జాతి నడిచే మార్గంగాని అది కోరుకొనే అభివృద్ధికానీ సామాన్య ప్రజల కోసమే, అనే నినాదాన్ని అప్పటి అభ్యుదయ కవులు చేపట్టారు. ఆ అభిప్రాయాన్ని బాగా వంటబట్టించుకున్న ఆరుద్ర తర్వాత ఎన్నో అటువంటి రచనలు చేశాడు.

లోకవృత్తం మీద ఆవేశం అన్యాయాలమీద, ఆకలిమీద తిరుగుబాటు స్పష్టం చేసిన ఖండికలెన్నో ఉన్నాయి. ఈ తిరుగుబాటు విసురులో అక్కడక్కడే శ్రీశ్రీ కనిపించి ఆరుద్ర ముద్రను కమ్మేస్తుండడం మనకు తెలుస్తుంటుంది.

పులి కోరల చలిగాలులు
చలి బాకుల దొంగ పోటు
ఆపిందిక కవచంలా
నడి వీధిన పడి బ్రతుకే
నీ ఒంటిన గుడ్డలేదు-

కాని అంతలోనే ఆ ప్రభావాన్ని విదిలించుకొని

అందాకా
భూలోకం పరుపుమీద
ఆకాశం కప్పులోని

కడలి పోరు గుర్రు పెట్టి
కలలేవీ కనకుండా
రాజులాగా నిద్ర పో

నిద్రపో చిట్టిపాపా - అంటూ తన సొంత గొంతుకనే ఆలపిస్తాడు ఆరుద్ర. ఇట్లు ఉదాహరించుకొంటూ పోతే ఎంతైనా గ్రంథం పెరుగుతుంది.

1948 నాటి ఆరుద్ర చిత్తవృత్తి శిల్పాభిముఖమైనదే. కాని 1960 నాటికి అది బింకాన్ని సడలించుకొని కొంతలో కొంత ప్రజాభిముఖంగా మారిందనే చెప్పవచ్చు. అందుకే కవి తన సాహిత్యోపనిషత్తులో

కావ్యం ఏదైనా సరే
కనీసం ఒక రిక్వైరుమెంటు
కావాలి కవిత హృదయానికి నరిష్మెంటు
కారాదు ఏనాడూ మెదడుకు పనిష్మెంటు — అని ఒప్పేసుకున్నాడు.

ఆరుద్ర మరో కావ్యం **'సినీవాలి'** అమావాస్యనాటి చంద్రకళకు సినీవాలి అని పేరు. అమావాస్య చక్కటి చీకటికి కాణాచి కదా. ఆనాడు చంద్రకళ కనబడుతుందా? కనబడదు. కనబడకపోయినా ఉంది. అష్ట కష్టాలు పడుతూ అకటా వికటపు చీకటి బ్రతుకులు బ్రతికే దీనుల జీవితాకాశాల్లో కూడా వెలుగు రేఖలుండి తీరాలి. కవి పెంపొందించుకొనే ఆ ఆశయొక్క రూపమే సినీవాలి కావ్యం. ఇందులో **"త్వమేవాహం"**లో ఉన్నంత టెక్నిక్ చిక్కదనం లేదు. ఆరుద్ర కవిత్వం ప్రజాభిముఖం అవుతున్నదనడానికి ఇదో శుభ చిహ్నం.

1960 లో సినీవాలి ప్రచురించిన తర్వాత వరసగా 1964 లో 'కూనలమ్మ పదాల'ను, 1965 లో 'ఏంచిన' పద్యాలనూ, 1969 లో 'ఇంటింటి పజ్యాల'నూ ప్రచురించాడు కవి.

'కూనలమ్మ పదాలను' ఆరుద్ర అభిప్రాయం ప్రకారం అంచనా వేస్తే ప్రజా కవిత్వం కింద జమకట్టవలసి వస్తుంది. తెలుగు దేశంలో వ్యవహారంలో వున్న కూనలమ్మ పదాలకు ఇది "బాణి ఇమిటేషన్" మాత్రమే. కవి నానాజాతి సమితిలాగా ఇందులో తడవని అంశం లేదు. ఇవి శ్రీశ్రీ అన్నట్లుగానే ఆరుద్ర సరదాలు అయోమయ లక్షణం గానీ అందని టెక్నిక్కో కానీ పొదగడానికి వీలు కలగదు.

కవిత్వంలో అన్య భాషా పదాలనూ అంత్యప్రాసలకూ, అనుప్రాసలకూ వాడుకుని భాషకో అందాన్ని తెచ్చాడు కవి. ఉపమానాలనూ, ఉపమేయాలనూ గూడా ఇంగ్లీషు పదాల్లో చెప్పాడు. ఇంగ్లీషు క్రియలకు ఇంచుక్కులు, మిళాయించి సరదాగా, వాడుకున్నాడు. ఇటువంటి చోట్లు ఎవరూ అనుకరించలేని ఆరుద్ర ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

విహంగాలు = పక్షులు; ఎడద = హృదయము; దీప్తి = కాంతి; బావుటా = జెండా; పరిమళము = సువాసన; అగ్గించుట = పొగడుట; పరివర్తనము = మార్పు.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

రాష్ట్రావతరణము; జవరాలు; బ్రహ్మాస్త్రము; సాహిత్యోపనిషత్తులు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

విశాలాంధ్ర, బ్రహ్మాస్త్రము, దుష్టశక్తులు.

**అర్థ సందర్భములు :**

1. "అబ్బో! పెడదారి వదిలేసి ఎడదారి ఎక్కావ్"
2. నీ బావుటా ఎగరవేస్తా మళ్ళీ?
3. అక్కుపక్షివాళ్ళమీద ఉక్కుపక్షి రెట్టలు కురిపిస్తూ తిరిగాయి.
4. "కారాదు ఏనాడూ మెదడుకు పనిష్మెంట్"

**ప్రశ్నలు :**

1. ఆరుద్రగారికి మాతృదేశముపై గల భక్తిని వివరింపుము.
2. ఆరుద్రగారు అభ్యుదయకవిగా ఎట్లు రాణించెనో వివరింపుము.
3. ఆరుద్రగారి 'సినీవాలి' కావ్యం గూర్చి వ్రాయుము.
4. ఆరుద్రగారి ప్రజాకవిత్వం గూర్చి వివరింపుము.

*విద్యార్థులకు సూచన :*

ఆరుద్రగారి వంటి ఇతర ఆధునిక కవులు, వారి రచనలు గూర్చి తెలిసికొనుము.



# 3. నవలలు - కథానికలు

*– డాక్టర్ దివాకర్ల వేంకటావధాని*

*శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు భీమవరం తాలూకా యండగండిలో సుందరరామయ్య వెంకటలక్ష్మీ దంపతులకు **1913** సం॥లో జన్మించిరి. కవి **భూషణ** బిరుదాంకితులు. మంచి పేరుగన్న వ్యక్తి. విమర్శకులు. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేసిరి. **"ప్రాఙ్నన్నయ యుగము - నన్నయ్య భారతము"** అను పరిశోధన సిద్ధాంత వ్యాసము వ్రాసి **"డాక్టరేటు"** పట్టము పొందిరి. ప్రాచీన కవుల కావ్యాల్లోని మాధుర్యాన్ని, కవుల నైపుణ్యాన్ని తన రచనలతో, ఉపన్యాసాలతో తెలుగువారందరికీ పంచిపెట్టిన సౌమ్యమూర్తి. **1977** సం॥లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు **'కళాప్రపూర్ణ'** బిరుదుతో వీరిని సత్కరించినది.*

***ఆంధ్ర నాటక పితామహుడు, రాజ సందర్శనము, మధువనము, నాగానందము, కిరాతార్జునీయము*** *మొదలగునవి వీరి యితర రచనలు. నవలలు - కథానికలు అను ప్రస్తుత పాఠ్యభాగము **'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర'** నుండి గ్రహింపబడినది.*

పాశ్చాత్య భాషా సంపర్క ప్రాభవమున వృద్ధినొందుచు నాధునికాంధ్ర వాఙ్మయమునకు బరిపుష్టి కలిగించుచున్న సాహిత్య ప్రక్రియలలో నవల యొకటి. దక్షిణాంధ్ర యుగమున వచన గ్రంథములు పెక్కు వెలువడినను అందుఁ జాల భాగము పౌరాణిక వస్తు విలసితమైనదే. పాశ్చాత్య భాషా సంపర్కము కలిగిన పిమ్మటనే 'నవల' యను ప్రక్రియ భారతదేశ భాషలలో బ్రబల జొచ్చినది. కీ.శే. వీరేశలింగ పంతులుగారు క్రీ.శ. 1879 లో తమ రాజశేఖర చరిత్రమును బ్రకటించిరి. అంతకుముందు కూడ నొండు రెండు నవలలు రచింపబడిన మాట సత్యమే యయ్యు బెక్కు కారణములచే నాంధ్రమున రాజశేఖర చరిత్రయే మొదటి నవలగా బరిగణింపబడుచున్నది.ఇది 'గోల్డుస్మిత్ వికార్ ఆఫ్ వేక్ఫీల్డు' ననుసరించి వ్రాయబడిన సాంఘిక నవల అనుసరణమయ్యు స్వతంత్రమువలె నొప్పారుట యీ నవల యందలి విశిష్టత. ఇందు శైలియు, వర్ణనలును మిక్కిలి రమణీయములుగా నుండును.

క్రీ. శ. 1893 లో ఖండవల్లి రామచంద్రుడుగారు 'ధర్మవతీ విలాస'మను నవలను ప్రచురించిరి. పిమ్మట వారే మాలతీ రాఘవము, లక్ష్మీసుందర విజయము అను మరి రెండు నవలలను వెలయించిరి. ఈ మూడు నవలలు అప్పుడు చింతామణి పత్రిక వారొసంగుచుండిన పారితోషికములను బడయ జాలినవి. సుప్రసిద్ధ నవలా రచయితలు, కవులు, నాటక కర్తలునైన చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు క్రీ.శ. 1894 లో రామచంద్ర విజయము పేర మొదటి నవలను రచించి 'చింతామణి' బహుమానమును గడించిరి. క్రీ.శ 1896 లో వారి 'హేమలత'యు, 1897-98లలో అహల్యాబాయి, కర్పూర మంజరులును బ్రథమ బహుమానములకు బాత్రములైనవి. వరుసగా లభించిన యా బహూకృతులతో పంతులుగారి కీర్తి దిగంత వ్యాప్తమైనది. శ్రీ వీరేశలింగం పంతులుగారు సాంఘిక నవలలకు వలె లక్ష్మీనరసింహం పంతులుగారు చారిత్రక నవలకాద్యులని చెప్పవచ్చును. వీరి 'గణపతి' హాస్య రస ప్రధానమైన నవల. అదియు రామచంద్ర విజయమువలె మిక్కిలి కీర్తి ప్రచారములు గాంచినది. చిలకమర్తివారు రచించిన నవలలకు గలిగిన ప్రతిష్ఠకు వారి కథా కథన నైపుణియేకాక ప్రసన్న మధురమైన శైలియు జాలవఱకు దోడ్పడినది.

ఆధునికాంధ్ర కవులలో వలెనే నవలాకర్తలలో గూడ నగ్రేశరులని చెప్పదగినవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. 'ఏకవీర' వారి ప్రథమ నవల. అందలి శైలియు గథా నిర్మాణ కౌశలమును బాత్ర పోషణమును అనన్యాదృశము లైనట్టివి. చెలియలి కట్ట, ధర్మచక్రము, బద్దన్నసేనాని, స్వర్గానికి నిచ్చెనలు, తెఱచి రాజు, మా బాబు మున్నగునవి వారి యితర నవలలు. వారి 'వేయి పడగలు' పరిమాణమునందును వలెనే గుణము నందును నగ్రగణ్యమైనది. అది ఆధునికాంధ్ర దేశ సాంఘిక మత రాజకీయ పరిస్థితులకు మణిదర్పణము. అందలి వర్ణనలు, భావ గంభీరములు. పాత్రలు సజీవములు. శైలి మధుర గంభీరము. అది ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి నవలా పోటీలో అడవి బాపిరాజుగారి నారాయణరావుతో పాటు బ్రథమ బహుమానము నందుకొన్నది. శ్రీ విశ్వనాథగారి నవలలో బ్రకృతి పరిశీలనము వలెనే ప్రపంచ పరిశీలనమును మిక్కుటముగ గోచరించును. అందు బ్రతి పుటయు వారి సనాతన సంప్రదాయాభిమానము జక్కగా జాటుచుండును.

సాంఘిక నవలా కర్తలలో పేరెన్నిక గన్న వారింకను బలువురున్నారు. శ్రీ అడవి బాపిరాజుగారి 'నారాయణరావు', వేయి పడగల వలెనే మిక్కిలి ప్రశస్తి నార్జించినది. హిమబిందు, కోనంగి, గోనగన్నా రెడ్డి మున్నగువారి యితర నవలలు కూడ నాంధ్ర

దేశమున నధిక ప్రచారము గాంచినది. శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'ఆత్మ బలి', గోపీచందుగారి 'అసమర్థుని జీవయాత్ర' బుచ్చిబాబుగారి 'చివరకు మిగిలేది' జి.వి. కృష్ణారావుగారి 'కీలుబొమ్మలు' బలివాడ కాంతారావుగారి 'గోడ మీది బొమ్మ', పోతుకూచి సాంబశివరావుగారి 'ఉదయ కిరణాలు' చక్కని పాత్ర చిత్రణముతోడను సాంఘిక వాతావరణముతోడను గూడి పాఠకుల ప్రశస్తులందుకొన్న 'యుత్తమ నవలలు'

శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారి నారాయణభట్టు, రుద్రాంబ, మల్లారెడ్డి అను చారిత్రక నవలలు మిక్కిలి ప్రసిద్ధములైనవి. చారిత్రక సత్యములను విడువకయే శ్రీ శాస్త్రిగారు సరసమనోహరముగా గథను సాగించుచుందురు. వారి పాత్ర చిత్రణము గతించిన చారిత్రక మహావ్యక్తులను సుస్పష్ట రేఖలతో బఠితలకు సాక్షాత్కరింపజేయును.

ఆంధ్ర నవలా ప్రపంచమునకలంకారప్రాయమై యాంధ్రజనుల యాదరాభి మానములు చూఱగొన్న యత్యుత్తమ నవల శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి". ఇందు రాజకీయ, సాంఘిక మత సమస్యలెన్నో బహుముఖముల బరిశీలింపబడినవి. భారత స్వాతంత్ర సంగ్రామము యొక్కయు, జాతీయోద్యమము యొక్కయు నారంభ పరిణామముల నిందు గాంచనగును. నిపుణమైన పాత్ర పోషణమునకును, నిర్మలమైన యాత్మపరిశీలనమునకును, బరిణతమైన శైలికిని ఈ నవల పట్టుగొమ్మ.

హాస్య ప్రధానములైన నవలలు వ్రాసినవారిలో శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రిగారును, మునిమాణిక్యం నరసింహారావుగారును అగ్రేసరులు. నరసింహ శాస్త్రిగారి 'బారిష్టరు పార్వతీశ' మొకప్పుడాంధ్ర దేశమును నుఱ్ఱూతలూగించినది. శ్రీ నరసింహరావుగారి తిరుమాళిగ, దీక్షితులు, కాంతం కథలు ఆంధ్రదేశము నందంతట వ్యాప్తి నొందిన హాస్య రచనలు.

నవలా రచనలో పేరుగాంచిన నారీమణులు కూడ బలువురున్నారు. శ్రీమతి జయంతి సూరమ్మగారి సుదక్షిణా చరిత్రము పౌరాణి కేతివృత్తముతో భాసిల్లుచున్నది. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి వసుమతి, మాలతీచందూరుగారి చంపకము, చెదలపురుగు, వసుంధరగారి దూరపుకొండలు, శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మగారి బలిపీఠము, పేకమేడలు సాంఘిక నవలలోఁ బ్రశస్తి వహించినవి.

పాశ్చాత్య భాషా సంపర్కము వలన నిటీవల వెలసిన నూతన ప్రక్రియలలో నవలకు వలెనే కథానికను గూడ బేర్కొనవలయును. మొపాసా, మాఘం, ఓ హెన్రీ

ప్రభృతులాంగ్ల కథానికా రచయితలలో నాద్యులు. కీ.శే. గురజాడ అప్పారావుగారు రచించిన కథానికలే యాంధ్రమున మొదటివిగా భావింపబడుచున్నవి. కీ.శే. వేదము వెంకటరాయ శాస్త్రిగారు భోజకాళిదాసు కథలు, బేతాళ పంచవింశతి, కథా సరిత్సాగరము అను కథల సంపుటములను బ్రకటించిరి. ఇవి సంస్కృతము నుండి యనువదింపబడినవి.

ఆంధ్రమున కథానికా రచనకు బునాదులు వేసిన ప్రముఖులలో 'ఆంధ్ర పితామహ' 'పద్మభూషణ' శ్రీ మాడపాటి హనుమంతరాయ పంతులుగారొకరు. తెలంగాణము సర్వతోముఖ వికాసమునకు పాటుపడిన వైతాళికులు వీరు. వీరి జన్మస్థలము కృష్ణా మండల మందలి పొక్కునూరు. వీరికి సంస్కృతాంగ్ల భాషలందేకాక ఉర్దూ, పారశీక భాషలందును మంచి పాండిత్యము కలదు. వీరేశలింగం పంతులుగారివలె వీరు మొదట పద్యరచన చేయుటకే యారంభించినను తరువాత వచన రచన యందే యభినివేశము ప్రదర్శించిరి. వీరు వివిధ పత్రికలందు బెక్కు వ్యాసములు విమర్శనలు ప్రచురించి యుండిరి. వీరు రచించిన కథానికలు 1911లో 'మల్లికా గుచ్ఛ'మను పేర నొక సంపుటముగా ప్రకటింపబడినవి. ఇందు కొన్ని స్వతంత్రములు కొన్ని ప్రేమచంద్ కథల కనుసరణములు. హృదయ శల్యము మున్నగు కథలు భావ సంఘర్షణమున కాటపట్టులై మానవ మనస్తత్త్వమును జక్కగా జిత్రించుచు హృద్యముగా నున్నవి. పంతులుగారి శైలి ధారాళమై వ్యావహారికమునకు సన్నిహితమయ్యు సులక్షణమై యొప్పారుచుండును.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు కథానికా రచనమున గూడ గృతహస్తులే. వీరి 'ముగ్గురు బిచ్చగాళ్లు', 'మాక్లీ దుర్గంలో కుక్క', మిక్కిలి ప్రసిద్ధి నొందిన కథానికలు. వీరి కవిత్వము నందు వలెనే నవలలందును గథానికలందును గూడ శిల్ప సౌందర్యము సర్వత్రగోచరించును. శ్రీ తల్లావజ్ఝల శివశంకర స్వామిగారి కథలు, మిక్కిలి రసవంతముగా నుండును. అడవి బాపిరాజుగారికి గథానికా కర్తలలో విశిష్ట స్థానమున్నది. వీరి తిరుపతి కొండమెట్టు, భోగీరలోయ, అను కథలు శిల్పకళా సౌందర్యమును జూఱగొన్న యుత్తమ కథానికలు. తరంగిణి, రాగమాలిక, అంజలి అను వీరి కథానికా సంపుటములధిక ప్రచారము నందజాలినవి.

తెలుగునందలి ప్రథమ శ్రేణికి జెందిన కథానికా రచయితలలో శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారొకరు. వీరి కథ లెనిమిది సంపుటములుగా ముద్రింపబడినవి. జీవిత సత్యములు ఈకథలలో మనోహరముగా జిత్రింపబడినవి. సహజములైన

సంభాషణలతోడను, జాతీయమైన పదప్రయోగముల తోడను గూడి వీరి కథలు తెలుగుతనమునకు నిలయములైయుండును. వీరి కథానికలలో గులాబీ అత్తరు, కచ్చితమైన జవాబు మున్నగునవి సర్వ విధముల ప్రశస్తములైనవి.

ఆంధ్ర కథానికల కద్వితీయ సౌందర్యమునాపాదించి పేరుగన్నవారు శ్రీచలంగారు. వీరి రచనలో మీటర్లింకు ఛాయలు కానవచ్చును. వీరి భాష, భావములు, కథన విధానములన్నియు మిగుల నాకర్షకములుగా నుండును.

శ్రీ కొడవటి గంటి కుటుంబరావుగారుత్తమ కథానికా రచయితలుగానే కాక విమర్శకులుగా గూడ బేరుగాంచినవారు. వీరి కథలకు బాత్రపోషణ కౌశలము జీవగఱ్ఱ. వీరి రచన వ్యంగ్య చమత్కారములతో గూడి హృద్యముగానుండును. పక్షికోసం వెళ్ళిన పంజరము, ఆడజన్మ మున్నగు వీరి కథానికలనానందముతో జదువని యాంధ్రులుండరు. శ్రీ చింతా దీక్షితులుగారికి కథక చక్రవర్తి బిరుదము సార్థకమైనది. వీరు దాసరి పాట మొదలగు పెక్కు కథానికలను వ్రాసియుండిరి. వీరి "ఏకాదశి" ఆంధ్ర దేశమున మిక్కిలి ప్రచారమొందిన కథల సంపుటము. బాల సాహిత్యము నందును, బాల చిత్తవృత్తి కనుగుణములైన కథలు వ్రాయుట యందును వీరి కభినివేశము మెండు.

శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి కాంతం కథలిదివఱకు బేర్కొనబడినవి. దుఃఖ భరాలసమైన దైనిక జీవితమును మధురాతి మధురము చేయగల హాస్యరసము నుచితరీతి బోధించుటలో వీరు సిద్ధహస్తులు. శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రిగారు కొన్ని యుత్తమ కథానికలు రచించిరి. 'చిత్తరువను' వీరి కథానిక చాలా మనోహరముగా నుండును. పండితులయ్యు గథానికా రచనకు గడంగిన వారిలో శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారొకరు. వీరు కవులుగా కథానికా కర్తలుగా, విమర్శకులుగా మిక్కిలి ప్రసిద్ధిగాంచినారు. హనుమచ్ఛాస్త్రి కథలను పేర బ్రకటింపబడిన సంపుటములలో కథలన్నియు నమృత వాహినులు.

శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన' ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయ బహుమానము పొందినది. వీరు రచించిన కథల సంఖ్య తక్కువైనను వీరు పొందిన ప్రశస్తి యపారమైనది. దానికి వీరు కథానికా రచనలో బ్రదర్శించు శిల్ప విశేషమే కారణము. 'ఎదురు చూస్తున్న ముహూర్తము', 'వాసనలేని పూలు' మొదలయిన వీరి కథలు మిక్కిలి ప్రసిద్ధములయినవి. రమ్య కథా నిర్మాణము, సుందర సన్నివేశ కల్పనము, సహజసంభాషణము మున్నగునవి వీరి కథలకుఁ బెట్టని సొమ్ములు.

శ్రీ బుచ్చిబాబుగారి ప్రతిభ బహుముఖమైనది. నవలారచనయందును, ఏకాంకికా సృజనమందును వలెనే కథానికా నిర్మాణమున గూడ వీరు మిక్కిలి నేర్పు ప్రదర్శించియున్నారు. అడవిగాచిన వెన్నెల, మేడమెట్లు నిరంతరత్రయం మున్నగు వీరి కథానికలాంధ్ర దేశమున మిక్కిలి ప్రసిద్ధములు. 'కరుణకుమార కథలు' సంపుటముగా ప్రచురింపబడినవి. రసపోషణమున నిందలి కథలత్యంత రమణీయ ములై రచయిత మానవ మానస ప్రవృత్తి పరిజ్ఞానమును జక్కగా వ్యక్తము చేయుచున్నవి. శ్రీ యస్.ఆర్. చందూరిగారి కథలాంధ్ర కథాపాఠకులకు సుపరిచితములు.

శ్రీ మధురాంతకం రాజారాంగారి 'వక్రగతులు' 'కుంపటిలో కుసుమం' మొదలయిన కథలు సుప్రసిద్ధములు. కథానికా రచయిత్రులలో శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి, మాలతీ చందూరు, ఇల్లిందల సరస్వతీదేవి, శ్రీదేవి, భానుమతి మున్నగువారు పేర్కొనదగినవారు.

పాశ్చాత్యవంగ హిందీ భాషలనుండి పెక్కు కథానికలనువదింపబడియున్నవి. టాల్‌స్టాయ్, మాక్సింగోర్కీ, మొపాసా, మాఘం మున్నగు పాశ్చాత్యరచయితలయు, రవీంద్ర, శరచ్చంద్ర ప్రభృతి వంగ రచయితలయు, జయ శంకర ప్రసాద ప్రేమచంద్ర ప్రముఖ హిందీ రచయితలయు గథానికలు వందల కొలది యింకను అనువదింపబడుచున్నవి. ఆధునిక కాలమున గథానికలకు జనులలో నపారమైన యాదరాభిమానములున్నవి. కథానికా రచయితలీవిషయమును గ్రహించి తమ రచనలలో సంఖ్యకంటె శిల్ప విశేషమునకు అధిక ప్రాధాన్యమొసంగుదురు గాక.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

ప్రాభవము = గొప్పతనము; పారితోషికము=బహుమానము; ఆద్యులు=మొట్టమొదటివారు; పరిమాణము=కొలత: విస్మృతము=నశించిన: కనబడకపోయిన, సంగ్రామము = యుద్ధము, నారీమణులు = స్త్రీలు, ప్రశస్తము = పేరుగాంచిన.

**సంధులు :**

**ఈ క్రింది పదములను విడదీసి సంధి పేర్లను సూత్రములను వ్రాయుము.**

వాఙ్మయము, విశ్వవిద్యాలయము, అత్యుత్తమ.

**సమాసములు :**

**ఈ క్రింది వానికి విగ్రహ వాక్యములను వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

ఆంధ్ర వాఙ్మయము, మణిదర్పణము, యోగవియోగములు, బాలసాహిత్యము.

**అర్థ సందర్భములు :**

1. ఆంధ్రమున రాజశేఖర చరిత్రయే మొదటి నవలగా పరిగణింపబడుచున్నది.
2. హాస్యరసమును ఉచిత రీతి బోధించుటలో వీరు సిద్ధహస్తులు.
3. ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయ బహుమానము పొందినది.

**ప్రశ్నలు :**

1. 'నవల'-పుట్టుకను గూర్చి వ్రాయుము.
2. ఆంధ్ర దేశములో వెలసిన ప్రసిద్ధ నవలలు- రచయితలను పేర్కొనుము.
3. విశ్వనాథ సత్యనారాయణగారు 'నవలాగ్రేసరులు- వివరింపుము.
4. హాస్యరస ప్రధానములైన నవలలను పేర్కొనుము.
5. నవలా రచనలో పేరుగాంచిన నారీమణులు, వారి రచనలు పేర్కొనుము.
6. కథానికల యొక్క ప్రాముఖ్యము - రచయితలు, రచయిత్రుల గూర్చి వివరింపుము.

***ఉపాధ్యాయులకు సూచన :***

విద్యార్థులు గ్రంథాలయమునకు వెళ్ళి నవలలు- కథానికలు చదువుటకు ప్రోత్సహింపుము.

***విద్యార్థులకు సూచన :***

కథలు, కథానికలు, వ్రాయుటకు ప్రయత్నింపుము.



# 4. ఆంధ్ర పత్రికావతరణము

**– నోరి నరసింహశాస్త్రి**

*నోరి నరసింహశాస్త్రిగారు **1900**వ సంవత్సరమున గుంటూరులో జన్మించిరి. మహాలక్ష్మి, హనుమచ్ఛాస్త్రిగార్లు వీరి తల్లిదండ్రులు. వీరు తెలుగు, సంస్కృతము, కన్నడము, ఆంగ్లభాషలో గొప్ప పండితులు. **"కవిసామ్రాట్టు"** బిరుదాంకితులు. తెలుగుదేశ చరిత్రకు **"వచన కథాకావ్య గౌరవం"** సిద్ధింపజేసిన మహా రచయిత. నవ్య సాహిత్యోద్యమ వ్యాప్తికి విశేష కృషి చేసిరి. వీరి **'కవిసార్వభౌముడు'** నవలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారి బహుమతి లభించినది. వీరు కవి మాత్రమే గాక గొప్ప విమర్శకులు, నాటక రచయిత మరియు వ్యాసకర్త గూడ. **గీతమాలిక, సోమనాథ విజయము, నారాయణభట్టు, భాగవతావతరణము, మల్లారెడ్డి, కవిసార్వభౌముడు** మొదలగునవి వీరి యితర రచనలు.*

ప్రస్తుత పాఠ్యభాగము శ్రీ నోరి నరసింహశాస్త్రి రచించిన సారస్వత వ్యాసములందలి **"పూర్ణ పురుషుడు" శ్రీ కాశీవిశ్వనాథుని నాగేశ్వర పంతులుగారు"** అనెడి శీర్షిక నుండి గ్రహింపబడినది. ఇందు ఆంధ్ర పత్రిక అవతరణమును గురించి చక్కగా వివరింపబడినది.

నాగేశ్వరరావు అప్పటి నివాస స్థలము బొంబాయి నగరము. అప్పుడు భారతదేశమునకు రాజధాని కలకత్తా. కలకత్తాకు రాజకీయ ప్రాధాన్యమెక్కువ. బొంబాయి వర్తకమునకు కేంద్రము. భరత ఖండము పాలించుటకు వచ్చే ఆంగ్లాధికారులంతా ముందు బొంబాయి రేవులో దిగేవారు. అందుచేత అది యిప్పుడు "ఇండియా ద్వారము" (Gate way of India) అయినది. సైన్యాలు భూప్రయాణము చేసే రోజులలో భారత భూమికి దేహళితయైన "దేహళి" (డెల్హీ) ప్రాముఖ్యము వహించేది. దేహళి యనగా గడప, ద్వారము. నౌకాయానము ప్రాముఖ్యము వహించిన తర్వాత, బొంబాయి దేహళి స్థానముగా మారిపోవుటచేత దానికి రాజకీయముగా గూడ ప్రాముఖ్యము గల్గినది. ఆంగ్ల ప్రభుత్వము నుండి స్వేచ్ఛ పొందవలెననే

సంచలనాలన్నిటికీ కలకత్తా, బొంబాయి నగరాలు అప్పట్లో కేంద్రాలుగా వుండేవి. అయితే ఆ రెండు నగరాలకు ఆదర్శ స్వరూపములో ఎంతో భేదముండేది.

కలకత్తా రాజధాని అయినందున విదేశ సంస్కారాలు వంగదేశములో ముందు పాదుకున్నవి. అందువల్లనే అక్కడినుండియే బ్రాహ్మమతమూ, ఇతర సంఘసంస్కరణ సిద్ధాంతాలూ దేశమంతటా వ్యాపించినవి. ఆ కాలంలో భారత భూమిలో అంతటా పెద్ద పెద్ద యుద్యోగాలలో నున్న భారతీయులంతా వంగీయులే. వంగీయుల జనసంఖ్య గూడ చాల ఎక్కువ, అయిదు కోట్లు, వంగదేశ ప్రాబల్యము అణచడానికే అప్పుడు ఆ ప్రాంతాన్ని రెండుగా విభజించారు. వంగదేశ నాయకులు తమ రాష్ట్రోద్యమాన్ని స్వదేశీ ఉద్యమంగా మార్చి, భరతభూమి నంతటినీ ఉద్బోధించారు. ఆ యుద్యమాల కన్నిటికీ మూలము అక్కడ ఆంగ్ల సంపర్కము వల్ల కలిగిన ఉజ్జీవనమే. మన దేశములో అధికార భాషగా వుండవలసినది ఫారసీయా, సంస్కృతమా, ఇంగ్లీషా అనే సమస్య వచ్చినప్పుడు, ఇంగ్లీషును సమర్థించిన వారిలో ప్రముఖులు, సంఘసంస్కర్తలైన రామమోహనరాయలు వంటి వారిని మరచిపోరాదు. ఆ తర్వాత బ్రిటిషు రాజనీతి తంత్రము వంగ రాష్ట్రమును ఏకము చేసి, రాజధానిని ఢిల్లీకి మార్చినది. దానితో వంగప్రాముఖ్యము తగ్గినది.

ఇక మహారాష్ట్రములో ఉద్బుద్ధమైన స్వాతంత్ర్యేచ్ఛ, పాశ్చాత్య సంపర్కమువల్ల జనించినది కాదు. అది స్వభావ సిద్ధముగా భారతీయ సంస్కృతి యందు అభిమానముతో పుట్టిన స్వాతంత్ర్యేచ్ఛ. బొంబాయి రాష్ట్రానికి రాజకీయ రాజధాని బొంబాయి నగరమే అయినా సాంస్కృతిక రాజధాని పూనా నగరము. భారత ఖండములో అతి విస్తారభాగమును పాలించిన భారతీయులలో చివరివారు మహారాష్ట్రులు. ఆంగ్లేయులను చివరకు ప్రతిఘటించిన ప్రబల భారతీయులు మహారాష్ట్రులే. **1857** లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామములో దాక్షిణాత్యులలో ఎక్కువ పాలు వహించినది మహారాష్ట్రులే. మహారాష్ట్రము రాజకీయ కేంద్రమైనప్పుడు, భరతఖండములోని ఎక్కడెక్కడి మేధావులు అక్కడికి చేరుకొన్నారు. వారిలో "తెలంగ్" అని వ్యవహరించే వారంతా స్పష్టంగా తెలుగుదేశమునుండి వెళ్ళి మహారాష్ట్రులైన వారే. అట్లాగే యితర ప్రాంతాలవారు గూడ వెళ్ళి మహారాష్ట్రులలో కలిసిపోయినారు. మహారాష్ట్రులంటే భారత జాతీయతకు చివరి వారసులు, చివరి ప్రభువులు.

రాజకీయముగా మహారాష్ట్రుల ప్రాభవము తగ్గినా, సాంస్కృతికంగా భారతభూమిని వారే పాలించారు. విద్యానగర రాజ్యము ఉజ్జ్వల ప్రభతో వెలుగుతున్న

రోజులలో "అక్కడ సర్వ భారత సంస్కృతి కేంద్రీకృతమైనట్లే" చివరకు మహా రాష్ట్రములో, అందులో ముఖ్యంగా పూనా నగరంలో భారతీయ సంస్కృతి ప్రజ్వలించింది. "నిర్ణయ సాగర్" వారు అన్ని సంస్కృత గ్రంథాలు అంత నిర్దుష్టంగా, అంత చౌకధరకు ప్రచురింపగల్గినారంటే, అక్కడ ఎంతమంది విద్వాంసులు నాలుగు మూలల నుండి చేరిన వారుండేవారో ఊహించవలసిందే. దేవనాగర లిపిలో వారు ముద్రించిన గ్రంథాలకు మూలమైన వ్రాతప్రతులు ఎక్కువ భాగము ఆంధ్ర లిపిలోనివని గుర్తించుకుంటే విద్యానగర సంస్కృతికి ఆనాటి మహారాష్ట్రము వారసత్వము వహించినదని అవగతమవుతుంది.

మహారాష్ట్రములో ముఖ్యముగా శివాజీ స్మరణముతోను, గణపతి నవరాత్రి ఉత్సవాల సందర్భంగాను జాతీయోద్యమాలు వికసించినవి. గోఖలే వంటి విద్యావేత్త, తిలకు వంటి మహావిద్యాంసుడు అక్కడి ఉద్యమాలు నడిపిన వారిలో ప్రధానులు. **"కేసరి"** పత్రిక స్వాతంత్ర్య సమరానికి దారితీసినది. మహారాష్ట్ర దేశ నివాసము శ్రీ. కె.వి.లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి స్థాపనకు, విజ్ఞాన సర్వస్వ ప్రచురణకు పురికొల్పినట్లే, శ్రీ నాగేశ్వరరావు పంతులను బహుముఖ రంగములలో దారి చూపి నడిపించుటకు కారణమైనది.

నాగేశ్వరులది మహారాష్ట్ర మధ్యములో ఉద్బుద్ధమైన స్వజాతీయ సంస్కారము. అది కేవలము మార్పు లేకుండా, విజాతీయ విజ్ఞాన జ్యోతిని చూడనని కళ్ళు మూసుకొని ఉండే అంధుల మూఢ పద్ధతి కాదు. అది విశ్వవ్యాప్తమైన విజ్ఞానాన్ని, సంస్కారాన్ని, ప్రబోధాన్ని జీర్ణము చేసుకొని, స్వాయత్తము చేసుకొని, జాతీయ సంస్కారానుగుణ్యంగా మలచుకొనే సజాతీయ ప్రాణశక్తి! ఆ ప్రాణ జ్యోతిని నాగేశ్వరులు మహారాష్ట్రములో దర్శించి, ఆంధ్రులకు ఆంధ్ర సంస్కృతికి అనుగుణంగా దానిని వెలిగించి మనకు ప్రత్యక్షము చేసినారు. అందువల్ల నాగేశ్వరుల ఉద్యమాలన్ని ఆంధ్రులు స్వాగత పూర్వకంగా గ్రహించారు. వారి యుద్యమానికి ఎక్కడా ప్రతిఘటన ఉండేదికాదు. వారి భావాలతో ఏకీభవించని వారియందు గూడ వారికి ద్వేషముండేది కాదు. అందుకు ముఖ్యమైన కారణము వారిలో దిన దిన ప్రవర్ధమానమవుతున్న సర్వాత్మ భావమే.

నాగేశ్వరులు మహారాష్ట్ర దేశ మధ్యములో నుండి ఆంధ్రదేశానికి ప్రదర్శించిన మొదటి దీపము **"ఆంధ్ర పత్రిక"**. అది 1908 జనవరి లో ప్రారంభమైనది. అప్పుడది వార పత్రిక. సరిగ్గా నాగేశ్వరులు గణపతి నవరాత్రులు పూర్తిచేసుకొని శ్రీ మహాగణపతిని ప్రసన్నులుగా చేసుకొని **'ఆంధ్ర పత్రికను'** ఆరంభించారు.

సర్వ విఘ్న నివారకుడు గణాధిపతిని అధమ పక్షము స్మరణమైనా చేయనిదే, భారతీయులు ఏపనికి నుపక్రమించరు. అప్పటికి పుట్టిన పత్రికలు గాని, తర్వాత పుట్టినవిగాని, ఆంధ్రదేశములోని పత్రికలు చాల భాగము త్వరగానో, ఆలస్యంగానో అంతరిస్తున్నవే. గణాధిపతి ప్రసాదమున్న ఆంధ్ర పత్రిక త్వరలోనే దినపత్రికయైనది.

నాగేశ్వరులు తమ అభిమానౌషధానికి **అమృతాంజనము** అని పేరు పెట్టి కృతార్థులైనట్లే, పత్రికకు గూడ పరమోచితమైన **"ఆంధ్ర పత్రిక"** అని పేరు పెట్టడము వారి అద్భుతమైన దూరదృష్టికి నిదర్శనము. అప్పటికి ఆంధ్ర రాష్ట్రము కావలెననే ఆలోచన గూడ ఎవరికి తట్టి యుండలేదు. తర్వాత కొద్దికాలానికే ఆంధ్రోద్యమము ఆరంభమైనది. అందులో ఆంధ్ర పత్రిక వహించిన పాత్ర ఎంత వర్ణించినా తీరదు.

ఒక్క ఆంధ్ర పత్రిక పేరేగాదు. అప్పుడు ఆంధ్రదేశములో చాలా గ్రామాలకు వారానికి రెండుసార్లని పేరున్నా నిజంగా ఒక్కసారే టపా వెళ్లేది. సరిగ్గా టపా వెళ్ళే రోజుకు అందేటట్లుగా ఆంధ్ర పత్రిక వచ్చేది. గ్రామస్థులకు అది ఒక పండుగ. మళ్ళీ వారానికి ఆంధ్ర పత్రిక వచ్చేదాకా, గ్రామీణులు ఆ పత్రికను మరల మరల చదివేవారు. చదువలేనివారు వినేవారు. ఆ చదవడమెట్లా? **"ఆంధ్ర పత్రిక దగ్గర నుంచి అమృతాంజనం దాకా"**, ఈ మాటకు ఆ మూలాగ్రమూ అనే అర్థం. ఆ అర్థానికి మూలకారణము ఇప్పటికి వాళ్ళకు తెలియదు. పత్రిక మొదట **'ఆంధ్ర పత్రిక'** అని ఉన్నట్లే, చివరి పేజీ చివరిలో చాలా కాలము వరకు తప్పనిసరిగా అమృతాంజన ప్రకటన ఉండేది. ఆంధ్ర పత్రికయే తర్వాత పుట్టిన అన్ని పత్రికలకు ఒరవడియైనదంటే అతిశయోక్తి కాదు. పత్రికా ప్రచురణల కష్టసుఖాలు, పుట్టు పూర్వోత్తరాలు బాగా తెలిసిన శ్రీ నార్ల వేంకటేశ్వరరావు **"ఆంధ్రప్రభ"** సంపాదకులుగా ఉన్నప్పుడు వ్రాసిన మాటలు చదివితే మన ఆంధ్ర పత్రిక నాగేశ్వరరావు మహత్త్వము కొంత బోధ పడుతుంది.

"తెలుగు పత్రికా రచయితలకు కులపతి శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు. ఈనాడు తెలుగు జర్నలిజం యింత అభివృద్ధి చెందిందంటే, ముఖ్యంగా తెలుగు దినపత్రికలు అభివృద్ధిలోకి వచ్చాయంటే అదంతా ఆయన చలవే. 1914 లో ఆయన మొదట తెలుగు దినపత్రిక స్థాపించినప్పుడు ఆయన వద్ద కల సాధన సంపత్తి బహుస్వల్పం. పత్రికలలో పనిచేయడానికి అనుభవజ్ఞులైన ప్రతిభావంతులు లేరు. ప్రజలైనా చేయూతనిచ్చి తోడ్పడేట్లు వున్నారా అంటే అదీ లేదు. అయితే ఈ చిక్కులేమి ఆయనను అడ్డలేకపోయినవి. అచంచలమైన ఆత్మవిశ్వాసము ఆయనది. విజ్ఞాన

ధనాన్ని పంచిపెట్టాలనే ఉత్సాహము, సరస్వతీ పరిమళాన్ని గుబాళింపచేయాలనే ఉత్సాహం ఆయనలో వుండేది. పత్రికా ప్రకటనలలో గూడ ఆయన ఎక్కువగా తెలుగు వార్తలకే ప్రాముఖ్యం ఇచ్చేవారు. తెలుగు ప్రజల దైనందిన జీవితము ప్రతిఫలించడానికి పత్రిక దర్పణం కావాలని ఆరాటపడేవారు. నాగేశ్వరరావు పత్రిక నెలకొల్పడంతోబాటు పత్రికా పఠనం గూడ ప్రజలకు అలవాటు చేయవలసి వచ్చింది. ఈ నిమిత్తం ఆంధ్రదేశములోని ప్రతి గ్రంథాలయానికి, ప్రతి పఠన మందిరానికి రెండు దశాబ్దాలపాటు ఆయన ఉచితంగా పత్రికను పంపవలసి వచ్చింది. పత్రికలకు వ్యాసాలు వ్రాసేవారికి పారితోషికం ఇచ్చే ఆచారాన్ని మొదలుపెట్టింది వారే. ఇందువల్ల తెలుగు పత్రికా రచన దేశ సేవ మాత్రమేగాక గౌరవనీయమైన వృత్తిగా పరిణమల్లింది.

ఆంధ్ర పత్రిక కేవలం వార్తా పత్రిక కాదు. జాతీయ సంస్థ. ఆంధ్ర ప్రజావాహినికి ప్రతిబింబము. ఆంధ్ర జాతికి గౌరవము కూరుస్తున్న ఉత్తమ పత్రిక. అది ఎంతటి ఉద్రేక పరిస్థితులలోనైనా తొణకదు. ఉద్రేక పరచదు. ఆలోచనా పూర్వకమైన భావాలు ప్రేరేపించి విజ్ఞానాత్మకము, సాత్వికము, సుస్థిరమైన విధానము అవలంబిస్తుంది. క్రమమైన పరిణామము కలిగి స్థిరమైన నీతిగల పత్రిక. అది ఆంధ్రుల నిత్యజీవితంతో పెనవేసుకుపోయింది. ఈ మాటలు ఒకరన్నవి గావు. చాలామంది చాలాసార్లు అన్నవి. జనమంతా ఏకగ్రీవంగా అనే మాటలు. నాగేశ్వరరావు ఆంధ్ర పత్రికను నడిపింది ముప్పది సంవత్సరములే. వారు పరమపదించిన తర్వాత యిప్పటికి మరొక ముప్పది ఏండ్లు దాదాపుగా నడచినవి. అయినా దాని స్థాయి అట్లాగే ఉన్నదంటే దానికి కారణము నాగేశ్వరరావు స్థిరముగా నెలకొల్పిన సత్సంప్రదాయమే. నాగేశ్వరావు పరమ పదించేనాటికి **'ఆంధ్ర పత్రిక'** ఎనిమిది వందల మందికి ఉచితంగా పంపుతూ ఉండేవారట''.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

దేహళి = గడప, ద్వారము; వంగభాష = బెంగాలిభాష; వంగీయులు = బెంగాలి ప్రజలు; ప్రాబల్యము = ఆధిక్యము; ఉద్బుద్ధము = ప్రారంభము, పుట్టుక; అచంచలము = దృఢము; దేవనాగరలిపి = సంస్కృతభాష; బహుమానము; పారితోషికం = పరిణామము = మార్పు.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము :**

రాష్ట్రోద్యమము, స్వాతంత్రేచ్ఛ, సర్వాత్మ, కృతార్థులు.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము**

:

మూఢపద్ధతి, నాలుగు మూలలు, నవరాత్రులు.

**అర్థ సందర్భములు :**

1. భారత జాతీయతకు చివరి వారసులు, చివరి ప్రభువులు.
2. కళ్ళు మూసుకొని ఉండే, "అంధుల మూఢపద్ధతి కాదు"
3. అద్భుతమైన దూరదృష్టికి నిదర్శనము.
4. గ్రామస్థులకు అది ఒక పండుగ.
5. "ఆంధ్ర పత్రిక నుంచి అమృతాంజనందాకా"

**ప్రశ్నలు :**

1. వంగప్రజల ప్రాబల్యము ఎట్టిది?
2. మీ పాఠ్యాంశమును బట్టి మహారాష్ట్రుల వైభవమును వివరించుము.
3. నాగేశ్వరరావు ఆంధ్ర పత్రికకు చేసిన సేవలు వివరించుము.

***విద్యార్థులకు సూచన :***

దినపత్రికలను చదువుటను అలవాటు గావించుకొనుము.



# 5. చిత్ర కళలు

## – శ్రీ పింగళి లక్ష్మీకాంతం

*శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు కృష్ణా జిల్లా, ఆర్తమూరు నందు **1894** సం॥లో జన్మించిరి. కుటుంబమ్మ, వేంకటరత్నంగార్లు వీరి తల్లిదండ్రులు. వీరు విద్వత్కవులు. అవధాన విద్యాధురీణులు పరిశోధనా పాటవానికి వచన రచనకు ప్రఖ్యాతులు. తిరుపతి కవుల శిష్యులు. ఆంధ్ర, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో తెలుగు శాఖాధ్యక్షులుగా నుండి తెలుగు సంస్కృత భాషల అభివృద్ధికి తోడ్పడ్డారు. **గౌతమ వ్యాసములు, సౌందర నందము, ఆత్మలహరి, ఆంధ్ర సాహిత్య చరిత్ర,** మున్నగునవి వీరి రచనలలో పేర్కొనదగినవి.*

*ప్రస్తుత పాఠ్యభాగము 'వీరి **సాహిత్య శిల్ప సమీక్ష'** నుండి గ్రహింపబడినది.*

కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము, విగ్రహశిల్పము, నాట్యము అనెడి ఆనందదాయకములైన అయిదు కళలకు చిత్రకళలు, లలితకళలు, సరసకళలు అని పర్యాయ పదములు కలవు. పదార్థమొకటియేయైనను గుణ నిర్వచన భేదమును బట్టి పర్యాయ పదము లేర్పడును.

చిత్రణము కలవి గనుక ఇవి చిత్రకళలయ్యెను (Arts of delineation) ఈ చిత్రణము కవిత్వమున శబ్దార్థ చిత్రణముగా, సంగీతమున రాగస్వర చిత్రణముగా, చిత్రలేఖనమున వర్ణరూప చిత్రణముగా, విగ్రహశిల్పమున కేవల రూప చిత్రణముగా వ్యక్తమగుచుండును.

క్రియా లాలిత్యము (Graceful execution) కలవి గనుక, ఇవి లలిత కళలనబడెను.

రసానంద జనకములు గనుక సరసకళలయ్యెను (Aesthetic arts).

అసలు కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము విగ్రహశిల్పము అనెడి నాలుగు మాత్రమే ప్రధాన చిత్రకళలనియు, నాట్యము సమాహార కళగనుకను, అస్వతంత్రము గనుకను ఈ వర్గమున చేరదనియు వాదించెడి ఒక మతము గలదు. నాట్యమనగా నాటక ప్రదర్శనము. ఈ ప్రదర్శనమునకు సంగీత కవిత్వములు ప్రధానాశ్రయములు. ఆ కళలమీద ఆధారపడియే నాటకాభినయము జరుగును. అందుచే నాట్యము సమాహార కళయగుటయే గాక, అందలి అభినయాంశము స్వతంత్ర సృష్టి కాకుండా పోయినది.

కవిత్వ, సంగీత, చిత్రలేఖన, విగ్రహ శిల్పములే సర్వ సమ్మతములైన చిత్రకళలు. ఈ నాలుగింటిలో సంగీత కవిత్వములు చరకళలనియు, చిత్రలేఖన విగ్రహ శిల్పములు స్థిరకళలనియు రెండు విభాగములగును. ఈ విభాగములనే శ్రవ్యదృశ్య కళలని కూడ పేర్కొందురు. శ్రవ్య కళలు విని ఆనందింపదగినవనియు దీని అర్థము. అదియును గాక, శ్రవ్యకళలైన సంగీత కవిత్వములందు వర్ణవస్తువు చిత్ర విచిత్ర గతులతో చలించి పోవుచుండును. అందుచే అవి చరకళలాయెను. దృశ్యకళలైన చిత్రలేఖన విగ్రహ శిల్పములలో రెండు వర్గములతో ఒకదాని యందు ఒక విధముగా, ఇంకొకదాని యందు ఇంకొక విధముగా గుణాధిక్యమున్నను, వస్తు తత్త్వమును బట్టి, శ్రవ్యములు దృశ్యములకంటె మేల్తరముగా అంగీకరింపబడినవి.

'కళలన్నియు సౌందర్యద్యోతకములే కాని, ఏ కళయందు ఆ సౌందర్యము చలించునో అది గుణాతిశాయి' అని చెప్పనొప్పును. చలనము సౌందర్యమునకు మోహనత్వమాపాదించును. నిశ్చల జలపూర్ణమైన ఒక సరస్సు విచ్చిన తామరపూలతో నిండి, చూచుటకెంతో సుందరముగా నుండును. తలవని తలంపుగా ఒక సన్నని మందవాయువీచి ఈ సరస్సులో చిన్ని చిన్ని తరగలు పుట్టింపగా, ఆ నీటి కదలికతో తామరలు కూడా ఊగుచుండగా ఆ సరోవర సౌందర్యమంతయు చలితమై అంతకు ముందు లేని మోహనత్వమును తాల్చును. అట్లే సహజ సౌందర్యరాశియైన ఒక నర్తకి అభినయార్థము వేషధారణము చేసి రంగమునకవతరించి మనయెదుట నిలిచినపుడు ఆ పాత్ర సౌందర్యము కనువిందొనర్చును. అంతలో సూత్రధారుడు ప్రార్థనారూపమైన ఏదో గీతినందుకొని తాళయుక్తముగా చరణము నందించుటతోడనే ఆ నర్తకి అంతకు పూర్వము నిశ్చలముగ నున్న తన హస్తములను పాదములను కదలించి విన్యాసములు చూప మొదలిడును. అప్పుడామె సౌందర్యము చలితము కాగా చూపరులు మొదట అనుభవించిన రూపసందర్శనానందమునకు

ద్విగుణీకృతమైన ఆనందముననుభవింతురు. ఈ అతిశయానందమునకు కారణము ఆ సౌందర్య చలనము.

ఈ చలనము శ్రవ్యకళలలోనేగాని దృశ్యకళలలో ఉండదు. అవి స్థిరములు గనుక, సౌందర్యము చలింపదు. చిత్రకారుడు గాని, శిల్పిగాని తాము చిత్రింపదలచిన మూర్తి యొక్క ఏకసమయ - ఏకావస్థ ఏక భంగిమను మాత్రమే చిత్రింపగలుగుదురు. సమయాంతర, అవస్థాంతర భంగిమాంతర వివర్తనములను ప్రదర్శింపజాలరు.

ఇక చర కళలలో సంగీతమునందు ఆ చలనము ప్రవాహగతిగా సాగదు. గానమునకు ద్రవ్యము నాదము. మంచి గాత్ర సంపదగల నాయకుని నోట అది వెలువడినప్పుడు తాల్చెడి మాధుర్య గుణమే అందలి సౌందర్యము. ఆ నాదము రాగాలాపన, స్వర, ప్రస్తర, విలంబ, ద్రుత, తాళగతులతో వెల్లివిరియుట దాని చలనము. ఈ చలనమే ఆ నాద మాధుర్యమునకు మోహనత్వమును కలిగించును.

కవిత్వము నందును ఇంత ప్రస్ఫుటమైన చలనము కలదు. కథాత్మకమైన కావ్యమగుచో ఆ కథాగమనమే గాక అందలి పాత్రల శారీరకమైన అవయవ విక్షేప వర్ణనలును, మానసికములైన భావవివర్తన వర్ణనలును ఈ చలన కార్యమునకు చెందినవే. కావ్యము కథాత్మకము కాకున్నను, స్థిరమైన ఒక వర్ణ్య వస్తువును గూర్చి కవిత్వము చెప్పునప్పుడు కూడ కవి ఆ వస్తువును నానావిధముల వర్ణించుట చలిత రూపమును చిత్రించుటయే. మేఘసందేశములోని మేఘవర్ణనము ఈ చలన లక్షణము కలదే.

మరియు 'ఏ కళా నిర్మాణమునందు భౌతిక ద్రవ్యాపేక్ష అత్యల్పముగా నుండునో అది తదితర కళలకంటే గుణాధిక్యము కలది' అని చెప్పదగిన ఇంకొక ప్రమాణమున్నది. ఈ రెండు వర్గములతో స్థిరకళలకున్నంత భౌతిక ద్రవ్యాపేక్ష చర కళలకు లేదు. స్థిరకళలలో విగ్రహ శిల్పమునకు ఈ యపేక్ష ఎక్కువ. చిత్రలేఖనమునకు అంతకంటె తక్కువ విగ్రహ నిర్మాణమునకై ఆ శిల్పిగ్రహించెడి పదార్థము అనగా శిల - అతి స్థూలమైనది. చిత్రలేఖకుడు తన రచనకు స్వీకరించెడి పటము అంత స్థూలము కాదు. శిల త్రిదిశాత్మకమైన పదార్థము. దానితో నిర్మింపబడెడి విగ్రహము కూడ త్రిదిశాత్మకమే. చిత్రకారుడు తన రచన కపేక్షించు భౌతిక పదార్థము (కాగితమో, వస్త్రమో) ద్విదిశాత్మకము. శిలతోను, శిలా విగ్రహముతోనుపొడవు, వెడల్పు, మందము అను మూడు దిశలుండగా చిత్రలేఖనమున కుపయోగించు పదార్థములలోగాని, చిత్రములోగాని పొడవు, వెడల్పు

మాత్రమే ఉండును గాని మందము లేదు. కాగితమునకు కూడ ఏదో కొంత మందము కలదనుకొన్నను, అది అతి సూక్ష్మమైన మందము; పరిగణింపదగినది కాదు. అదియును గాక శిలమీద మలచబడిన విగ్రహమునకు మూడు దిశలుండగా, కాగితము మీద వ్రాయబడిన చిత్రమునకు రెండు దిశలేగాని మూడవది లేదు. కాగితమునకు ఉండవచ్చునని ఒప్పుకొన్న అతి సూక్ష్మమైన మందము దానిమీద నిర్మితమైన చిత్రమునకు లేనే లేదు.

శ్రవ్యకళలలో, ఈ భౌతిక పదార్థాపేక్ష ఈషణ్మాత్రము సంగీతమున కలదుగాని, కవిత్వమున అదియును లేదు. సంగీతము, మానవుడు గాత్రముతో పాడదగినది. మానవ శరీరము భౌతికమే గనుక సంగీతమునకు తదపేక్ష అపరిహార్యము కాబట్టి, స్థిరకళల యంతగా కాకున్నను, సంగీతము కూడ భౌతిక పదార్థ సాహాయ్యమును ఆపేక్షించుట కళయే. ఇట్టి అపేక్ష కవిత్వమునకు ఆమాత్రమేనియులేదు. కవిత్వము వ్రాయుటకు కవి చేతబట్టెడి కలము కాగితము భౌతికములేయైనను చిత్రకారుని కుంచెవలె రచనకు ఉపకరణములే గాని సాధన ద్రవ్యములు కావు. కవిత్వ సృష్టి యంతయు భావనా ద్రవ్యముతో మనోగోళమున జరుగును. కవి తన పద్యమును ముందు మనస్సుననె రచించును. అతనికి తజ్జన్యమైన తృప్తి అంతతోనే తీరును. లోకము కొరకును, తన యశము కొరకును దానిని కాగితము మీద వ్రాయునే కాని ఆ వ్రాయుట మాత్రము కవిత్వ రచన కాదు.

కావున ఈ నాల్గింటిలో భౌతిక పదార్థాపేక్ష ఏమాత్రమును లేని కళ కవిత్వము మాత్రమే.

ఒక చర్మచక్షువునకు గోచరించు ప్రత్యక్ష రూప చిత్రణములో స్థిరకళలకున్న సామర్థ్యము చరకళలకు లేదు. విగ్రహ శిల్పమున నిర్మింపబడిన మానవమూర్తిగాని, మానవేతర మూర్తిగానీ ప్రత్యక్ష జగత్తున ఎంత అవయవ పరిమాణము కలిగియుండునో అంత పరిమాణముతోనే సాక్షాత్కరింపబడజేయవచ్చును. చిత్రలేఖనమున అట్టి అవయవ పరిమాణ సాక్షాత్కారము లేకున్నను, వాస్తవికమనిపించు మూర్తి నిర్మాణము కలదు. ఆ మూర్తి మన వంక చూచుచున్నట్లు, మనతో మాట్లాడబోవుచున్నట్లు స్పందింపజేయు శక్తి ఈ కళకు విగ్రహ శిల్పముకంటే ఎక్కువ కలదు. అంతేకాదు. చిత్రలేఖనమున నానావర్ణ శోభితములైన ప్రకృతి దృశ్యముల నెన్నింటినో చిత్రింపవచ్చును. శిలమీద అట్టి ప్రయత్నమే కొనసాగదు.

చరకళయైన సంగీతమున రూప చిత్రణము లేనే లేదు. మారీచుని సంహరించునప్పటియు, శివధనుర్భంగము చేయునప్పటియు రాముని కౌమార సుందర మూర్తిని చూసి విశ్వామిత్రుడెంతో యానందించినట్లుగా -

అలకల ల్లాడగ గని ఆరాణ్ముని ఎటుపొంగెనో ॥అ॥
చెలువు మీరగను మారీచుని మదమణచేవేళ ॥అ॥
ముని కను సైగ దెలిసి శివ ధనువును విరిచే సమయ
మున త్యాగరాజవిను - తుని మోమున రంజిల్లు ॥అ॥

అని త్యాగరాజు పాడెను. ఈ పాట పాడునపుడు, మనకు స్ఫురించు బాల రాముని ముద్దు మోము, కవిత్వ సృష్టియేగాని, సంగీత సృష్టి కాదు.

అసలు శుద్ధగానమునకు శబ్దసాహచర్యముండదు. సాహిత్యము నపేక్షించు నపుడే సంగీతము మిశ్రకళయగుచున్నది. అపేక్షింపబడినపుడు అది శుద్ధగానమే. దీనినే (Pure music and Applied music) అని అందురు. కవిత్వమున గూడ ఇట్టి భేదము కలదు. కేవల భావవర్ణనగల కవిత్వము ఏదేని వర్ణ్యవస్తువునుగాని కథను స్వీకరించిన కవిత్వము మిశ్ర కవిత్వము.

కవిత్వములో మూర్తిదర్శనము చర్మచక్షువునకు గాక మనోనయనమునకు కలుగుచుండును. మనోగోచరమైన ఆ మూర్తి వాస్తవికము కాదు. దానిని భావించి చూచుటకు భావుకులు మాత్రమే అర్హులుగాని తదితరులు సమర్థులు కారు. భావనా గోచరములైన ఆ మూర్తులు చిత్రలేఖనము నందువలె ఊరకమనకు దర్శనమిచ్చుట మాత్రమే గాక, సల్లాప సుఖమును గూడ కలుగజేయుచుండును. ఒక్కొక్క యెడ ఆ మూర్తులను ఏ చిత్రకారుడు కూడ చిత్రింపలేడు. మను చరిత్రలో వరూధిని మూర్తిని ఏ చిత్రకారుడు చిత్రింపగలడు? "ఎక్కడివాడో? యక్షతనయేందు వసంత జయంత కంతులం జక్కదనంబునం గెలువజాలినవాడు'' అని అబ్బురపాటుతో తనలో తాననుకొన్న వరూధిని మాటలు మనకు ఏ చిత్ర పటమున వినబడును? చిత్రపటమూర్తి మనతో మాటలాడుటకు ప్రయత్నించినట్లే యుండునుగాని ఆ మాటలు పలుకుటగాని, వాటిని మనము వినుటగాని తటస్థింపదు.

కవిత్వము ఏదో ఒక మూర్తిని చిత్రించుట మాత్రమే కాదు. అనేక ప్రాణి ప్రవర్తితమైన ఒక కథను వస్తువుగా గైకొని తత్తద్గుణశీలాను సార వర్తనలతో జగత్సృష్టికి ప్రతి సృష్టి చేయగలదు. ఈ సామర్థ్యము తక్కిన ఏకళకును లేదు.

దృశ్యమానమైన ప్రపంచమంతయు నామరూపాత్మకము వీటిలో కవిత్వ సంగీతములు నామ చిత్రణమునకును చిత్రలేఖన శిల్పములు రూప చిత్రణమునకును పూనుకొనును. ఈ కళలకన్నిటికిని భావనాత్మకమైన ఆనంద సిద్ధియే పరమావధి. ఆనందావస్థలో బాహ్యజగత్తును విస్మరించి అనిర్వచనీయమైన పరవశత్వమును పొందుదుము.

కవిత్వము వలన గూడ ఇట్టి ఆనందమే కలుగును గాని తదనుభవమునకు సహృదయునిలో కొంత భావనాబలమును బుద్ధి ప్రౌఢియు కొంత వైదుష్యమును ఆవశ్యకములగును. వీటి సహృదయమున జనించెడి ఆయానందము సంగీతమునందు వలె ఆపాత మధురము కాకుండుటయే గాక, దానివలె క్షణ భంగరము కాదు. కవిత్వమును ఆనందించుటకు సంస్కార పూర్వకమైన ఒక అధికార విశేషము కావలెను.

కవితా రచన ఒక అలౌకిక జగత్తును సృష్టించి మన యాత్మలను ఆ జగత్తునందు సంచరింపజేయును. ఈ సంచారము కావ్యము చదువుచున్నంతసేపు మాత్రమే కాక, పఠనానంతరము కూడ కొనసాగుచునే యుండును. కావ్యపఠనమువలన ఎట్టి ఆనందము కలుగునో తదర్థ మననము వలనను అట్టి ఆనందమే కలుగును. స్థిరకళలలో సంగీత సాహిత్యములందు వలె హృదయ గ్రంథి విచ్ఛేదకమయిన మాధుర్యగుణమున్నదని నిశ్చయముగా చెప్పలేము.

అందుచేత సమూహము మీద చిత్ర కళలన్నియు ఆనందదాయకములే యైనను జీవన్ముక్తులను భవించు ఆనందము కవిత్వ సంగీతముల వలననే కలుగును గాని చిత్రలేఖన శిల్పములవలన కలుగదు. ఈ చిత్రకళలన్నింటికిని ఇంకొక సమానధర్మము అవి శ్రుతిలయబద్ధములగుట. అసలు ఈ విశ్వము యొక్క సృష్టియు ప్రవర్తనమును శ్రుతి బద్ధములయియే జరుగుచుండుట యోగనిష్ఠతో గోచరించుచుండునట, ప్రాకృతులమైన మనకు అవ్యవస్థయు నియతియు గోచరింపవు.

ఈ శ్రుతిలయలు సంగీతమున ఎల్లరకును ప్రస్ఫుటముగా విదితమగుచునే యుండును. శ్రుతి పక్వమైన గాత్రముతో లయబద్ధమైన పాటపాడుటయే యథార్థమైన సంగీతము. శ్రుతి చెడిన కంఠముతో లయ తప్పిన పాట పాడుట సంగీత కళయే కాదు. ఈ శ్రుతిలయలు కవిత్వమున ఛందోరూపమునను, వాక్యగత శబ్ద విన్యాస రూపమును వ్యక్తమగుచుండును. సంగీతము నందలి శ్రుతిలయలవలె ప్రస్ఫుటము కాలేకపోవుటచేత, కవిత్వము నందలి శ్రుతిలయలు సూక్ష్మ శ్రవణేంద్రియ సాధన

చేసిన వారికి గాని వినబడవు. కవిత్వము నానందించుటకు కావలసిన అర్హతలలో ఈ సాధన ప్రథమ గణ్యము. స్థిరకళలలో ఈ శ్రుతిలయలు ఊహించతగ్గవేకాని వినదగినవి కావు.

మరొక్క విషయము స్థిరకళలు చిత్రించు మూర్తులు కన్నులేని వానికి కొర గావు. చరకళలలో ఒకటైన సంగీతము చెవి లేని వానికి కొర గాదు. చరకళలలో మరొకటియైన కవిత్వము కన్ను చెవియు రెండు లేనివానికి మాత్రమే కొర గాదు. కన్ను లేనివాడు కవిత్వమును చదివించుకొని ఆనందింపవచ్చును. చెవి లేనివాడు చూచి చదువుకొని ఆనందింపవచ్చును. కాని అది దృశ్యకళ మాత్రము కాదు. ప్రపంచమున లిపి పుట్టని ఆదికాలములో ఈ కళ చెవులతో ఆలకింపబడినదే కాని, కన్నులతో చూడబడినది కాదు.

పూర్వోదాహృతములైన కారణములచే చిత్రకళలో కవిత్వము ఉత్తమోత్తమమనెడి సిద్ధాంతము సర్వజనాంగీకృతమైనది. ఈ తారతమ్యము ఆయా కళలు స్వీకరించెడి తత్తద్వాహక ద్రవ్య స్వభావమును బట్టి కలుగునదే కాని ఆయా కళా నిర్మాతల సామర్థ్యన్యూనాధికతలను బట్టి కలుగునది కాదు. వారందరును భావుకులే. సమాన చిత్తయోగము కలవారే. ఆ నాలుగు కళలును సోదరములైనట్లే ఆ నలుగురు శిల్పులును సోదరులే.అయినను ఈ నాలుగింటిలో కావ్య కళయే గుణగరిష్ఠమైన ఉత్తమ పురుషార్థ సిద్ధి. "Poetry is the most vital and the lasting achievement of man", Lane cooper"

## అధ్యయన వేదిక

**అర్థములు :**

బాహ్యజగత్తు = బయటి ప్రపంచము; పరవశత్వము = సంతోషము, ఆనందము; సర్వజనాంగీకృతమైనది = అందరిచే ఆమోదింపబడినది; ద్విగుణీకృతమైన = రెట్టింపైన; వివర్తనము = చుట్టివచ్చుట, తిరిగి వచ్చుట; ప్రస్ఫుటమైన = స్పష్టమైన; ఈషణ్మాత్రము = కొద్దిమాత్రము; ఉపకరణములు = సాధనములు; వైదుష్యము = పాండిత్యము; నిర్వచనము = అర్థ వివరణము చేసి చెప్పుట.

**సంధులు :**

**ఈ క్రింది వానిని విడదీసి, సంధిపేర్లను, సూత్రములను వ్రాయుము.**

రసానంద జనకములు; ప్రధానాశ్రయములు; రూపాత్మకము.

**సమాసములు :**

**ఈ క్రింది పదములకు విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

కవిత్వ సృష్టి ; శివధనువు; నాలుగుకళలు; కావ్యకళ; అవయవ విక్షేపములు; సౌందర్యద్యోతకములు; త్రిదిశాత్మకము; ద్విదిశాత్మకము; మానవశరీరము.

**అర్థ సందర్భములు :**

1. "వస్తు తత్వమును బట్టి, శ్రవ్యములు, దృశ్యములకంటె మేల్తరముగా అంగీకరింపబడినవి"
2. "కళలన్నియు సౌందర్యద్యోతకములే"
3. "స్థిరకళలకున్నంత భౌతిక ద్రవ్యాపేక్ష చరకళలకు లేదు"
4. "కవిత్వ సృష్టి యంతయు భావనాద్రవ్యముతో మనోగళమున జరుగును"
5. "కావ్య కళయే గుణగరిష్ఠమైన ఉత్తమ పురుషార్థ సిద్ధి"

**ప్రశ్నలు :**

1. చిత్రకళలెన్ని రకములు? వివరణాత్మకముగా తెలియజేయుము?
2. "నాట్యము సమాహారకళ' ఎట్లు?
3. దృశ్య, శ్రవ్య కళలను గూర్చి వివరింపుము.
4. "కళలన్నియు సౌందర్యద్యోతకములే" వివరింపుము.
5. "ఏకళా నిర్మాణము నందు భౌతిక ద్రవ్యాపేక్ష అత్యల్పముగా నుండునో అది యితర కళలకంటే గుణాధిక్యము" వివరింపుము.
6. చిత్రకళలో కవిత్వము ఉత్తమోత్తమము - సమర్థింపుము.

***విద్యార్థులకు సూచన :***

అభిరుచి యున్న చిత్రకళను అభ్యసించుము.

***ఉపాధ్యాయులకు సూచన :***

చిత్రకళలందు అభిరుచి గల విద్యార్థులను ప్రోత్సహింపుము.



# 6. మద్యపాన నిషేధము

## – శ్రీ మారేమళ్ళ నాగేశ్వరరావు

*శ్రీ మారేమళ్ళ నాగేశ్వరరావు సద్విమర్శకులు. గొప్ప వ్యక్తి గూడ. మారేమళ్ళగారు పట్టభద్రులు. గుంటూరు ఆంధ్రక్రైస్తవ కళాశాలలో తెలుగు విభాగం అధిపతులుగా పనిచేసిరి.*

*ప్రస్తుతము మద్యపాన నిషేధము అను పాఠ్యభాగము* ***"విజ్ఞాన సుధ"*** *అను "వైజ్ఞానిక వ్యాస బృహత్సంపుటి" నుండి గ్రహింపబడినది.*

మత్తును కలుగజేసి పశుతుల్యులుగా నొనర్చు మద్యములకు అలవాటు పడుట నాగరిక లక్షణముగా చెలామణి యగుట చాల వింత విషయము. ముఖ్యముగా ఉన్నత సమాజములకు చెందిన మహానుభావులే మద్యపాన మొనర్చుట మర్యాదకు గీటురాయిగా భావించుట మరింత వింత విషయము. కాని ఆలోచనా పరులగు మహాత్ములనేకులు అనేక కాలములలో నీ మద్యపానము నీచాచారముగా గర్హించుట మనమెరిగిన విషయమే. పంచమహాపాతకములందిది యొకటని శుక్రాచార్యుడు దీనిని శపించెను. బాల్బన్, అల్లావుద్దీన్, చంద్రగుప్తుడు, సముద్ర గుప్తుడు, శ్రీకృష్ణదేవరాయలు, ఔరంగజేబు మొదలగు చక్రవర్తులు తీవ్రముగా నిరసించుట చరిత్ర వలన మనము తెలిసికొనవచ్చును. ప్రసిద్ధములైన మతములు సహితము మద్యపానమొనర్చుట పాపకార్యముగ పరిగణించుట గమనింపదగిన అంశము. ఈ విధముగా క్షుద్రాచారముగా పరిగణింపబడిన మద్యపానము వలన శారీరక మానసికారోగ్యములు విధ్వస్తములగును. మద్యమునకు అలవాటు పడిన వారెంత దృఢగాత్రులయినప్పటికిని తుదకు శిథిలమై అల్పాయుష్కులగుచుండుట మనమను దినమును గమనించునట్టి సత్యమే. దేశమును కొల్లగొట్ట మరిగిన ఆంగ్లేయుల పాలనా కాలములో మద్యపానము మిక్కిలి ప్రోత్సహింపబడినది. అందువలన కోట్లకొలది

రూప్యములు ప్రతి సంవత్సరము వారి దేశము చేరుచుండెడివి. పలు రకముల మద్యములు వారి దేశము నుండి మన దేశమునకు దిగుమతి యగు చుండెడివి.

మద్యపానము వలన కలుగు దారుణ దుష్ఫలితములు పరకోటి నందుకొనుటచే దీనిని సంపూర్ణముగ నిషేధించుటకు మన జాతీయ నాయకులు అనేక ప్రయత్నములు చేసినారు. ఒకప్పుడు చట్టమున కనుగుణముగా అమెరికా వంటి దేశమునందే యిది నిషేధింపబడినదనిన మత, నైతిక సంస్కారమహితమగు భారతదేశమున దీనిని నిషేధించుట అసాధ్యమగునా? జాతిపిత బాపూజి ఆధ్వర్యమున జాతీయ మహాసభ పారతంత్ర్య కాలములో దీనిని నిషేధింపజేయ ననేక విధముల కృషిసల్పినది. 1920 మరియు 1930వ సంవత్సరములలో కల్లు, సారాయి దుకాణములను కట్టివేయ వలసినదిగా జాతీయ మహాసభ (Indian National Congress) ఆధ్వర్యమున స్వచ్ఛంద సేవకులు దేశమునందన్ని ప్రాంతములందును ప్రచారమొనర్చినారు. అప్పటి శ్వేత ప్రభుత్వమును ప్రతిఘటించి, వీరు మద్యములమ్ము దుకాణములోనికిఁబోయి త్రాగువారిని, అమ్మువారిని కాళ్ళు గడ్డములు పట్టుకొని మద్యమును నిషేధింపుడని వేడుకొని, దారుణమైన పోలీసుల లాఠీదెబ్బలకు గురియైనారు. తాము చేయు ప్రచారమునకు ప్రభుత్వమెన్ని ఆటంకములను, కష్టనష్టములను కల్గించుచున్నను, లెక్కచేయక అనేక సాంస్కృతిక వైజ్ఞానిక ప్రదర్శనల ద్వారా మద్యపానము వలన కలుగు దుష్ఫలితములను హృదయము కరుగునట్లుగా ప్రచారమొనర్చిరి. సంస్కారవంతులగు కళాప్రియులు "గృహలక్ష్మి" మున్నగు చలనచిత్రముల ద్వారా మద్యపానము వలన కలుగు లోపములను ప్రజలకుఁ దెలియబరచినారు.

ఎన్నికల సమయమున తామొనర్చిన శపథము ననుసరించి 1937లో తమ మంత్రివర్గమేర్పడినప్పుడు జాతీయ మహాసభవారు దేశములో కొన్ని రాష్ట్రములందు మద్యపాన నిషేధమును అమలు పరిచినారు. ఉత్తరప్రదేశమునందు కొన్ని మండలములందును, మద్రాసు రాష్ట్రమున బళ్ళారి, సేలం మున్నగు జిల్లాలందును మద్యపాన నిషేధమును కాంగ్రెసు మంత్రివర్గము అమలు పరిచినది. కాని, యింతలో కాంగ్రెసు మంత్రివర్గము రాజీనామా చేసి నాయకులు కారాగార వాసులగుటచేత నీ ప్రయత్నము విఫలమైనది. మరల శ్వేత ప్రభుత్వము మద్యపానమును అమలులోఁ బెట్టినది. కాలమొక్కరీతి గడువదుకదా!

1947వ సంవత్సరము ఆగష్టు 15వ రోజున పవిత్ర భారతదేశమున స్వాతంత్ర్య భానుడుదయించినాడు. జాతీయ ప్రభుత్వము ఉద్భవించుటతో మద్యపాన నిషేధము

తక్షణము అమలులోనికి వచ్చినది. మునుపు మద్రాసు, బొంబాయి, మైసూరు, ఆంధ్రప్రదేశము, కేరళ, తూర్పు పంజాబు, ఉత్తరప్రదేశము మున్నగు రాష్ట్రములందిది అమలులో నున్నది. ప్రస్తుతము ఆంధ్రదేశము మొదలగు రాష్ట్రములందు నిషేధము లేదు. ఇటీవలి వరకు తమిళనాడు నందు నిషేధము అమలులో లేదు. మద్యపానము ఆవశ్యకమని పరిగణింపబడిన సైన్యమునందును నేడీ నిషేధము ప్రోత్సహింపబడుట ముదావహము. సాధ్యమైనంత వరకు ప్రభుత్వ విందులందును, వినోదములందును మద్య వినియోగమును తగ్గించుచున్నారు.

మద్య నిషేధము వలన ప్రభుత్వమునకు పన్నుల రాబడి పలుచబడి ఆర్థిక సంక్షోభమేర్పడుటయే గాక తరతరాలుగ వచ్చుచున్న యీ దురాచారము ప్రజలలో చైతన్యము కలుగనిదే, ప్రభుత్వము అమలునందుంచిన చట్టము ఫలవంతము కానేరదు. అందువలన ప్రజలయొక్క సానుభూతి సహకారములు, అండదండలు లేనిదే యీ పని సమర్థముగా గొనసాగదు. ప్రజలలో మద్యపాన నిషేధమునకు అనుకూలమైన వాతావరణము గల్పించవలసిన అవసరము ఎంతేనియు నున్నది. పూర్వము వలెనే నేడును సాంస్కృతిక వైజ్ఞానిక ప్రదర్శనముల నేర్పాటు చేయుట, కరపత్రములు మీదను, గోడల కంటించు కాగితముల మీదను మద్యపానము వలన కలుగు కష్ట నష్టములు గూర్చి వ్రాసి, హెచ్చరికలు చేయుట, ఉపన్యాసములు, చర్చావేదికలను ఏర్పరచి దీనిని గురించి ప్రబోధించుట మున్నగు వాని ద్వారా మద్యపాన నిషేధమునకు అనుకూలముగా ప్రజాసహకారమును పొందవచ్చును. రేడియోలు, ప్రచార చలనచిత్రములు మరియు సాహిత్య ప్రక్రియల వలనను నిది సుసాధ్యము కాగలదు.

మద్యపాన నిషేధమునకు వ్యతిరేకులు కొందరు తమ వ్యక్తి స్వాతంత్ర్యము అరికట్టబడుచున్నదని పెద్ద అభిప్రాయమును రేకెత్తించుచున్నారు. వ్యక్తి స్వాతంత్ర్య మనునది పవిత్రమైన మరియు అమూల్యమైన హక్కు. కాదనలేము. కాని, దానిని సంక్షేమముగా నిర్వచింపలేము. వ్యక్తి స్వాతంత్ర్యమునకు సంఘస్వేచ్ఛకు నడుమ గీతగీయుట చాల కష్టమైన పని. అందువలన ప్రభుత్వము మద్యపానాసక్తులగు ఏ కొద్దిమందికొరకో, అత్యధిక సంఖ్యాకులకు హితమగు అత్యధిక సత్కార్యమును మానుకొనరాదు. ఏకొద్దిమందియో మద్యమును అపకారముగాని పరిమితిలో తీసుకొను స్వయం శిక్షితులగు వారున్నప్పటికిని, సాధారణముగా మద్యపానము హీన దురాచారము అనక తప్పదు. అందువలన ప్రభుత్వము ఆరోగ్య వైద్యాదికములగు

ప్రత్యేక సందర్భములందు తప్ప, అన్యధా మద్యపాన నిషేధమును అమలులోఁ బెట్టుట న్యాయమే.

మద్యపాన నిషేధము వలన కలుగు ఆదాయ నష్టముల నుండి తేరుకొనుటకు అన్ని రాష్ట్రములకు కేంద్ర ప్రభుత్వ సహాయము ఆవశ్యకము. దేశమందలి ఆర్థిక పరిస్థితులు మున్నుగునవి చక్కబడి సదవకాశము లభించి, దేశమంతట మద్యపాన నిషేధము అమలు జరుపబడు శుభదినము కొరకు మనము ఎదురు చూచెదము.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

పాతకము = పాపము, దారుణము = క్రూరము, ఆటంకము = అడ్డంకులు, చైతన్యము = మార్పు, నిష్ఫలము = వ్యర్థము, దుకాణము = అంగడి, కారాగారము = జైలు.

**సంధులు :**

**ఈ క్రింది వానిని విడదీసి సంధిపేర్లను, సూత్రములను వ్రాయుము.**

క్షుద్రాచారము, అల్పాయుష్కులు, అత్యధికులు.

**సమాసములు :**

**ఈ క్రింది వానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

మహాపాతకము, పాపకార్యము. అల్పాయుష్కులు, కష్టనష్టములు, తీవ్ర రూపము, శుభదినము, క్షుద్రాచారము.

**అర్థసందర్భములు :**

1. పంచమహాపాతకములందిది యొకటి.
2. కాలమొక్కరీతి గడువదు కదా.

**ప్రశ్నలు :**

1. మద్యపానము గురించి మనపూర్వులు ఏమని చెప్పిరి?
2. గాంధీజి మద్యపాన నిషేధమునకు చేసిన ప్రయత్నములు -ఎట్టివి?
3. "ప్రజల సహాయ సహకారములు లేనిది మద్యపాన నిషేధము అసాధ్యము" వివరించుము.
4. మద్యపానము - దుష్ఫలితములను వివరించుము.

**విద్యార్థులకు సూచన :**

మద్యపాన నిషేధమును గూర్చి ప్రజలకు తెలియజేయుము.



# 7. శ్రీ నేదునూరి గంగాధరం గారు

## (వారి జనపద వాఙ్మయ సేవ)

**— యస్వీ. జోగారావు**

*యస్వీ.జోగారావుగారి పూర్తిపేరు **శిష్టా వెంకట జోగారావు.** వీరు **2-10-1928** తేదీన **సరస్వతీ సాంబశివరాయ కవులకు** జన్మించిరి. వీరు **1952**లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో తెలుగు ఎమ్.ఎ. ప్రథమశ్రేణిలో సర్వప్రథములుగా ఉత్తీర్ణులయిరి. వీరు పి.హెచ్.డి.పట్టముకై వ్రాసిన **యక్షగాన వాఙ్మయ చరిత్ర** ఉత్తమ పరిశోధన గ్రంథముగా పరిగణింపబడి సువర్ణపతకాన్ని అందుకున్నారు. ఆంధ్ర, అమెరికా విశ్వవిద్యాలయములనుండి డి.లిట్. గౌరవపట్టములనుకూడ పొందిరి.*

***మధుర సరస్వతి, మహాకవి, సాహితీరత్నాకర, పరిశోధక పరమేశ్వర, అభినవ కృష్ణరాయ, తెలుగు తానీషా, శృంగార సర్వజ్ఞ** మున్నగునవి వీరికిగల బిరుదులు.*

*వీరు లెనిన్‌గ్రాడు విశ్వవిద్యాలయములో తెలుగు ప్రొఫెసరుగాను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో, ఇతర విశ్వవిద్యాలయాలలోను, జాతీయ స్థాయికాలైన అనేక సంస్థలలోను పలు ముఖ్య పదవులను అధిష్ఠించిరి. **ప్రథమ కుసుమాయుధము, పంచకళ్యాణి, మధురమాధవము, సారస్వత నీరాజనము, శారదాపీఠము** మున్నగు అనేక గ్రంథాలను రచించిరి. సంపాదకులుగా అనేక గ్రంథాలను పరిష్కరించిరి. ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత సారస్వత, సాంస్కృతిక విషయాలను గురించి ఆంధ్ర, ఆంగ్ల పత్రికలలో, విజ్ఞాన సర్వస్వములలో అనేక వ్యాసాలు రచించిరి.*

*వీరి పర్యవేక్షణలో **25** మందికి పైగా డాక్టరు పట్టభద్రులైరి. రష్యా, యూరపు, అమెరికా, కెనడా మున్నగు దేశాలను పర్యటించారు.*

*ప్రస్తుత పాఠ్యభాగము 'కిన్నెర' పత్రికలో ప్రచురింపబడిన వీరి వ్యాసమునుండి గ్రహింపబడినది.*

వాఙ్మయ సేవలో జీవితమే ఒక ఉద్యమముగా గడిపినవారు మన వారిలో అరుదుగా కనిపిస్తారు. అట్టివారిలో ప్రాతఃస్మరణీయులు గడచిన తరంలో శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు- నేడు శ్రీనేదునూరి గంగాధరంగారు. కందుకూరివారు గ్రంథములు అచ్చు మొగమెరగని రోజులలో ఆధారములు అట్టే కనుపట్టని రోజులలో **'ఆంధ్రకవుల చరిత్ర'** సంతరించారు. గిడుగువారు లిపియైనా ఎరగని సవరభాషకు అనుశాసనమే సంకల్పించారు. వారి వ్యావహారిక భాషోద్యమము సరేసరి. ఆ లెక్కలలోనిదే నేదునూరి వారి జానపద వాఙ్మయ కృషికూడ. ఆ పరిశోధన కుత్తమాధికారులు వారు.

నేదునూరి వారికి "పాతపాటల గంగాధరం'' అని మరో వ్యవహారనామం ఉన్నది. వారికి **"వాస్తువిశారద" "కవికోకిల"** అనే బిరుదు లెన్ని ఉన్నా అవన్నీ ఒక యెత్తు. ఇదొక్కటి ఒక యెత్తు. ఇది వారికి పౌరుషనామం. ఆ మాట అనేసరికి చట్టున వారికృషి అంతా అందులో స్ఫురిస్తుంది. ఆ పాతపాటల పరిశోధన మాటలు కాదు. పాటల పరిశోధన పాట్లేకాని మాటలెందుకవుతుందీ. పండిత వాఙ్మయ పరిశోధనకు శుభ్రంగా పరిష్కరింపబడి విపుల పీఠికలతో అందంగా అచ్చుపడ్డగ్రంథాలు. వాటిని పదిలపరచే గ్రంథాలయాలూ అనేకములున్నవి. ఆ పరిశోధన ప్రక్రియకవసరమైన కోశములు, లక్షణగ్రంథములు, కేటలాగులు, ఇంకా అనేక విధముల దోహదాలు లభింపగలవు. జానపద వాఙ్మయ పరిశోధనకట్టి దోహదములు లేవు. సరికదా ఆ వాఙ్మయ సేకరణయే కడుకష్టము. మదుపులు పెట్టుకొని పల్లెపల్లెలలో మజిలీలు చేసుకుంటూ తాటాకు కట్టలో, తాతల కంఠాలో ఆశ్రయించి, అక్కడొక ముక్క, ఇక్కడొకముక్క ఏరితెచ్చి ఆముక్కలను ముడిపెడితేగాని ఒకపాట తేలదు. అట్లేరి తెచ్చిన పదాలకు పట్టికలు తయారుచేసి ఆ పదాల వరుసలు అర్థము, లక్షణము, ప్రయోగ సంప్రదాయము, స్వకీయమైన సంస్కారముతో విచారించి వానిని ప్రచారమునకు తెచ్చిన గాని వానిని సేకరించిన ప్రయోజనమే లేదు.

సుమారు పాతికేళ్ల క్రితం వారు పిత్రార్జితమైన అరవైమూడు కుంచాల భూమినీ ముప్పైకాసుల బంగారాన్ని కన్యాశుల్కంగా సమర్పించుకొని ఆ పదకవితా మదవతిని తెచ్చుకొన్నారు. గంగాధరంగారి గురించి వారి వాఙ్మయ కృషికి సంబంధించినంత మట్టుకు వారి జీవిత విశేషాలను స్పృశిస్తూ రెండు ముక్కలు చెప్పడం విధాయకం. ఆయన బ్రదుకంతా చిన్న బడిపంతులుగా గడుపుతున్న ధీరులు. ఆయన ఉపాధ్యాయత్వమొక వృత్తిగా కాకుండా పేదపిల్లలకు, వయోజనులకు ఉచిత

విద్యావితరణ వ్రతంగా గడిపారు. ఆయనకు చదువు నేర్పడమనేది ఎంత వ్రతమో నేర్చుకో తగినదల్లా నేర్చుకోడం అంత వ్యసనం. ఆయనకు చిన్నప్పుడే తల్లిదండ్రులు గతించారు.

పొలం ఉన్నంతకాలం పోతన్నలాగ కలంతోపాటు హలంపట్టి కాలక్షేపం చేశారు అది కాస్తా యీ పదాల పులుసులో పడిపోగానే ఉపాధ్యాయ వృత్తిపై మరింత నిష్ఠ కుదిరింది. తాముత్తమోపాధ్యాయుడగుటకు ముందు తన కుత్తమోపాధ్యాయులకును చూచుకొనుట అవసరమని గ్రహించినారు గంగాధరంగారు. అదీకాక తానుపాధ్యాయ వృత్తిలో ఉంటూనే యావజ్జీవము విద్యార్థిగా వ్యవహరించే వ్యక్తి ఆయన. ఆయనకు చిన్నప్పుడు బడి పోటీ పరీక్షలలో బహుమతులిస్తూ వీరేశలింగంగారు దీవించిన దీవనతో భాషాభిమానం పుట్టుకొచ్చిందట. తరువాత శ్రీ జొన్నలగడ్డ బాపిరాజుగారి వద్ద అమరాదికోశములు, ఆంధ్రకావ్యములు, శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారి వద్ద ఛందశ్శాస్త్రము, పద్యరచన, శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి వద్ద కొంత శుశ్రూష, శ్రీ నల్లా చక్రవర్తుల శ్రీరామాచార్యుల వారివద్ద సంగీతము, శ్రీ కందాడై రఘు నాధాచార్యుల వద్ద జ్యోతిషము, శ్రీ ముడుంబై వేంకట కృష్ణమాచార్యుల వారి వద్ద సంస్కృత కావ్యములు, శ్రీ ఐలావజ్ఝల వేంకటశాస్త్రిగారి వద్ద ఆయుర్వేదము, భగవద్గీత చదువు కొనిరి. దీనినిబట్టి గంగాధరంగారి విద్యావ్యాసంగము గౌరవము విశదమౌతుంది.

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి ప్రోత్సాహము కారణముగా 1926 సంవత్సరము నుండి తాళపత్రగ్రంథములకై పర్యటన ప్రారంభించారు గంగాధరంగారు. బడి సెలవు రోజొక్కటి వృథాకాకుండా విధివిరామం లేకుండా, విశేష వ్యయప్రయాసలకు లోనై, తెలుగు నేల నాలుగు చెరగులకు తిరిగి తిరిగి అదొక వ్యసనముగా పల్లెపాటలు మాండలిక పదాలు, స్థానిక గాథలు, సామెతలు, పొడుపు కథలు సైతం మొత్తం అచ్చులో నాలుగు వేల పేజీలయ్యే గ్రంథం సేకరించారు. సేకరించినవానిని శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావుగారి సలహాపై భారతి, గృహలక్ష్మి మొదలైన పత్రికలకు పంపేవారు. శ్రీ చింతా దీక్షితులగారి సలహాపై శీర్షికా విధానం జరిగింది. శ్రీ గిడుగువారు పదముల శైలి పోకడలను బట్టి అవి పుట్టిన దేశ భాగములు నిర్దేశించు సూత్రములు బోధించినారు. శ్రీ మారేమండ రామారావుగారు చరిత్ర, పరిశ్రమలకుపయోగపడే పదాల మోస్తరులను విశదీకరించినారట. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు మాండలిక పదములు, సామెతలు మొదలగు విషయములతో జీవద్భాష నిఘంటువు నిర్మించమని సలహానిచ్చిరి. ఇట్లా ఆయన ఎప్పటికప్పుడు

ఆయా రంగములలో ఆరితేరిన పెద్దల సలహాలు పాటిస్తూ, పరిశ్రమను సక్రమంగా సాగిస్తూ వచ్చారు. ఆయనను ప్రశంసింపని సహృదయుడు లేడు.

పుట్టి ఏబది ఏండ్లయింది. జానపద వాఙ్మయసేవ చేపట్టి పాతికేండ్లు పైబడినది. ఎట్టి దోహదము లేకపోయినను, సంపాదించిన సంస్కార గౌరవ మూరక గాలికి పోకుండా అనేక సంస్థలు స్థాపించారు. గ్రంథములో వందకు పైచిలుకు రచించారు. గంగాధరంగారి సంస్కారములో ఎలా వైవిధ్యమున్నదో వారి గ్రంథ రచనలోను ఆ వైవిధ్యము స్పష్టపడింది. వారి గ్రంథ సంచయములో వాస్తు వ్యవసాయ జ్యోతిస్సాముద్రిక రత్నాది శాస్త్ర గ్రంథములు, తత్వగ్రంథములు, మహాపురుషుల జీవిత చరిత్రములు, స్తోత్రములు, శతకములు, చమత్కార పద్య గ్రంథములు గేయ సంకలనములు మొదలగునవి గలవు. ఇందిప్పటికి ముప్పదిరెండు గ్రంథములు ముద్రితములైనవి.

కాని అన్నిటికన్న ముఖ్యమైన గ్రంథములే అముద్రితములుగా నుండిపోయినవి. అవి 1. జీవద్భాషా నిఘంటువు 2. జానపద గేయములు (3. సంపుటములు) అనే వారి జానపద వాఙ్మయ పరిశోధన ఫలములు. వాని ముద్రణకు ప్రజలో, ప్రభుత్వమో, సంస్థలో ఆదుకొనుట అవసరము. అది గంగాధరంగారికేదో ఉద్ధరింపు అనుకోరాదు. దేశానికి కొంత మేలు చేసినట్లగును.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

స్మరణీయులు = జ్ఞప్తియందుంచుకొనవలసినవారు; సంతరించిరి = రచించిరి; స్ఫురణము = జ్ఞాపకము; వ్యసనము = అలవాటు; హలము = నాగేలు; శుశ్రూష = సేవ; నిఘంటువు = పద పదార్థములను తెలియజేయు గ్రంథము.

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధిపేర్లను సూత్రములను వ్రాయుము.**

వాఙ్మయము, భాషోద్యమము, పిత్రార్జితము, విద్యార్థి, జీవద్భాష.

**సమాసములు :**

**ఈ క్రింది వానికి విగ్రహ వాక్యములు వ్రాసి, సమాసముల పేర్లను వ్రాయుము.**

వాఙ్మయసేవ, పరిశోధనప్రక్రియ, తల్లిదండ్రులు,

**అర్థ సందర్భములు :**

1. "చదువు నేర్పడమనేది ఎంత వ్రతమో నేర్చుకోతగినదల్లా నేర్చుకోడం అంతవ్యసనం"
2. "పోతన్నలాగ కలంతో పాటు హలంపట్టి కాలక్షేపం చేసారు"
3. దేశానికి కొంత మేలు చేసినట్లగును.

**ప్రశ్నలు :**

1. శ్రీ నేదునూరి వారి జీవనము గూర్చి వివరింపుము.
2. గంగాధరంగారి జానపద వాఙ్మయసేవకు ఎవరు, ఎట్లు ప్రోత్సహించిరి?

***విద్యార్థులకు సూచన :***

జానపద సాహిత్యమును సేకరించుటకు ప్రయత్నముగావింపుము జానపదపాటలలో ఉపయోగపడునవి నేర్చుకొనుము.

***ఉపాధ్యాయులకు సూచన :***

జానపద సాహిత్యము, వారి పనీ-పాటలను విహార యాత్రల మూలముగా విద్యార్థులకు తెలియబరచుట యుక్తము.



# 8. వేదం వేంకటరాయశాస్త్రి

**– సురవరం ప్రతాపరెడ్డి**

*సురవరం ప్రతాపరెడ్డిగారు 1896వ సంవత్సరము మే మాసము 26న జన్మించిరి. వీరి స్వస్థలం మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపూరు ప్రాంతము. నిజాం నిరంకుశ పరిపాలనను తీవ్రముగా నిరసించిరి. తెలుగు ప్రజలను చైతన్యవంతులు చేసేందుకు, తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి ఎనలేని కృషి సల్పిరి. దానికొఱకు 'గోల్కొండ' పత్రికను ఒక ఆయుధంలా యుపయోగించిరి. ప్రతి గ్రామంలోను గ్రంథాలయం ఏర్పాటుకై..... గ్రంథాలయ ఉద్యమానికి శ్రీకారం చుట్టిరి.*

*ఆంధ్రుల సాంఘిక చరిత్ర, గోల్కొండ కవుల సంచికలతో బాటు...... రామాయణ రహస్యాలు, మొగలాయి కథలు, హిందువుల పండుగలు మొదలగు అనేక రచనలు చేసిరి.*

*ప్రస్తుత పాఠ్యభాగము సురవరం ప్రతాపరెడ్డిగారి 'వ్యాసాలు' నుండి గ్రహింప బడినది.*

వేదము వేంకటరాయశాస్త్రి తెలియని తెలుగు వారుండరు. శాస్త్రులవారికి **"పండితరాయ"** యను బిరుదము చాల సార్థకమని నా మతము. ఏలన వీరిని బోలు పండితులు వింధ్యకు దక్షిణమున లేరనియే నేను విశ్వసించువాడను. వీరి వైదుష్యము వీరు వ్రాసిన సంస్కృతాంధ్ర గ్రంథముల వ్యాఖ్యానములే చాటుచున్నవి. శృంగార నైషధ గ్రంథ వ్యాఖ్యానమందు బలు తావుల తమ గురువులగు సీతారామాచార్యులనే తప్పుబట్టి వారిచే రచితమగు "శబ్ద రత్నాకరము" లోని యర్థములనేకములు దప్పు అని నిరూపించిరి. మరియు ఆముక్త మాల్యదలోని పద్యములనేకములు, పూర్వ వ్యాఖ్యాతలను సరిగా మనసుకు రాక తప్పని నిర్ణయించియుండ శాస్త్రులవారు తమ వ్యాఖ్యానమందవి సరియని నిరూపించి, సవరించి చూపించిన పాండితీ మహిమ కడుంగడు శ్లాఘ్యాపాత్రము.

వీరు కేవల వ్యాఖ్యానకర్తలే గాక విమర్శక శిఖామణులునునై యుండిరి. సుమారు 15 సంవత్సరముల క్రిందట గ్రామ్యవాదము బయలుదేరెను. ఆ వాదమునకు కొక్కొండ వేంకట రత్నము పండితులు వంటివారు సీసపద్యమునకు వెండి బంగారు పద్యములను విశ్వామిత్ర సృష్టినొకదానిని కల్పించి సహాయపడిరి. ఆ సందర్భమున శాస్త్రులవారు గ్రామ్యాదేశ నిరసనమును నొక లఘు పుస్తకమును వ్రాసి తీవ్రముగా ఖండించిరి. మరియు వేంకటరత్నము పండితులు సామాన్యులు కారు. మహా మహోపాధ్యాయ బిరుదాంకితులు. అప్పటికి మన శాస్త్రులవారికే బిరుదమును లేదు. మహోపాధ్యాయులగు వేంకటరత్నము పంతులు వ్రాసిన ఆంధ్రీకృత "ప్రసన్నరాఘవ నాటకము'' పై శాస్త్రుల వారొక విమర్శనము వ్రాసిరి. అది నాటకము కంటెను రెండింతలు హెచ్చుగా నున్నది.

శాస్త్రులవారుపన్యాసములలో మంచి ధోరణి గలవారు. వీరి యుపన్యాసములు, సంభాషణములు ఎల్ల కాలములందును హాస్యరస పూరితమై యుండెడివి. వీరుపన్యసించునపుడు సభ్యులను తన హాస్యకథనముచే నవ్వింతురు. కాని తాను మాత్రము నవ్వుటలేదు. ఆంగ్ల పండితులు హాస్యమెన్నియో విధముల నుండునని నిరూపించుచు నీ విధమగు హాస్యము చాల ప్రశంసనీయమైనదని వ్రాసి యున్నారు. "స్విఫ్టు అడిసన్'' (Swift Adison) మున్నగు పండితులిట్టి హాస్యమునే చిప్పిల చేయుచుండెడి వారట.

శాస్త్రులవారు ఆధునికులగు కవుల నేల మెచ్చుకుండెడివారు? వారు స్వభావ ముచే మొగమాటము లేనివారు. అనేకులు వారి దగ్గరకు వచ్చి తమ నూతన గ్రంథములకు తొలి పలుకులు వ్రాయుమని ప్రార్థించెడివారట. కాని శాస్త్రులవారు వారి గ్రంథములను మెచ్చక, వారి యెదటనే తీవ్రముగా విమర్శింప, వారు శాస్త్రులవారి పునర్దర్శనమునకు పోవువారు కారట. నిరంతరము కృషి చేసి విద్యార్థివలె చదువుచు, సంస్కృతాంధ్ర గ్రంథముల నించుమించు నన్నింటిని చదువుటయే గాక, అనేకులకు దొరకని గ్రంథములను గూడ శోధించి ఆ భాషలందు నిరుపమాన పాండిత్యమును గడించిన శాస్త్రులవారికి నితర పండితులు మెచ్చదగినవారు గాకుండుటలో నాశ్చర్యమేమి? శాస్త్రులవారి యీ అభిప్రాయము కేవలము సంభాషణ యందే గాక వీరి గ్రంథములందు ప్రకటితమై యున్నది.

శృంగార నైషధ వాఖ్యానమును వ్రాసినపుడు దాని నిట్లు సెలవిచ్చినారు.

ఉ॥ వ్రాసితి మున్ ప్రతాపకథ పండితమానుల గుండె నీరుగా
వ్రాసితి వెన్క నయ్యుష వివాహము సిద్ధ సుధా ప్రవాహమున్
వేసరకిప్డు నైషధము విప్పి నిధుల్ నెఱచూఱ లిచ్చితిన్
జేసెద నింక తత్పరతసేవను చూడి కుడుత్త దేవికిన్

శాస్త్రులవారి రచనలన్నింటిలోఁ గవిత్వమందేమి, హాస్యోచిత సంభాషణ ముననేమి, కథా చమత్కారమందేమి ప్రతాపరుద్రీయ నాటకము శ్రేష్ఠమని నాకుఁ దోచినది. వీరి రచనములందేగాక యాంధ్ర నాటకములందిది యద్వితీయ మనవచ్చును. ఈ కథయందంతటను ఆంధ్రదేశముపై శాస్త్రులవారికెట్టి గాఢాభి మానమున్నదో వెల్లడియగుచున్నది. పేరిగాడు రోగి ప్రతాపరుద్రుడై కవి గోష్ఠిలో నుండి కవిత్వమును గురించి కొంత ముచ్చటించును. కవి పేరిగానిని ఆశీర్వదించునప్పుడు ఉత్ప్రేక్షాతిశయోక్తులతో లావు లావు మాటలతో సంబోధింప వాని కవి రుచింపక యిట్లనును.

"యిదేం కయిత్తం యిది సీత్ కయిత్తమంటే యిలాగా!" ప్రతి మనిషికి తెలియాలి.

"సరి! యిక ధౌర్త్యము చేసెదను....." అని యిట్లు పేరిగాని దీవించును.

క॥ సలవ మడతలకి మలనే
యెలి బూడిద సొడుసున్న మెల్లల మలెనీ
కలు నీలమలె, మడేల
యెలిగే నీయ సమునేల కెలికో కౌరా!

పేరిగాడు : "తెఱచిన నోరు మూయక తల యూచియూచి విని నవ్వా నవ్వా భలే భలే బాపనయ్యా... అచ్చరనచ్చలు....... కయీస్సిరుడా యిలాంటి కయిత్తం యింకెవరైనా శెప్పగల్తురా"!

ప్రతాపరుద్రీయ నాటకమందు యుగంధరుడు వెఱ్ఱివానివలె ఢిల్లీ వీధులందు తిరిగి తన పిచ్చిని ప్రదర్శించునపుడా కుహనోన్మత్త మహామహునిచే నిట్లు పలికించుచున్నారు. మన శాస్త్రులవారు వెఱ్ఱి నాప్రతిభముందర యితరుల నీతి ప్రయోగము ఏపాటితో వర్ణించెద - లోగుట్టెఱుంగనివారు కవులను దూషించితినని తలంతురుగాక - ప్రకాశముగా - పూర్వజన్మములో నేను కవీశ్వరుణ్ణి. అప్పుడు నాకవిత్వాన్ని నేనే వర్ణించినాడ - పాడండి -

"మొద్దు మొద్దూల కవుల
బొద్దు బుజ్జిల మీద
గుద్దునా ముద్దుపాట"

"పుచ్చు పుచ్చూ కవుల
చచ్చు పాటల మీద
చిచ్చు నామెచ్చు పాట" - ఈ ప్రకారముగా నింకను చాలామటుకు ఆ వెట్టివానిచే పాడించినాడు. ఇందుగూడ శ్రీ శాస్త్రులవారు తమ ప్రతిభను నితర కవులకన్న మిన్నగా లెక్కించినట్లు ధ్వని వచ్చుచున్నది.

శాస్త్రులవారు రచించిన అమర శతక వ్యాఖ్యయు, భర్తృహరి శతక వ్యాఖ్యయు చూచినందున వారుదహరించిన గ్రంథాలెన్నియో అనేకులెన్నడును విననట్టివి గలవు. నీతుల నుదహరించుచో అనేక నీతి గ్రంథముల సూచించి యున్నారు. అటులే శృంగార నైషధమును, ఆముక్త మాల్యదను వివరించునపుడనేక ప్రమాణ గ్రంథముల నుదహరించి యున్నారు.

శ్రీ శాస్త్రులవారికి ప్రతాపరుద్రీయముపై యభిమానము మెండు. వారు కర్నూలులో ఒక వారము దినములుండిరి. అప్పుడు నన్ను చూచునప్పుడెల్లను నిట్లనువారు.

"నిన్ను చూచునప్పుడెల్లను ఆ ప్రతాపరుద్రుడు జ్ఞాపకము వచ్చును" - అని శాస్త్రులవారితో నొకతూరి వారు వ్రాసిన ప్రతాపరుద్రీయ విషయమును ముచ్చటించుచు నందలి ముసల్మాను పాత్రములను మాట్లాడించుచో వారి "తురక తెనుగును" గురించి వివరించితిని. శాస్త్రులవారికేమైనా ఉర్దూ గూడ తెలియునేమో యని తలంచి యుంటిని. దానికి వారు తమకు ఉర్దూ యేమియు తెలియదనియు, అది కేవలము ఊహాజనితమే యనియు సెలవిచ్చిరి. బోయవారు పాడిన పాటలు తమ దేశమందేమైన ప్రచారమందున్నవా యని యడిగితిని. తమ దేశమందు బోయలు తెడ్డులేయునప్పుడు చాల పాటలు పాడుదురనియు వానిని సంస్కరించి మంచి పాటలు పాడుటకు చాల వీలు కలదని చూపుటకై యిట్లు వ్రాసితినని చెప్పిరి.

శాస్త్రులవారు పుదూరు ద్రావిడులు. వారి యింటిలో తల్లితో వారు అరవమున మాట్లాడుటను నేను వినినాడను. ఇట్లు ద్రావిడులైనను వీరు ఆంధ్రభాషకు చేసిన సేవ అద్వితీయము. ఆంగ్ల వాఙ్మయమునకు "జాన్సను" ఎట్టివాడో మన ఆంధ్రమునకు

వీరట్టివారనుటలో నేమియు సందేహము లేదు. "డిక్షనరీ జాన్సను" అని యతడెట్లు పేరొందెనో యటులే వీరిని గూడ **"నిఘంటు శాస్త్రి"** గా భావి పండిత సంతతి ప్రశంసించి యుండును.

మన శాస్త్రులవారి జీవిత చరిత్రమును ప్రకటించుట చాల మంచిది. ఆధునిక కవులలో గణనమెక్కిన సర్వపండితుల చేతను సంపూజ్యుడై సర్వతంత్ర మహామహోపాధ్యాయ, పండితరాయ యిత్యాది బిరుదములనేకములు సంపాదించి కవులకును, పండితులకును భయంకరుడై నిర్దుష్టమైన కవిత్వమును వ్రాసి పండిత సభలయందెల్లడను నగ్రపూజలు పొందిన శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారి కీర్తి ఆచంద్రతారార్కమై వెలయు గాక!

## అధ్యయన వేదిక

**అర్థములు :**

వైదుష్యము = పాండిత్యము; ప్రతిభ = గొప్పతనము; గోష్ఠి = సభ;
అగ్రపూజ = గౌరవము; తాళపత్రములు = తాటియాకు గ్రంథములు

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను సూత్రములను వ్రాయుము.**

సంస్కృతాంధ్రము, బిరుదాంకితులు, గాఢాభిమానము, ఆచంద్ర తారార్కము.

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

లఘుపుస్తకము, అగ్రపూజ.

**అర్థ సందర్భములు :**

1. కడుంగడు శ్లాఘ్యాపాత్రము.
2. ఇతర పండితులు మెచ్చదగినవారు గాకుండుటలో నాశ్చర్యమేమి?
3. చూడి కుడుత్త దేవికిన్.
4. కీర్తి ఆచంద్ర తారార్కమై వెలయుగాక!

**ప్రశ్నలు :**

1. ప్రతాపరుద్ర నాటకమున పేరిగాని హాస్యము, యుగంధరుని వెఱ్ఱి చేష్టలు వివరించుము.
2. శాస్త్రిగారి ఉపన్యాసములు, విమర్శలు, వ్యాఖ్యానములు ఎట్లుండును?
3. వేదము వేంకటరాయశాస్త్రులవారితోడి సురవరం వారి అనుభవములను వివరించుము.



# 9. వేమన కవిత్వము, హాస్యము, నీతులు

**– శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ**

*శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అనంతపురం జిల్లా రాళ్ళపల్లిలో 1893 సం॥లో జన్మించిరి. వీరి తల్లి అలివేలు మంగమ్మ. తండ్రి కృష్ణమాచార్యులు. **'గానకళాప్రపూర్ణ' 'గానకళాసింధు'** అనునవి వీరి బిరుదములు.*

*సంగీత సాహిత్యాలలో సమధిక ప్రావీణ్యం గడించి సారస్వత విమర్శనలో ఉత్తమ ప్రమాణాలు చూపిన రచయిత. అన్నమాచార్య కీర్తనలు స్వరపరచి ప్రచురించినవారిలో ప్రథములు వీరే. వీరు మైసూరు మహారాజావారి కళాశాలలో, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య భాషా నిలయంలో అధ్యాపకులుగా, పరిశోధకులుగా పనిచేసిరి. వీరి రచనలు సంప్రదాయరీతిలోసున్నితమైన హాస్యంతో సునిశితమైన పరిశీలనతో కూడియుండును. **మీరాబాయి, వేమన, నాటకోపన్యాసములు, సారస్వతోపన్యాసములు, తారాదేవి శాలివాహనగాథా సప్తశతి** (అనువాదము) మొదలగునవి వీరి రచనలు.*

*ప్రస్తుత పాఠ్యభాగము 'వేమన' అను గ్రంథము నుండి గ్రహింపబడినది. ఇందు వేమనగారి కవిత్వము, హాస్యము, నీతులు గూర్చి చక్కగా వివరించబడినది.*

వేమన ఆంధ్రులలో సాటిలేని వ్యక్తి. అతీంద్రియములైన తత్వములను దెలిసికొనవలెనను నాశ. వానిననుభవపూర్వకముగా సాధించు సాహసము, తనకు దెలిసిన వానిని నిర్భయముగా ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి సాధనమై యిరుప్రక్కలందును మఱువలేని మంచి పదను గల చురకత్తి వంటి కవితాశక్తి, దానికి మెఱుగిచ్చునట్టి సంకేత దూషితముకాని ప్రపంచ వ్యవహారములందలి సూక్ష్మదృష్టి - ఇవన్నియు వేమన్నను సృష్టి చేయునపుడు బ్రహ్మదేవుడుపయోగించిన మూలద్రవ్యములు. కవిత్వమునకు భాష, ఛందస్సు మొదలగునవి బహిరంగములు. అర్థభావములంతరంగములు. అవి ఒక విశిష్ట విధముగా తీవ్రముగానున్ననే కాని కవిత్వమను పేరు రాదు.

సామాన్యముగ ఒక వస్తువును గూర్చి తనకు గలుగు భావములను భాష మూలమున ఇతరుల మనసుకెక్కునట్లు వెలువఱచుట కవిత్వమనవచ్చును. అనగా భావించువాడు, అతని భావము, దానికి విషయమైన వస్తువు, దానిని వెల్లడించు భాష, దానిని విని గ్రహించు సభ్యులు ఈయైదును కవిత్వ సృష్టి యందలి పంచమహాభూతములు. ఈయైదింటిలో ఏది లేకున్నను కవిత్వము కొరగాదు.

స్థూలముగా జూచిన సంగ్రహము, స్పష్టత, సరళత మొదలగునవి కవిత్వ భాషకుండవలసిన ప్రధాన గుణములు. చిన్న సులభమైన పద్యము ఆటవెలది గదా! దానిలోను ప్రాసమును చేర్చుకొని యితడు చేసిన సరళమైన సాము చూడుడు:

"ఆ. ఆకులన్ని దిన్న మేక పోతుల కేల
కాకపోయెనయ్యా కాయ సిద్ధి?
లోకు లెల్ల వెఱ్ఱి పోకిళ్ళ బోదురు......."

కావున తెలుగు ఛందస్సులో నెల్ల చిన్నది యగు ఆటవెలది నితడు పరిగ్రహించె ననవచ్చును. కందములు, తేటగీతి మొదలగు పద్యములు గూడ నితడు వాడినాడు. కాని వానిలో చాలవఱకు ఈ ముద్దు, ఈ చెక్కిన చక్కదనము, ఈ బిగువు లేదు. దీనిలో ఇతడు యతి కిచ్చిన మర్యాద, అందము, అద్భుతమైనది. ఎక్కడికి యతి యుండవలయునో యక్కడికి పదమే కాదు, అభిప్రాయమును తెగి నిలుచును.

"ఆ. కోతిబట్టి తెచ్చి క్రొత్తపుట్టము గట్టి
కొండ ముచ్చు లెల్ల కొలిచి నట్లు
నీతి హీను నొద్ద నిర్భాగ్యులుందురు........"

ఇతని భావము లెట్లు కృత్రిమములు కానివో యితని భాషయునట్లే. ఇది నిజమైన యచ్చ తెనుగు. తెలుగు మాటలాడ నేర్చిన వాని నెవ్వనికిని ఇతని పద్యము లర్థము కానివి యుండవు. తాను చెప్పు ప్రతి న్యాయమునకును ఒక యుపమానము తప్పక యుండును. ఆ యుపమానములు గూడ ఊహాకల్పితములుగాక, యింటి చుట్టుముట్టు గల వస్తువులగుటచే దాని సొగసును బిగువును అందఱనుభవించి యానందింతురు.

"ఆ. పసుల వన్నెవేఱు పాలేక వర్ణమౌ
పుష్పజాతి వేఱు పూజ యొకటి;
దర్శనములు వేఱు దైవంబదొక్కటి....."

ఒక మాఱు విన్న తరువాత పండితుడుగాని పామరుడు గాని వీనిని మఱువగలడా!

ఇతని కవిత్వమునకు కొంత మెఱుగుపెట్టి దానిని దుర్వారబలముగలదానినిగా జేసినది హాస్యము. హాస్యమునకు మూల ప్రకృతి యితరుల యందలి తప్పులను బైటపెట్టుట. అందును తప్పుకలదను నభిప్రాయమే సామాన్య జనులకు లేనట్టి చోటు లందలి తప్పును ఆకస్మికముగా బైటికి తీసినపుడు హాస్యమునకు బలమెక్కువ. ఇట్టి సూక్ష్మదృష్టి గలవాడు తన యందలి తప్పులను గూడ గమనించి చెప్పుకొని తనలోనే నవ్వుకొనును. ఒకరి తప్పులను బైటపెట్టినదెల్ల హాస్యముగానేరదు.

వేమన్నయు గొప్ప బోధకుడును, సంస్కర్తయు, స్వతంత్ర బుద్ధి కలవాడు కావున, ఒక్కొక్కమాఱు తనపని తాను మఱచి స్వచ్ఛమైన హాస్యముతో తృప్తి కలిగించుకొనును.

ఆ. పాల సాగరమున పవ్వళించిన వాడు
గొల్ల యిండ్ల పాలు కోరనేల ?

యను ప్రశ్న వచ్చినది. తక్కిన సమయములందు ఇవన్నియు "బూటక పురాణ కథలు" అని చెప్పి యుండును. కాని యిప్పుడా యుద్రేకము లేదు.

"ఎదుటివారి సొమ్ము లెల్లవారికి తీపు......"
ఇది విన్నవాడెంత కృష్ణభక్తుడైనను నవ్వక యుండలేడు.

సామాన్యముగా ఇతరుల లోపముల నెత్తి ఖండింప బూనుకొన్నప్పుడు గూడ, దానికెంత గావలయునో యంతటితో తృప్తి బొందక, యితరులకు నవ్వు గలిగింపవలయునను నుద్దేశము చేతనే కొన్ని కొసరు మాటలు చేర్చి వ్రాయుట యితని పద్ధతులలో నొకటి. లోభివాని నడుగుట నిష్ఫలము. గొడ్డుటావును బితికినట్లు, మేక మెడ చన్ను గుడిచినట్లు అని చెప్పిన జాలును గదా! ఇతని కంతటితో తృప్తి లేదు.

"ఆ "గొడ్డుటావు బితుక గుండ గొంపోయిన
పండ్లు రాలదన్ను; పాలనీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా....."

"ఆ 'మేక కుతిక బట్టి మెడ చన్ను గుడువగా
ఆక లేలమాను నాశ గాక
లోభివాని నడుగ లాభంబు గలుగునా.......?''

ఇందు కుండ గొంపోవుట, కుతిక బట్టుట మొదలగునవి పాలు త్రాగబోవువాని ఆత్రమును స్పష్టముగా జూపి, వాని యజ్ఞానమునకు మనల నవ్వించును.

ఆంధ్రదేశమున నా చంద్రార్కస్థాయిగా జేసినవి ఇతని నీతులు. ఈ నీతులును స్వార్థములని, పదార్థములని రెండు తెగలగును. తత్త్వవాదములకు వలె ఇతని నీతులకును అనుభవమే మూలము గాని పుస్తకములు కావు. కావుననే యవి యప్పుడును, ఇప్పుడును అనేకులకున్నట్లు ఇతనికి పుస్తకములు వ్రాయుటకును ఇతరులకుపన్యసించుటకును మాత్రము కావు. మంచి చెడ్డలను రెంటిని తాను జేసి యందలి తత్త్వమును చక్కగా నెఱిగి, యితరులకు బోధించినవాడగుటచే సామాన్య నీతి గ్రంథములలో లేని తీవ్రత యితని పద్యములలో గలదు.

"ఆ. విన్న వానికన్న కన్న వాడధికుండు
కన్న వాడి కన్న కలియువాడు''

అను మాట యితని నీతులందును అన్వయించును. ఇట్టి పరార్థ కార్యములతో వేమన్నకెక్కువ యభిమతమైనది ఔదార్యము. ఇతరులు తన్ను యాచించుటకు ముందే దానము చేసినవాడే దాత యని యితని యభిప్రాయము. ఈ విషయమందితడు అతివాదియని వెనుకనే విన్నవించితిని గదా. కావుననే యతనికి లోభివారిమీద చాలా అసహ్యము పుట్టినది. సాధ్యమైనచో ప్రపంచమందలి లోభులనెల్ల పట్టి చంపినను పాపము లేదని యితడు తలచినట్లున్నది. వారిని చంపుటకితని మందు.....

"ఆ. లోభివాని జంప లోకంబు లోపల
మందు వలదు, వేఱుమతము గలదు
పైక మడిగినంత భగ్గునపడి చచ్చు.....''

ఇతని యసహ్యమునందును హాస్యము లేకపోలేదు. ఇంకను వినుడు.

ఆ. "పిసిని వాని యింట బీనుగు వెడలిన
కట్టెకోలలకును కాసు లిచ్చి
వెచ్చమాయెననుచు వెక్కి వెక్కేడ్చురా......"

ఇంత యుదార బుద్ధి యున్నను వేమన్నకు పాత్రాపాత్ర వివేకము లేకపోలేదు. దానమున కెవడు పాత్రము అని నిర్ణయించినప్పుడు ఇతనికి కులము, జాతి మొదలగు వానిమాటలు యట్లుండనిండు. గుణము గూడ నక్కరలేదు. ముఖ్యమైనది పేదఱికము. అది యున్న తక్కినదేమున్నను లేకున్నను అతడు పాత్రమే.

ఆ. "దోసకారియైన దూసరికాడైన
పగతుడైన వేద బాహ్యుడైన
వట్టిలేని పేద వానికీదగునీవి
ధనికునకు నొసంగదగదు వేమ"

ఇతని స్వార్థనీతులతో స్వానుభవము, వివేకము, ఇంకను ఎక్కువగా గానవచ్చును. మనుష్యులకీలకమందు నెమ్మదిగా బ్రతుకుటకావశ్యములగు ఓర్పు, వివేకము మొదలగు గుణములనివి బోధించుచు నందఱికిని ప్రియములుగా నుండును. శౌర్యము మంచిది, కాని యిది సమానుల విషయమందు మాత్రము పనికివచ్చును.

"ఆ. అనువుగాని చోట నధికుల మనరాదు
కొంచెముండు టెల్ల కొదువ గాదు
కొండ యద్ద మందు కొంచమై యుండదా?......"

ఇట్లే యితరు డెవడైనను తన్నుదండించిన యెడల సహింపక తిరుగబడుటయు, శౌర్యముగానే తోపవచ్చు గాని అట్లు దండించుట వలన తనకు మేలే యగు పక్షమున సహించు కొని యుండుటయే వివేకమని వేమన్న మతము.

"ఆ. చాకి కోకలుదికి చీకాకు పడజేసి
మైల దీసి లెస్స మడిచినట్లు
బుద్ధి జెప్పువాడు గ్రుద్దితే నేమయా?......"

పై రెండు విధముల నీతులను సాక్షాత్తుగా జెప్పుట యొక తీఱు. ఇట్లు ధర్మము, తత్త్వము, నీతి, పరమత ఖండనము మొదలగునేవిషయములు చెప్పినను, ఇతని

పద్యములందు అనన్యసాధారణమైన సారళ్యము, ధారాళత, చెక్కడపు పని, నిర్లక్ష్యము మొదలగు కవితా గుణములు నిండి యుండును.

## అధ్యయన వేదిక

**అర్థములు :**

పైకము = డబ్బు, ధనము; ఔదార్యము = దయాగుణము; పగతుడు = శత్రువు

**సంధులు :**

**ఈ క్రిందివానిని విడదీసి సంధి పేర్లను, సూత్రములను వ్రాయుము.**

కవితాశక్తి, పదార్థము

**సమాసములు :**

**ఈ క్రిందివానికి విగ్రహ వాక్యములు వ్రాసి సమాసముల పేర్లను వ్రాయుము.**

సూక్ష్మదృష్టి; తత్త్వవాదములు; నీతిగ్రంథములు; స్వార్థనీతులు; కవితా గుణములు.

**అర్థ సందర్భములు :**

1. "లోకు లెల్ల వెట్టి పోకిళ్ళ బోదురు"
2. "దర్శనములు వేఱు దైవంబదొక్కటి"
3. ఎదుటివారి సొమ్ము లెల్లవారికి తీపు"
4. "లోభివాని నడుగ లాభంబు లేదయా...."
5. "అనువుగాని చోట నధికుల మనరాదు"
6. "బుద్ధి జెప్పువాడు గ్రుద్దితే నేమయా?...."

**ప్రశ్నలు :**

1. "వేమన ఆంధ్రులలో సాటిలేని వ్యక్తి" సమర్థింపుము.
2. వేమన హాస్య విధానమును గూర్చి వివరింపుము.

3. వేమన నీతులను గూర్చి వ్రాయుము.

4. వేమన కవిత్వము గూర్చి చర్చించుము.

*విద్యార్థులకు సూచన :*

వేమన నీతి పద్యములను కొన్నింటిని సేకరించి కంఠస్థము గావింపుడు.



# వ్యాకరణము

## సంధులు :

**సంధి :-** "పూర్వ పరస్వరంబులకు పరస్వరంబేకాదేశమగుట" సంధి యనబడును. సంధిలో మొదటి పదమును పూర్వపదమనియు, రెండవ పదమును ఉత్తరపదమనియు అందురు. ఈ రెండు పదముల కలయిక సంధి.

ఉదా :- రాముడు + అతడు - రాముడతడు.

మనము + ఉంటిమి - మనముంటిమి

### 1. సంస్కృత సంధులు :

1. **విసర్గ సంధి :-** విసర్గమునకు శ - ష - స — లు పరమగునప్పుడు క్రమముగా శ - ష - స — లు వచ్చును

ఉదా :- చతుః + శతాబ్దములు — చతుశ్శతాబ్దములు

పయః + షాడబము — పయష్షాడబము

తపః + సాధనము — తపస్సాధనము

2. విసర్గమునకు క - ఖ - ప - ఫ — లు పరమగునప్పుడు విసర్గముమారదు

ఉదా :- మనః + కమలము — మనఃకమలము

ప్రాతః + కాలము — ప్రాతఃకాలము

తేజః + పుంజము — తేజః పుంజము

తపః + ఫలము — తపః ఫలము

3. హ్రస్వ అకారము మీది విసర్గకు హ - య - వ - ర — లు గాని, అచ్చులు గాని, వర్గ తృతీయ చతుర్థ పంచమాక్షరములు గాని పరమగునప్పుడు హ్రస్వ అ కారము "ఓ" కారముగా మారును.

ఉదా :- వయః + వృద్ధులు — వయోవృద్ధులు

తపః + వనము — తపోవనము
శిరః + రత్నము — శిరోరత్నము
రజః + అభిషిక్తుడు — రజోభిషిక్తుడు

4. "విసర్గకు చ - ఛ — లు పరమగునప్పుడు శ వర్ణముగాను,
ట - ఠ — లు పరమగునప్పుడు ష వర్ణముగాను,
త - థ — లు పరమగునప్పుడు స వర్ణముగాను మారును."
ఉదా :- తపః + చర్య — తపశ్చర్య
ధనుః + టంకారము — ధనుష్టంకారము
మనః + తత్వము — మనస్తత్వము

5. "విసర్గకు కొన్ని తావులందు రేఫాగమమగును.
ఉదా :- ధనుః + బాణము — ధనుర్బాణము
అంతః + ఆత్మ — అంతరాత్మ
ధనుః + విద్య — ధనుర్విద్య

**2. శ్చుత్వసంధి :**

స - త - థ - ద - ధ — లకు శ-చ-ఛ-జ-ఝ — లు పరమగునప్పుడు వరుసగా నవియే ఆదేశములగును.

ఉదా :- మనస్ + శాంతి — మనశ్శాంతి
తపస్ + శక్తి — తపశ్శక్తి
సత్ + చరితము — సచ్చరితము
జగత్ + జననము — జగజ్జననము

**3. జశ్త్వసంధి :**

వర్గప్రథమాక్షరములకు వర్గతృతీయ చతుర్థాక్షరములు, హ - య - వ - ర — లుగాని, అచ్చులుగాని పరమగునప్పుడు క్రమముగా గ - జ - డ - ద - బ — లు ఆదేశముగా వచ్చును.

ఉదా :- వాక్ + యుద్ధము — వాగ్యుద్ధము
రాట్ + దూత — రాడ్దూత
శరత్ + భయము — శరద్భయము

## తెలుగు సంధులు :

**1. త్రికసంధి :**

ఆ - ఈ - ఏ — లు త్రికములు. త్రికము మీది అసంయుక్త హల్లునకు ద్విత్వమును, త్రికదీర్ఘమునకు హ్రస్వము బహుళముగా నగును.

ఉదా:- ఆ + కన్య, ఆ + క్కన్య — అక్కన్య, ఆకన్య
ఈ + విధము, ఈ + వ్విధము — ఇవ్విధము, ఈవిధము
ఏ + వ్వారు, ఏ + వ్వారు — ఎవ్వారు, ఏవారు

**2. టుగాగమసంధి :**

1. కర్మధారయములందు ఉత్తునకచ్చు పరమగునప్పుడు టుగాగమంబగు

   ఉదా :- పండు + ఆకు — పండుటాకు
   నిలువు + అద్దము — నిలువుటద్దము

2. కర్మధారయమున ''పేర్వాది'' శబ్దములకు అచ్చుపరంబగునప్పుడు టుగాగమంబగును.

   ఉదా :- పేరు + ఉరము — పేరుటురము, పేరురము
   చిగురు + ఆకు — చిగురుటాకు, చిగురాకు.

**3. రుగాగమసంధి :**

1. కర్మధారయమున "పేదాది" శబ్దములకు "ఆలు" శబ్దము పరమగునప్పుడు రుగాగమగును.

   ఉదా :- పేద + ఆలు — పేదరాలు
   జవ + ఆలు — జవరాలు
   ధీరు + ఆలు — ధీరురాలు

2. కర్మధారయమున తత్సమ శబ్దములకు ''ఆలు'' శబ్దము పరమగునప్పుడు అత్వంబున కుత్వంబును, రుగాగమంబగు.

ఉదా :- దుష్ట + ఆలు — దుష్టురాలు
ధన్య + ఆలు — ధన్యురాలు
సంపన్న + ఆలు — సంపన్నురాలు

## సమాసములు

"సమర్థంబులగు పదంబులు ఏకపదంబగుట సమాసము నాఁబడు.'' అనగా ననేక పదములు కలిసి ఒకపదమై అర్థమును బోధించుటను సమాసమందురు.

భాషను బట్టి సాంస్కృతికము, ఆచ్ఛికము, మిశ్రమము అని సమాసములు మూడు విధములు.

1. సాంస్కృతికము :- పూర్తి సంస్కృత భాషా పదములకు సంబంధించిన సమాసము సాంస్కృతికము.

   ఉదా :- 1. రాజాజ్ఞ 2. తటాకోదకము

2. ఆచ్ఛికము : (ఆచ్ఛికము = అచ్చతెలుగు) పూర్తి తెలుగు భాషా పదములకు సంబంధించిన సమాసము ఆచ్ఛికము.

   ఉదా :- తేనియానతి ; చెఱువునీరు

3. సంస్కృత తెలుగు భాషాపదముల మిశ్రమ సమాసము మిశ్రమము.

   ఉదా :- రాజునానతి, తేనియాజ్ఞ, తటాకపునీరు

**1. ద్వంద్వసమాసము :-** (జంటపదములు)

పదార్థ ప్రధానము ద్వంద్వము. అనగా రెండు పదముల యొక్క అర్థము ప్రధానముగా గలది

ఉదా॥- రాముడును, లక్ష్మణుడును — రామలక్ష్మణులు
తల్లియును, తండ్రియును — తల్లిదండ్రులు
కూరయును, కాయయును — కూరగాయలు.

B. **బహుపద ద్వంద్వము :-** ఇందు రెండు పదములకంటె ఎక్కువ పదముల అర్థము ప్రధానముగా నుండును.

ఉదా:- రాముడును, లక్ష్మణుడును, భరతుడును, శత్రుఘ్నుడును — రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు

**2. ద్విగుసమాసము :**

ఇందు మొదటి పదము సంఖ్యా వాచక విశేషణముగాను, రెండవ పదము విశేష్యముగా నుండును.

ఉదా:- మూడైన లోకములు — ముల్లోకములు
పదియైన దినములు — పదిదినములు
నవ సంఖ్య గల్గిన గ్రహములు — నవగ్రహములు
దశ సంఖ్య గల్గిన దిశలు — దశదిశలు

**3. బహువ్రీహి సమాసము :-** అన్య పదార్థ ప్రధానము బహువ్రీహి. ఇందు విగ్రహ వాక్యములందు చివర గలది, గలవాడు, గలవారు అను పదములు చేరును.

ఉదా:- చంద్ర వదనము వంటి వదనము గలది — చంద్రవదన
విశాలమైన అక్షులు గలది — విశాలాక్షి
దశకంఠములు గలవాడు — దశకంఠుడు
పుణ్యాత్మగలవారు — పుణ్యాత్మకులు

**4. రూపక సమాసము :**

ఉపమాన ధర్మమును ఉపమేయమునందు ఆరోపించుట రూపకము.

ఉదా:- గర్వమనెడు అంధకారము — గర్వాంధకారము
కోపమనెడు అగ్ని — కోపాగ్ని
ఉదరమనెడు అగ్ని — ఉదరాగ్ని

**5. అవ్యయీ భావసమాసము :**

అవ్యయము లక్షణముగలది. ఇందు పూర్వపదము సాధారణముగా అవ్యయమై యుండును.

ఉదా:- అర్థమెట్లో అట్లు — యథార్థము
ఉచితమెట్లో అట్లు — యథోచితము

### 6. నఞ్ తత్పురుష సమాసము :

సంస్కృతమున "న" అనునది వ్యతిరేకార్థమును తెలుపును. తెలుగులో కానిది అర్థము వచ్చును. సమాసమునందు ఈ..... "న" మొదటి పదముగానుండి, రెండవ పదము మొదట హల్లున్నచో "అ" గా మారును. అచ్చున్నచో "అన్" గా మారును.

ఉదా॥ న + సత్యము - సత్యము కానిది — అసత్యము
న + భయము - భయము కానిది — అభయము
న + అఘము - అఘము కానిది — అనఘము.

### 7. కర్మధారయ సమాసము :

విశేషణములకు నామవాచకములతోగాని, ఉపమానములకు ఉపమేయములతోగాని సమాసము చేయుట కర్మధారయము.

1. విశేషణ పూర్వపద కర్మధారయ సమాసము :- ఇందు మొదటి పదము విశేషణముగాను, రెండవ పదము విశేష్యముగా నుండును.
   ఉదా:- క్రూరమైన మృగము — క్రూరమృగము
   అల్పమైన హాస్యము — అల్పహాస్యము
   దుష్టమైన కాలము — దుష్కాలము

2. విశేషణ ఉత్తరపద కర్మధారయ సమాసము :- ఇందు మొదటి పదము విశేష్యముగాను, రెండవ పదము విశేషణముగా నుండును.
   ఉదా:- అధముడైన శశము — శశాధముడు
   వృద్ధమైన (ముసలి) కపోతము — కపోతవృద్ధము.
   అధముడైన నరుడు — నరాధముడు

3. సంభావనా పూర్వపద కర్మధారయ సమాసము :- ఇందు మొదటి పదము సంజ్ఞావాచక విశేషణముగాను, రెండవ పదము జాతి నామ వాచకముగా నుండును.
   ఉదా:- ఇభమను పేరుగల పురము — ఇభపురము.

హస్తిన అనుపేరుగల పురము — హస్తినాపురము.
ద్వారకఅనెడు నగరము — ద్వారకానగరము.

4. ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసము :- ఇందు ఉపమానము పూర్వపదముగాను, ఉపమేయము రెండవ పదముగా నుండును.
ఉదా:- నగేంద్రము వలె ధీరుడు — నగేంద్ర ధీరుడు.
ధవళాబ్జ పత్రముల వంటి నేత్రములు — ధవళాబ్జ పత్ర నేత్రములు.

5. ఉపమాన ఉత్తరపద కర్మధారయ సమాసము :- ఇందు ఉపమేయము మొదటి పదముగాను, ఉపమానము రెండవ పదముగా నుండును.
ఉదా:- తామరల వంటి కేలు — కేలు తామరలు
అంబుజముల వంటి పాదములు — పదాంబుజములు
సింహము వంటి రాజు — రాజ సింహము
అబ్జముల వంటి చరణములు — చరణాబ్జములు.

**8. తత్పురుష సమాసము :**

1. ద్వితీయా తత్పురుష సమాసము :- ఇందు మొదటి పదము చివర నిన్ - నున్ - లన్ - కూర్చి - గురించి అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినపుడు లోపించును.
ఉదా:- మరుని హరించిన వాడు — మరు హరుడు
మన్మథుని చంపినవాడు — మన్మథ దమనుడు
చంద్రుని ధరించినవాడు — చంద్ర ధరుడు
ధర్మా ధర్మములను తెలిసినవాడు — ధర్మా ధర్మ విదుడు.

2. తృతీయా తత్పురుష సమాసము :- ఇందు మొదటి పదము చివర చేతన్ - చేన్ - తోడన్ - తోన్ అనువానిలో ఒకటి యుండి, సమాసము చేసినప్పుడు లోపించును.
ఉదా:- ధనముచేత అధికుడు — ధనాధికుడు
మధుపానముచేత మత్తులు — మధుపాన మత్తులు
వాక్కులతో యుద్ధము — వాగ్యుద్ధము

3. చతుర్థీ తత్పురుష సమాసము :- ఇందు మొదటి పదము చివర "కొఱకు - కై" అను ప్రత్యయములలో ఒకటియుండి సమాసము చేసినపుడు లోపించును.

ఉదా:- రణము కొఱకు రంగము — రణరంగము

4. పంచమీ తత్పురుష సమాసము :- ఇందు మొదటి పదము చివర, వలనన్ కంటెన్ - పట్టి అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినపుడు లోపించును.

ఉదా:- చోరులవలన భయము — చోరభయము
ఉపవాసము వలన ఆయాసము — ఉపవాసాయాసము.
ప్రాణము కంటె అధికుడు — ప్రాణాధికుడు

5. షష్ఠీ తత్పురుష సమాసము :- ఇందు మొదటి పదము చివర కిన్ - కున్- యొక్క - లోన్ - లోపలన్ అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినపుడు లోపించును.

ఉదా:- ధనమునకు నాథుడు — ధననాథుడు
కౌరవులకు నాథుడు — కౌరవనాథుడు
విశ్వమునకు ద్రోహి — విశ్వద్రోహి
రాముని యొక్క నామము — రామనామము
గిరి యొక్క నందన — గిరినందన
నరులలో అధముడు — నరాధముడు
పురుషులలో ఉత్తముడు — పురుషోత్తముడు

6. సప్తమీ తత్పురుష సమాసము :- ఇందు మొదటి పదము చివర, అందు-న అను ప్రత్యయములలో ఒకటి యుండి సమాసము చేసినపుడు లోపించును.

ఉదా:- కుంభము (నుండి) నందు పుట్టినవాడు — కుంభజుడు
వీణ యందు ప్రావీణ్యము — వీణాప్రావీణ్యము
విషయము నందు ఔన్నత్యము — విషయౌన్నత్యము
నటన యందు కౌశలము — నటనాకౌశలము

# ఛందస్సు

## 1. కందము :

కందపద్యమునకు నాలుగు పాదము లుండును.

1 - 3 పాదములు మూడేసి గణములుండి పొట్టిగను,

2 - 4 పాదములు అయిదేసి గణములుండి పొడవుగా నుండును.

గగ - నల - భ - జ - స అను గణములను వరుసక్రమమునగాక యిష్టము వచ్చినట్లుగా వాడవచ్చును. బేసి గణములు "జగణముగా" నుండరాదు. కాని,

2 - 4 పాదములందు మూడవ గణము జగణముగాని, నలము గాని యుండవలెను.

2-4 పాదములందు చివరి యక్షరము గురువుగా నుండవలెను. ప్రాసనియమము గలదు.

యతి :- 2 - 4 పాదములందు పాదము మొదటి అక్షరమునకు 4వ గణము మొదటి యక్షరమునకు యతిచెల్లును.

ఉదా:-

| నల | భ | భ |
|---|---|---|
| I I I I | U I I | U I I |
| సిరిగల | వానికిఁ | జెల్లును |

| నల | స | జ | స | గగ |
|---|---|---|---|---|
| I I I I | I I U | I U I | I I U | U U |
| తరణుల | పదియా |ఱువేలఁ | దగఁబెం | డ్లాడన్ |

తిరిపెమున కిద్ద ఱాండ్రా

పరమేశా! గంగ విడుము, పార్వతి చాలున్.

## 2. సీసము :

సీసపద్యమునకు నాలుగు పెద్దపాదములుండును. ప్రతిపాదమునందు మొదట 6 ఇంద్రగణములు, చివర 2 సూర్యగణములుండును.

ప్రాసనియమము లేదు.

యతి :- ప్రతిపాదమునకు రెండేసి యతులు చెల్లును.

1. పాదము మొదటి అక్షరమునకు 3వ గణము మొదటి అక్షరమునకు ఒక యతి చెల్లును.

2. 5వ గణము మొదటి అక్షరమునకు 7వ గణము మొదటి అక్షరమునకు మరియొక యతిచెల్లును.

నాలుగు పెద్దపాదములకు చివర ఆటవెలదిగాని, తేటగీతిని గాని చేర్చినచో పూర్తి సీసపద్యమగును.

ఉదా:-

| | | | |
|---|---|---|---|
| ర | సల | త | సల |
| U I U | I I U I | U U I | I I U I |
| పూర్వజ | న్మమునందు | పూజించె | గజమంద్రు |

| | | | |
|---|---|---|---|
| సల | భ | హ | హ |
| I I U I | U I I | U I | U I |
| గజరాజు | పొందిన | గ్రాసి | యేమి |

సూత్రము :- 6 ఇంద్రగణములు + 2 సూర్యగణములు

**3. ద్విపద :**

ద్విపద పద్యమునకు రెండు పాదములు మాత్రమే యుండును.

ప్రతి పాదమునందు మొదట 3 ఇంద్రగణములు, చివర 1 సూర్య గణముండును.

ప్రాసనియమము గలదు.

ప్రాస యతి గూడ చెల్లును.

యతి :- పాదము మొదటి అక్షరమునకు 3వ గణము మొదటి అక్షరమునకు యతిచెల్లును.

ఉదా:-

| ర | సల | భ | హ |
|---|---|---|---|
| U I U | I I U I | U I I | U I |
| కొమ్మనీ | కొకమంచి | బొమ్మయు | లెస్స |

| ర | నల | ర | న |
|---|---|---|---|
| U I U | I I I I | U I U | I I I |
| బొమ్మపొ | త్తికలను | బోయితె | చ్చెదము |

సూత్రము :- 3 ఇంద్రగణములు + 1 సూర్యగణము.

1. **సూర్యగణములు :-** సూర్యగణములు రెండు.

హగణము - U I

నగణము - I I I

2. **ఇంద్రగణములు :-** ఇంద్రగణములు ఆరు.

నలము - I I I I

నగము - I I I U

సలము - I I U I

భగణము - U I I

రగణము - U I U

తగణము - U U I

చతుర్మాత్రా గణములు :- ఈ చతుర్మాత్రా గణములు కంద పద్యమున వాడబడును.

గగము - U U

నలము - I I I I

భగణము - U I I

జగణము - I U I

సగణము - I I U

# అలంకారములు

స్త్రీలకు బంగారు నగలు అందమును చేకూర్చినట్లే భాషకందమును చేకూర్చునని అలంకారములు. అలంకారములు రెండు రకములు.

1. శబ్దాలంకారములు 2. అర్థాలంకారములు.

**శబ్దాలంకారములు :-** శబ్దము ప్రధానముగా గలవి శబ్దాలంకారములు.

1. **వృత్త్యను ప్రాసము :-** ఒకసారి వచ్చిన అక్షరమును మరల మరల పలుమార్లు వచ్చునట్లు చెప్పుట వృత్త్యను ప్రాసము.
   ఉదా:- అడ్డిగెద నని కడ్డువడ్డి చను
   నడ్డిగిన, దను మగడ్డు నుడ్డువడ్డని నడ్డయుడ్డుగన్
   వెడ్డవెడ్డ సిడ్డి ముడ్డి తడ్డఁబడ్డ
   నడ్డుగిడ్డు నడ్డుగిడ్డదు జడ్డిమ నడ్డుగిడ్డునెడ్డలన్.

   ఇచట డకారము పలుమార్లు వచ్చుటచేనిది వృత్త్యను ప్రాసము.

2. **లాటాను ప్రాసము :-** శబ్దార్థ భేదములు లేక, తాత్పర్య భేదమును మాత్రము కలిగిన పదములను వెంట వెంటనే ప్రయోగించుటను లాటానుప్రాసము.
   ఉదా:- కమలార్చు నర్చించు కరములు కరములు
   శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ

   ఇచ్చుట శబ్దార్థములందు భేదములేదు. కాని, తాత్పర్యమున..... కరములు (చేతులు) కరములు (శ్రేష్ఠమైన చేతులు);

   జిహ్వ (నాలుక) జిహ్వ (శ్రేష్ఠమైన నాలుక) అని తాత్పర్య భేదము చెప్పుటచే నిది లాటానుప్రాసము.

3. **యమకము :-** అర్థభేదమును కలిగి ఒకసారి వచ్చిన పదము మరల మరల పలుమార్లు వచ్చునట్లు చెప్పుట యమకము.
   ఉదా:- పురమునందు 'అంతి' పురమునందు.
   ఇచ్చుట ...... పురము = పట్టణము

'అంతి' పురము = రాణులు నివసించు భవనము (అంతఃపురము) అని అర్థభేదము కలిగిన పదములు పలుమార్లు చెప్పుటచే నిది యమకము.

4. **అంత్యప్రాసము :-** పదాంతముల యందు ప్రాసయున్న అంత్యప్రాస యగును.

ఉదా:- శ్రీరఘురామ చారు తులసీదళదామ శమక్షమాదిశృంగార
గుణాభిరామ! త్రిజగనున్నత శౌర్యరమా లలామ.

ఇందు పదాంతముల యందు

రామ - దామ - అభిరామ - లలామ అని ప్రాసచెప్పుటచే నిది అంత్యప్రాసము.

**అర్థాలంకారములు :** అర్థము ప్రధానముగా గలవి అర్థాలంకారములు.

1. **ఉపమాలంకారము :-** ఒక వస్తువును మరియొక వస్తువుతో పోల్చి మనోహరముగా చెప్పుటను ఉపమాలంకారము.

లేక

ఉపమేయమును ఉపమానముతో పోల్చి చెప్పుటను ఉపమాలంకారము.

ఉదా:- ఆస్త్రీముఖము చంద్రబింబము వలె ప్రకాశించుచున్నది.
ఉపమేయము :- స్త్రీ ముఖము
ఉపమానము :- చంద్రబింబము
ఉపమావాచక శబ్దము :- వలె
సమాన ధర్మము :- ప్రకాశించుట...

ఇచ్చట స్త్రీముఖమును చంద్రబింబమువలె ప్రకాశించుచున్నది అని పోల్చి చెప్పుటనే నిది ఉపమాలంకారము.

2. **రూపకము :-** ఉపమాన ఉపమేయములకు అభేదము చెప్పుట రూపకము.

ఉదా:- "ఆస్త్రీముఖము చంద్రబింబము"
ఉపమేయము :- స్త్రీముఖము
ఉపమానము :- చంద్రబింబము

ఇచ్చట స్త్రీ ముఖమే చంద్రబింబము.

చంద్రబింబమే స్త్రీముఖము.... అని ఉపమాన ఉపమేయములకు అభేదము చెప్పుటచే నిది రూపకము.

"పుత్తడిబొమ్మ పూర్ణమ్మ"

3. **ఉత్ప్రేక్షాలంకారము :-** ఉపమేయమును ఉపమానముగా ఊహించుటను ఉత్ప్రేక్షాలంకారము.

ఉదా:- ఆమదకరి నడకొండయా యని నడచి వచ్చుచున్నది.

ఉపమేయము :- మదకరి (ఏనుగు)

ఉపమానము :- నడకొండ

ఇచ్చట మదకరిని నడకొండగా ఊహించుటచే నిది ఉత్ప్రేక్షాలంకారము.

(ఉత్ప్రేక్ష = ఊహించుట)

4. **సారాలంకారము :-** ఒకదానికంటె మరియొకటి గొప్పది అని చెప్పుట సారాలంకారము.

ఉదా:- తేనె మధురము. దానికంటె అమృతము మధురము. దాని కంటె కవి వాక్కులు మధురము.

ఇచ్చట తేనెకంటె అమృతము, అమృతముకంటె కవి వాక్కులు మధురమని గొప్పగా చెప్పుటచే నిది సారాలంకారము.

5. **అతిశయోక్తి :-** ఒక వస్తువును గురించి మిక్కిలి గొప్పగా వర్ణించి చెప్పుటను అతిశయోక్త్యలంకారము.

ఉదా:- ఆ పట్టణమందలి మేడలు ఆకాశమును తాకుచున్నవి.

ఇచ్చట మేడలు చాలా ఎత్తుగానున్నవని చెప్పుటకు బదులుగా, ఆకాశమునే తాకుచున్నవని గొప్పగా వర్ణించి చెప్పుటచే నిది అతిశయోక్త్యలంకారము.

6. **శ్లేషాలంకారము :-** ఒక పదమునకు అనేకార్థములు చెప్పుట శ్లేషాలంకారము. (లేక) అనేకార్థములు వచ్చు పదములు చెప్పినను శ్లేషాలంకారము.

ఉదా:- "రాజు కువల యానందకరుడు"

రాజు :- ప్రభువు ; చంద్రుడు

కువలయము :- ప్రపంచము ; కలువపూవు

ప్రభువు ప్రపంచమునకు ఆనందమును కల్గించును. చంద్రుడు కలువ పూవులకు ఆనందమును కల్గించును.

ఇచ్చట రాజు, కువలయము పదములకు అనేకార్థములు చెప్పుటచే నిది శ్లేషాలంకారము.

7. **ఉల్లేఖనము :-** ఒక వస్తువును పలువిధములుగా కీర్తించుట ఉల్లేఖనము.
   ఉదా:- ఆరాజు అందమున మన్మథుడు, కీర్తియందరర్జునుడు వింటి యందు భీష్ముడు.

ఇచ్చట రాజును .... అందమునమన్మథుడనియు, కీర్తియందు అర్జునుడనియు, వింటియందు భీష్ముడనియు పలువిధముల కీర్తించుటచే నిది ఉల్లేఖనాలంకారము.

(ఉల్లేఖనము = కీర్తించుట)

8. **క్రమాలంకారము లేక యథాసంఖ్యాలంకారము :-** క్రమసంఖ్యగల పదములను క్రమసంఖ్యగలవానితో క్రమముగా అన్వయించి చెప్పుట క్రమాలంకారము.
   ఉదా:- రామ లక్ష్మణులు రావణ యింద్రజిత్తులను వధించిరి.

ఇచ్చట రాముడు రావణుని, లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుటను క్రమముగా అన్వయించి చెప్పుటచే నిది క్రమాలంకారము.

"పోగాలము దాపురించినవారు అరుంధతీ నక్షత్రమును, మిత్రుల వాక్యమును, దీప నిర్వాణ గంధమును కనరు వినరు మూర్కొనరు".

9. **స్వభావోక్తి :-** జాతిగుణాదుల యందలి స్వభావమును ఉన్నదున్నట్లు చెప్పుట స్వభావోక్త్యలంకారము.

(లేక)

ఒక వస్తువు యొక్క స్వభావమును ఉన్నదున్నట్లు చెప్పుట స్వభావోక్త్యలంకారము.

ఉదా:- ఆజింకల గుంపు చంచలనేత్రములతో మోరలెత్తి, చెవుల నిక్కించి, నావంక బెదరిచూచినవి.

ఇచ్చట జింకలు క్రొత్త (మనిషిని) వారిని చూచినప్పుడు మెడలు పైకెత్తుట, చెవుల నిక్కించుట, బిత్తర చూపులు చూచుట మొదలగు చేష్టలు జింకల స్వభావమును ఉన్నదున్నట్లు చెప్పుటచే నిది స్వభావోక్త్యలంకారము.

**10. సందేహము :-** ఒక వస్తువును చూచి అదియా? లేక ఇదియా? అని సందేహించుట సందేహాలంకారము.

ఉదా:- ఆస్త్రీముఖము పద్మమా? లేక చంద్రబింబమా? మాకు నిర్ణయము గాకున్నది.

ఇచ్చట కొందరు స్త్రీముఖమును చూచి పద్మమా? లేక చంద్రబింబమా? అని సందేహించుటచే నిది సందేహాలంకారము.

**11. భ్రాంతిమదము :-** ఒక వస్తువును చూచి వేరొక వస్తువని భ్రమ పడుటను భ్రాంతి మదలంకారము.

ఉదా:- మదించిన గండుతుమ్మెద ఆస్త్రీముఖమును చూచి కమలమని వాలుచున్నది.

ఇచ్చట గండు తుమ్మెద స్త్రీముఖమును చూచి తామరపూవని భ్రమ పడుటచే నిది భ్రాంతిమదలంకారము.

(తుమ్మెదలకు పూవులలోని మకరందము ఆహారము)

**12. లోకోక్తి :-** లోకోక్తి యనగా సామెత. కొన్ని సామెతలు చెప్పుట లోకోక్త్యలంకారము.

ఉదా:- 'కొన్ని నెలలు కనులు మూసుకొనుము'

ఇది సామెత. ఇచ్చట కనులు మూసుకొనుమనగా నిజముగా కనులు మూసుకొని గ్రుడ్డివాని కమ్మని అర్థముకాదు. "కొన్ని నెలలు ఓపికపట్టుము" అని చెప్పుటకు బదులుగా ..... సామెతను చెప్పుటచే నిది లోకోక్త్య లంకారము.

(లోకోక్తి = సామెత ; లోకములోని నానుడి)

**13. అర్థాంతర న్యాసము :-** సామాన్యమును విశేషముచేతగాని, విశేషమును సామాన్యము చేతగాని సమర్థించి చెప్పుట అర్థాంతర న్యాసము.

ఉదా:- "హనుమంతుడు సముద్రమును దాటెను.
మహాత్ములకు సాధ్యము కాని పనిగలదా!"

ఇచ్చట హనుమంతుడు సముద్రమును దాటుట ....... విశేషము.

మహాత్ములకు సాధ్యము కాని పని గలదా!.... సామాన్యము. కాని, హనుమంతుడు సామాన్య కోతికాడు. మహాత్ముడు గావున సముద్రమును దాటెను అని విశేషమును సామాన్యముచే సమర్థించి చెప్పుటచే నిది అర్థాంతర న్యాసము.



# చాణక్యుడు

*- కణ్వశ్రీ చంద్రశేఖర శర్మ*

*- కె.యల్.నరసింహరావు*

## 1. బాల్యము :

క్రీస్తుదేవుఁడు పుట్టుటకు మూడువందల ఇరవై యేడేండ్లకుఁ బూర్వము కేరళ రాజ్యమందు సదాచార సంపన్నుఁడును, నిత్య సత్యవ్రతుఁడును, వేదాధ్యయన పరుఁ డును నగు నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతనిపేరు చణకుఁడు. ద్రవిడ కుటుంబమునకుఁ జెందినవాఁడు. అతని కెల్లవిధముల ననుకూలవతియై, మహా సాధ్వియనఁదగు దేవకి భార్యగానుండెను. ఆ పూజ్య దంపతుల పూర్వపుణ్య ఫలముగా నుద్భవించినవాఁడే చరిత్ర ప్రసిద్ధుఁడైన చాణక్యుఁడు. మహా తేజో వంతుఁడుగా నున్న తమ పుత్రున కాదంపతులు తొలుత విష్ణుగుప్తుఁడని నామకరణ మొనర్చిరి. అయినను, వారిది కౌటిల్యగోత్ర మగుటవలనఁగౌటిల్యుఁ డనియు, మాతామహులు శ్రీవత్స గోత్రమునకుఁ జెందిన వారగుటచే ద్రామిళుఁడనియు, చణకుని కుమారుఁడు గనుక చాణక్యుఁడనియు నతనికి నామాంతరములు గలవు.

తన కుమారుఁడు మహా మేధావియని బాల్యమునందే గుర్తించిన తండ్రి వానిని సమర్థులైన గురువుల కడజేర్చి, సమస్త విద్యలు నేర్పించెను. చాణక్యుఁడు, పదమూడేండ్ల ప్రాయము వచ్చుసరికే ఆంధ్ర సంస్కృత భాషలను, తర్క వ్యాకరణాది సర్వశాస్త్రముల నభ్యసించెను. కాని, సరస్వతి కపరావతారముగా వెలసిన తన పుత్రుని యౌవన కౌమార దశలను గనులార దిలకించు భాగ్యము లేనివాడగుటచేఁ జణకుడు తన కుమారుని పదునాల్గవయేటనే మరణించెను. భర్తృమరణమునకే గాక, తెక్కలురాని బిడ్డ భవిష్యత్తును గురించి కూడ, నా తల్లి, దేవకి అమితముగ దుఃఖింపఁ దొడఁగెను. బాలప్రాయమున నున్న వాడయ్యు, చాణక్యుఁ డనేక ధైర్య వచనములతోఁ దల్లిగారి కూరటఁ గలిగించి, ఆమెతో మఱి కొన్నాళ్ళకు జన్మస్థలము వీడెను. ఇతర విద్యల

నభ్యసించుటకై కాశికి పోయి చేరెను. ఆరేండ్లచట వేదాధ్యయనమునందు గడపెను. ఆ తరువాత తక్షశిలా నగరమున మఱి యా రేండ్లుండి ఆయుర్వేదము, రాజనీతి, అర్థశాస్త్రము మొదలగు సకల విద్యలయందు పరిపూర్ణ పాండిత్యమును సంపాదించి, రాజాస్థానమున ప్రధాన పండితుఁడాయెను. కాని, కొలదికాలమునకే యా ప్రభువు నడవడియందు చాణక్యున కేవగింపు కలిగినది. ఆ కాలమున గ్రీకు పరిపాలకుఁడైన 'ఆలీసాందరు' (అలగ్జాండరు) ఈ యఖండ భూమండలము నెల్ల నేకచ్ఛత్రము క్రిందికిఁ దెచ్చి, తాను పాలకుఁడు కావలెనన్న దృఢ సంకల్పముతో అపార సైనికబలములను సేకరించుకొని జైత్రయాత్రలు ప్రారంభించెను. తాను జయించిన పారసీకము, అరేబియా మొదలైన రాజ్యము లన్నింటిలోఁ దన ప్రతినిధుల నుంచి, విజయపతాకముల నెగుర వేయుచు, క్రమముగా హిందూకుశ పర్వతములు దాటి, భరతఖండముపై దాడిసలుప నుంకించుచుండెను. నానా దేశాధీశులకుఁ గప్పములు గట్టవలసినదిగ ఆజ్ఞా పత్రములు పంపించెను. లొంగనివారు దండింపఁ బడుదురని చాటింపించెను. మున్ముందు, తక్షశిలా పతియైన అంభి, అలగ్జాండరు వంటి మహా బలవంతునితోఁ దాను పోరి అపజయమునందుటకంటె, నాతఁడు విధించిన కప్పముఁ గట్టి సంధి చేసుకొనుటయే యుక్తమని నిశ్చయించెను.

స్వదేశము యవనుల పాలగుట కంగీకరింపని చాణక్యుఁడు, మహారాజున కనేక రీతులఁజెప్పి వారింపఁజూచెను. కాని, యుద్ధమునకు వెనుకంజ వేయుచున్న తక్షశిలాపతి చాణక్యుని హితవాక్కులను బెడచెవినిబెట్టి ఆత్మ గౌరవమును, దేశక్షేమమును విడనాడి, విశేష ధన కనక వస్తు వాహనము లర్పించి, అలగ్జాండరునకు లొంగిపోయెను. ఆత్మగౌరవమే ప్రధాన లక్ష్యముగాఁ గల చాణక్యుఁడు, తక్షశిలాపతి తన హితవు వినలేదన్న యహంకారముతో, అప్పటికి తాను రచించిన అర్థశాస్త్రమును సయితమ మా మహారాజునకు సమర్పింపక, తా నారాజ్యమును వీడిపోయెను.

అర్హుడయిన ఏ మహారాజునకు తన యుత్కృష్ట శాస్త్రగ్రంథమును సమర్పించిన, దానికి సద్వినియోగము కలుగునన్న యాశయముతో చాణక్యుఁడందందు దిరుగుచు, మఱి కొన్నాళ్ళకు కాశీపట్టణమునకే వచ్చి చేరుకొనియెను. వారణాసి పండితులకుఁ బుట్టినిల్లు. చదువుల కల్పవల్లి శారదాదేవి కది పీఠము. కావున, చాణక్య పండితుని యద్భుత శక్తి సామర్థ్యములను, శాస్త్రపరిజ్ఞానమును అనేకులు గుర్తించి, యాతనికి శిష్యులయిరి. అట్లేర్పడిన చాణక్యుని శిష్యకోటిలో ఇందుశర్మ, సిద్ధార్థకుఁడు, నిపుణకుఁడు అను మువ్వురును ముఖ్యులు.

చాణక్యుఁడు కాశీపట్టణమున నివసించుచుండగా, నొకనాడు తల్లియైన దేవకి తనబిడ్డ యెంతకును ఇల్లు చేరక పోవుటను గురించి దిగులందుచు, వాకిట వేచియుండెను. అంతలో నిందుశర్మ యామె కడు కరుదెంచి

"అమ్మా! ఈనాటి రాజసభలోఁ బండితగోష్ఠి యొకటి జరుగుచున్నది. నేల నాలుగు చెఱగులనుండి వేంచేసిన దిగ్గజములవంటి పండితులనేకు లా గోష్ఠియందు బాల్గొనుచున్నారు. మన గురువులవారు కూడ నావాదనయందు బాల్గొన ను త్సాహులైయున్నారు. గెలుపొందిన వారికిఁ గనకాభిషేకమట! పట్టణమున నేనుఁగుపై బ్రహ్మాండమైన యూరేగింపట! వింటిరా?" అనుచుండ, నాయమ్మ-

"అయ్యో! నాయనా పసివాఁడు! మావాడంత పెద్ద పండితులతో వాదించ గలడా?" అని యడిగిన ప్రశ్నకు చాణక్య శిష్యుఁడు నవ్వి తిరిగి యిట్లు పలికెను-

"అమ్మా! మీ కుమారుని శక్తి సామర్థ్యములు మీకు తెలియవు గాబోలు! తక్షశిలలో నున్నప్పుడు మా గురువు లెందరు పండితమల్లుల నోడించలేదు! ఎన్ని సభలలో ఘనసత్కారము లందలేదు! కాశీవిశ్వనాథుని యను గ్రహ మున్నయెడల, ఈనాటి సభలోఁగూడ మా గురువులదే పైచేయి కాగలదు. ఈ వార్తను తెలుపుటకే నన్నాయన మీ కడకుఁ బంపెను."

అని శిష్యుఁడింకను గురువుల ప్రతిభను గూర్చి ముచ్చటించు చుండునంతలో, మంగళ వాద్యముల మ్రోతయు, ప్రజల కోలాహల ధ్వనులును వినిపించగా, శిష్యుఁ డాశ్చర్య సంభ్రమములతో నటు తిలకించి-

"అరుగోనమ్మా! మా గురువులే! సభలో దిగ్విజయమంది ఊరేగింపులతో తరలి వేంచేయుచున్నారు. వీధుల నిండ జనము తండోప తండములుగ నున్నారు. వైతాళికులిరువంకల శ్రీ గురూత్తముల కీర్తిని గానము చేయుచున్నారు. అదిగోనమ్మా! అటు చూడుడు! ఆ ప్రజల కోలాహల ధ్వనులు వినుడు!"

అని, సంతోష ముట్టిపడ బలుకుచున్న శిష్య వచనముల నాలకించి, దేవకి బ్రహ్మానంద పరవశయై పరువు లిడిపోయి, యా పుత్రోత్సవమును నేత్రోత్సవముగఁ దిలకించుచు-

"నాబిడ్డ, ఇంతటి ప్రజ్ఞావంతుఁ డెప్పుడయ్యెనో కదా! మావా డిందరిలో నింతటి ఘన సత్కారమును బొందుచుండ గనులారఁ గాంచగలుగు భాగ్యము నా కబ్బినది-

ఇంకేమి కావలయును!'' అనుచు, నానంద బాష్పములు రాల్చెను. శిష్యునితో గలసి యామెగూడ నా యూరేగింపులోఁ బాల్గొనఁబోయెను. మఱికొంత తడవున కూరేగింపు ముగియగాఁ జాణక్యుఁడు తన మిత్ర శిష్యకోటులతో నిల్లుసేరెను. దేవకి పుత్రునకు దిగదుడుపులు పెట్టి, హారతులిచ్చి లోనఁ బ్రవేశపెట్టెను. చాణక్యుఁడు తాను పండిత సభలో గెలుచుకున్న సరిగంచుల దుశ్శాలువలను, అమూల్య మణిహారములను మాతృదేవికిఁ జూపి, యామె నానందసాగర తరంగముల నోలలాడించెను.

"అమ్మా! నా యఖండ విజయము లన్నిటికిని బవిత్రురాలైన మాతృదేవి యాశీర్వచనమే కారణము. ఆ బలమువలన నే నిప్పుడొక క్రొత్త కార్యమును దలపెట్టితిని. అందులకు దల్లిగారి యనుమతియు, నాశీర్వాదమును గావలయు,'' ననియెను.

"నాయనా! మాతృదేవతయెడల నెవరు భక్తి విశ్వాసములు కలిగియుందురో, వారికి సర్వ శుభములుఁ గలుగును. నీకు జయమగు గాక! తలఁచిన కార్యమును వివరింపుము.''

"ఈనాటి సభకు పాటలీపుత్రము నుండి కూడఁ గొందరు పండితు లరుదెంచినారు. ఆ రాజ్యము నేలు నందరాజులు గోబ్రాహ్మణులయందు భక్తిగలవారనియు, నా రాజ్యము లక్ష్మీ సరస్వతులకు నిలయమై యష్టైశ్వర్యములతోఁ దులఁదూగు చున్నదనియు, నేను రచించిన అర్థశాస్త్రము నా మగధ సార్వభౌములు తప్పక గౌరవింతురనియు వచ్చిన పండితులవలనఁ దెలిసికొంటిని. నేను రచించిన శాస్త్రగ్రంథమునకు సద్వినియోగము గలుగుట ముఖ్యావసరము. కనుక నేను రేపే బయలుదేరిపోయి, యచటి స్థితిగతులను బరిశీలించి వచ్చెదను.''

"నేను కాదనను - కాని, నీవు మఱల నెప్పటికి దిరిగి వచ్చెదవో! అంతదనుక నిన్నెడబాసియుండుట కష్టసాధ్యము. ఏబదేండ్లకుఁ బైఁబడిన దానను. ఇట్టి తఱిఁ బుత్ర సాన్నిధ్యమున నుండుటయే నాకు శ్రేయోదాయకము.''

"కాశీవిశ్వేశ్వర సాన్నిధ్య మంతకంటెను మంచిది కాదా తల్లీ! అట్లని నే నుపేక్షఁ జేయునది లేదు. అచిరకాలములోనే తిరిగి వచ్చెదను. ఆలోపున నీవెప్పుడు నా సాన్నిధ్యమును సంకల్పింతువో, ఆ వెనువెంటనే నేను వచ్చి నీ చెంత నుండగలను. కార్యార్థమై పోవుట కనుజ్ఞనిమ్ము.''

అను పుత్రుఁ డనేకరీతులఁ దల్లిగారికి నచ్చఁజెప్పి, యామె యనుమతిఁ బొంది, యా మఱునాడే పాటలీ పుత్రమునకుఁ బయనమయ్యెను.

## 2. పరిచయము :

అఖండ మగధ సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణమైన పాటలీపుత్రముఁ బ్రవేశించిన చాణక్యుఁ డది యపర దేవేంద్ర పురమువలె నత్యంత శోభాయమానమై విలసిల్లుచుండుట దిలకించి, యందందు గల విశేషములకు మనమున నెంతయు నబ్బురపడుచుఁ, దనకు తెలియని విషయముల నక్కడివారి నడిగి తెలిసికొనుచు, ఆ నగర వైభవములకు పాలకుల యేర్పాటులకు నెంతేని మురియుచుండెను.

అరువదినాలుగు ద్వారములు గల యా మహా నగరము డెబ్బది బురుజులతో సర్వ శోభాయమానమై కళ కళలాడుచున్నది. ఈ నగరమున కీశాన్యదిక్కునఁ గొంత దూరములో గంగానది ప్రవహించుట గాననగును. చాణక్యుడు పోవుచున్న యా మార్గమున కిరువైపులను దర్భలు దట్టముగా బెరిగి, కొంత మఱుఁగును కల్పించుచున్నవి. అప్పటికే కొంచె మెండచుఱుకు తగులుచున్నందున ఆయన నడకకు చుఱుకుపాలు గొంచెము హెచ్చించి, వడి వడిగా పోవుచుండెను. ఆ సమయమున కాలి కొక దర్భముల్లు గుచ్చుకొనగా, నాతఁడు గ్రుడ్లెఱ్ఱజేసి నేలవైపు తీక్షణముగా దిలకించెను. తనకు గ్రుచ్చుకొనిన దర్భను సమూలముగా పెఱికి-

"ఓసీ! తృణాధమా! నీవొక పనికిమాలిన దానవై యుండియు, నా దేహమునకు బాధకలిగించితివి గాన నిన్నిప్పుడే నాశనము చేయుదును. నీ మూలమున నిక ముం దితరుల కెవరికినిఁ గూడ హాని రాకుండ జేసితీరుదును."

అని క్రోధోద్రేకమున బిగ్గరగ పలుకుచున్నప్పుడా మాటలు ప్రక్కమార్గము ననుసరించి పోవుచున్న ఒక యువకునికి వినిపించెను. అతఁ డాశ్చర్యముతో పొంచి నిలచి చూడగా, విభూది రేఖలతో ముఖమున బ్రహ్మతేజస్సు తాండవింప నొక మహా పండితునివలె నున్న వాఁడు చేయుచున్న వింత చేష్ట గానంబడెను. భూమినుండి త్రవ్వి పెఱికిన దర్భ నంతటితో వదలక, దానిని గాల్చి భస్మముచేసి నీటిలో కలుపుకొని త్రాగుచున్న సంగతిని గనిపెట్టిన మార్గస్థుడు తనలో ఏమనుకొనియెనో, వెంటనే చాణక్యున కెదురుగా వచ్చి నమస్కరించి నిలుచుండెను. నూగు మీసములతో నిగ నిగలాడుచు, సుమా రిరువదేండ్ల నవయౌవన విలసితుడు - రూపందిన మన్మథునివలె నుండి, పరాక్రమ ముట్టిపడుచు దృఢకాయుఁడై యొక పలుచని నిలువుటంగీనిఁ

దొడిగి, సరిగంచుల శాలువను ధరించి, కట్టెదుట సాక్షాత్కరించి తనకు నమస్కరించిన యువకుని చాణక్యుఁ డొక పరితీక్ష్ణముగాఁ దిలకించి-

"ఎవరు నీవు? నాతో నేమి పని కలిగినది?" అని ప్రశ్నించెను.

"తమ చేష్టలను మార్గమున పోవుచు పొంచియుండి తిలకించితిని. రూపు రేఖలను బట్టి వేద వేదాంగములను జీర్ణించుకొనిన మహా పండితోత్తములవలె నున్నారు. కాని, మీ చేష్టలు నా కర్థమగుటలేదు. నిర్జీవమైన ఒక దర్భను భూమినుండి పెఱికి, కాల్చి యా బూడిదను నీటిలో గలిపి త్రాగుట యేల? అయ్యది యొక ఔషధియై యుండనోపునా?"

అని యువకుఁ డడిగినదానికి చాణక్యుఁడు బదులు చెప్పుచుండెను.

"పవిత్ర గంగాజలముల స్నానసంధ్యాదు లొనర్చుకొని, నా మార్గమున నేను బోవుచుండ, నీ దర్భ నా కాలికి గ్రుచ్చుకొని శరీరబాధను కలిగించినది. దీని పొగరణచవలెనని కాల్చి భస్మముచేసి మ్రింగితిని. ఈ శత్రు సంహారమువలన నా మనస్సుకు శాంతి కలిగినది కనుక, నిది ఔషధమని కూడ ననవచ్చును."

"స్వామీ! జడపదార్థమైన యా ముల్లు తమ చేష్టనెట్లు గ్రహింపఁగలదు?"

"అదియేమి కానిమ్ము! దానివలన నా కవమానము, శరీరమునకు బాధయుఁ గలిగినవి. మనస్తాపము కలిగినపుడెదుటివారిని క్షమించుట ధీరలక్షణము కానేరదు. ప్రతీకారమే యీ చాణక్యుని దీక్షావ్రతము-"

చాణక్యుని పేరు వినినంతనే, యువకుఁ డదరిపడి మరింత భక్తి గౌరవములతో దిరిగి నమస్కరించి యిట్లనియెను.

"మహాత్మా! మీ దర్శన భాగ్యమువలన నీనాడు నా జన్మ పావనమైనది! మా నాయనగారు చెప్పుచుండగా మీ ఖ్యాతిని వింటినే గాని, స్వయముగా దర్శించలేదు. తమరు మహామేధావులనియు, నీతికోవిదులనియు, ఘటనా ఘటన సమర్థులనియు వింటిని. ఈనాడు దైవవశమున మిమ్ము దర్శించుట మహాభాగ్యము! అయిన, నాకొక్క సందేహము-"

"అడుగవచ్చును."

"మీకిప్పు డపచారమొనర్చిన దొక అల్పమైన తృణమాత్రము కనుక, మీ రద్దాని

నవలీలగ నిర్మూలించి, పగసాధింపగలిగితిరి. ఆ శత్రువే మహాబలవంతుఁడైన నేమి చేయుదురు?"

"పిచ్చివాఁడా! ఈ చాణక్యుని ప్రతిభ నీకుఁ బూర్తిగాఁ దెలియనట్లున్నది. బల వంతుఁడే గాదు - నా శత్రువు ఫాలాక్షుడైనను నేను లెక్కచేయను. నా సర్వశక్తులు వినియోగించి, ఆ శత్రువును నాశనము గావించు నందాక నిద్దురఁబోను. ధర్మముకొరకు, న్యాయముకొరకు బ్రాణము లర్పింతును."

"న్యాయధర్మము లీ కలియుగమున నింకను గలవనియే నమ్ముచుంటిరా?"

"ఎందుకు లేవు! వానిబల మెన్నటికిని తగ్గదు. ధర్మపరుని ధర్మమే రక్షించి తీరును. ఇంతకును సర్వలక్షణ లక్షితుఁడవైన నీవెవరవో తెలుపవేమి?"

"నందరాజుల కొలువులో నేనొక యుద్యోగిని."

"ఓహో! యట్లనా! ఆడఁబోయిన తీర్థ మెదురైనట్లున్నది. సమారాధ నాధికారియైన వృషలుఁడెందుండునో చెప్పగలవా?"

"నందరాజుల బ్రాహ్మణ సమారాధనకుఁ దమరిప్పుడు పోనుంటిరా?"

"అంతియే గాదు. నే నా ప్రభువులను దర్శింపవలయును."

"ఆ కార్యముఁ గూడ నేను వినవచ్చునా స్వామీ!"

"ఎందుకు వినఁగూడదు !"

"నేనిప్పుడు కాశినుండి కార్యార్థినై వచ్చినవాఁడను. అదేమందువేని - లోకోపకారార్థమై నేనొక యర్థ శాస్త్రమను నుత్కృష్ట గ్రంథమును రచించితిని.నా యర్థ శాస్త్రమును స్వీకరించి సద్వినియోగము జేయఁగల యర్హుఁ డెవరాయని వెదకుచుండఁ గా, నీ మగధ సామ్రాజ్య మందుకుఁ దగినదనియు, నీ నందరాజులు, బ్రాహ్మణ భక్తిగల వారనియు, నిట పాణిని, వరరుచులవంటి శాస్త్రకర్త లాదరింప బడు చున్నారనియుఁ దెలిసి, నా శాస్త్ర గ్రంథము నీ సార్వభౌములకు సమర్పింప వలయునని తెచ్చితిని."

"మంచిది స్వామీ! వేదశాస్త్ర పారంగతులయిన తమ రిట నడుగు మోపుటచే నీ మగధభూమి మరింత పుణ్యముఁ జేసుకొన్నది. తమరు వెదకుచున్న ధర్మాధికారి

యా వృషలుఁడను నేనే యని తెలుపుకొనుటకు సంతోషపడుచుంటిని. నన్ను చంద్రగుప్తుఁ డందురు."

ఆ మాట వినినంతనే, చాణక్యుఁడు క్షణకాలము స్తంభీకృతుఁడై వెనువెంటనే చంద్రగుప్తు నాప్యాయముతోఁ గౌఁగలించి-

"మౌర్యవంశ రాకాసుధాకరుఁడవు, ధీరోదాత్తుఁడవు, ఆ చంద్రగుప్తుఁడవు నీవా నాయనా! శూద్రకుఁడవని యవమానించితిని; నా తప్పు క్షమింపుము."

"తమరు పెద్దలు - అట్లనఁగూడదు. నేను సదా తమ యనుగ్రహమును మాత్రమే కోరుచుంటిని."

"పృథ్వీపతివి కాఁగల శుభలక్షణములు నీ ముఖమున తాండవించు చున్నవి. నా సత్యవాక్కు వృథా కానేరదు. నీ వృత్తాంతమేమి?"

"స్వామీ! నా వృత్తాంతమును సావధానముగా మనవి జేసికొందును. భోజనకాల మతిక్రమించు చున్నది. ఈనాఁడు మా తండ్రిగారి శ్రాద్ధ మగుటచే, నా కొలువును మఱియొకరి కొప్పగించి, ముందుగనే యింటికిఁ బోవుచుంటిని. నేనిప్పుడే తమ్ము రాజప్రసాదమునకుఁ గొనిపోయి, నాకు బదులుగా నచట నుండువానికి తమ్ముఁ బరిచయముచేసి యేర్పాటులు గావించిపోదును. తమరు పండిత సమారాధనలో నగ్రస్థానము నలంకరించి భుజింపవచ్చును. నందరాజులను దర్శింపఁగలరు."

"మంచిది. అట్లే చేయుము."

అను నుడివి, చాణక్యుఁడు చంద్రగుప్తు ననుసరించి రాజగృహాభిముఖముగాఁ జనియెను.

## 3. చాణక్యుని ప్రతిజ్ఞ :

దేవేంద్ర వైభవములతో నిండియున్న రాజభవనముఁ దిలకించి చాణక్యుఁ డబ్బురపడెను. అయిదంతస్తులు గల యాప్రాసాదము సువిశాలములగు ప్రాంగణముల తోడను, విరామములేక వచ్చుచుఁ బోవుచు నుండు దాసదాసీ జనంబుల తోడను, నానావిధ శృంగారములతోడను నిత్యకళ్యాణముగా నలరారుచుండెను.

ఆ రాజ భవనమున కానుకొనియే ధర్మశాల యున్నది. ఆ ధర్మశాల యందు

ప్రతిదినమును వందలాది బ్రాహ్మణ పండితులకు షడ్రసోపేతముగా సమారాధన జరుపఁ బడుచుండును. చంద్రగుప్తుఁ డాధర్మాధికారి పదవిలో నుండి, యా కార్యక్రమమును జరిగించుచుండవలెను. ఇది నందరాజుల యేర్పాటు.

ఆనాఁడు చాణక్య పండితునివెంట నిడుకొని వచ్చిన చంద్రగుప్తుఁడు తన యాంతరంగికుఁడగు భాగీరథునికిఁ బిలచి, యతనికేమో యాజ్ఞాపించి, చాణక్యునితో - "అయ్యా యీతఁడు తమ్ము లోనఁ బ్రవేశపెట్టఁ గలడు. భోజనానంతరము తమరు వానితోవచ్చి, మా గృహముఁ గూడఁ బావనము జేయఁగలరు-"

అని నుడివి, వారు లోనికిఁబోయిన తరువాత తాను స్వగృహాభిముఖుఁడై చనియెను.

చాణక్యుఁడు మహావైభవోపేతముగా నున్న భోజనశాలయందుఁ బ్రవేశించి, యచ్చోట బంగారు పాత్రములనమర్చి తూర్పుముఖముగా వేయఁబడియున్న తొమ్మిదియాకులును, బడమటి ముఖముగా వెండి పళ్ళెరములతో నమర్చఁబడియున్న మఱియొక యాకును బ్రత్యేకింపఁబడి యుండుటను, ఇంక ననేకములుగా నున్న వెండి పళ్ళెరములను దిలకించెను. అం దేవేవి యెవరెవరికని చాణక్యుండక్కడి యధికారి నొకని నడుగఁగా-

"ఈ తొమ్మిది ప్రత్యేక స్థానములును బ్రభువులయిన నవనందులకు. వాని కెదురుగా నున్న యాసనము పండిత స్థానము. మిగిలిన వేయి స్థానములును బ్రాహ్మణ సముదాయమునకు. తమ రా సముదాయములోఁ గూర్చుండవచ్చును," అని యతఁడు చెప్పెను.

"నేను పండితుఁడను గనుక నీ యగ్రస్థానమునఁ గూర్చుండవలె," ననుచుఁ చాణక్యుఁ డా ప్రత్యేక స్థానమునకుఁ బోయి కూర్చొనఁగా నచటి యుద్యోగులును, బ్రాహ్మణకోటియు నా క్రొత్త బ్రాహ్మణుని సాహసమున కచ్చెరువందిరి. అంతట మఱియొక యున్నతోద్యోగి వడివడిగా వచ్చి-

"అయ్యా! తమ రా ప్రత్యేక స్థానమునఁ గూర్చుండఁ గూడదు. నందరాజులు రాకమునుపే లేచి, యా బ్రాహ్మణ సముదాయమునఁ గూర్చుండుఁడు," అని కఠినముగాఁ జెప్పెను.

"ఈ యగ్రస్థాన మెవరికి?" చాణక్యుఁడు తీక్షణముగా నడిగెను.

"అట మహాపండితులయిన సుబంధులవారు కూర్చుందురు."

"అతఁడు నన్ను మించిన పండితుఁడని తెలిసినప్పుడు నే నిచటినుండి తప్పక లేచిపోయి సముదాయములోఁ గూర్చుందును. అంతవఱకు లేవను."

అని చాణక్యుఁడు ఖండితముగాఁ జెప్పినదానిని విని, యుద్యోగులందఱు నేకగ్రీవముగా, నది సాహస కార్యమనియుఁ, బ్రమాద కారణమనియుఁ బెక్కురీతుల నచ్చఁజెప్పిరి. కాని, చాణక్యుఁడు భీష్మించి, కూర్చుండిన యగ్రస్థానమునుండి లేవఁ డయ్యెను. అంతలో నందరాజులు వైభవ దర్పములు ప్రకటితము లగుచుండ, పాణిని, సుబంధు, వరరుచి, రాక్షసామాత్య పరివారసమేతులై భోజనశాల కరుదెంచి, యగ్రస్థానమునఁ గూర్చుండియున్న చాణక్యుని గాంచి కోపోద్దీపితు లైరి. ఉద్యోగుల వైపెట్టిగాఁ జూచిరి.

"ప్రభూ! ఎంతజెప్పి వినక యీ మొండి బ్రాహ్మణుఁడు మా మాటలు ధిక్కరించి యగ్రస్థానము నాక్రమించి లేవఁడయ్యె!" నని బద్ధహస్తులై యుద్యోగులు పలుక, మహారాజయిన సుకల్పుఁడు చాణక్యునిఁ జురచురఁ జూచి-

"మీసమయిన సరిగా రాని యల్పవయస్కుఁడవై యుండియు నగ్రపీఠ మలంకరింప సాహసించిన నీ వెవరవు? వెంటనే దిగు!" మని గద్దించి పలికెను.

"నేను చాణక్యుఁ డను విష్ణుగుప్తుఁడను. తక్షశిల, కాశి మొదలయిన పెక్కు తావులయందుఁ బండిత పరిషత్తులలో విజయములందిన యుద్దండ పండితుఁడను!" అని పలికిన బ్రాహ్మణుని మాటలు విని-

"కావచ్చును; కాని, తమ రీ యగ్రస్థానము నుండి లేచి సముదాయములోఁ గూర్చొనుఁడు," అని మహారాజు తిరిగి పలికెను.

"మహారాజా! నేను తమ యేర్పాటునకు భిన్నముగా నేమియు జరిగించలేదు. పండితశ్రేష్ఠుని కొఱ కేర్పఱుపఁ బడిన యగ్రస్థానమున నేను గూర్చుంటిని. ఇట నన్ను మించిన పండితు లెవరున్నారు?"

"ఉన్నారు."

"ఎవరు ప్రభూ?"

"ఇరుగో! ఈ సుబంధులవారు."

సుబంధులవా రప్పటికే నాలుగడుగులు వెనుకకుఁ దగ్గి, మౌనముగా నిలుచుండిరి.

"సంతోషము. ఏ శాస్త్రములో వారు నా కంటె ఘనులో ఋజువుపడిన తరువాత, నేనీ యగ్రస్థానమును వారికి సమర్పించి తప్పక లేచి పోవుదును.''

"ఇది భోజనశాల గాని, పండితసభ గాదు! వితండవాదములు మాని తక్షణ మా యగ్రపీఠము నుండి లేచి రమ్ము!''

అని మహారాజు క్రోధముతోఁ బలికినదానికిఁ జాణక్యుఁడు జంకక-

"తరతమ భేదములు గుర్తించక తమ రీ విధముగా నాజ్ఞాపించుట యధర్మము! ధర్మోద్ధారణ చేయవలసిన ధరాపాలకులే యిట్టి యధర్మాచరణ కుపక్రమించినపు డిఁక మాబోంట్లము సహించము.''

"సహించక నువ్వు చేయఁగల దేమిటయ్యా! ఇది రాజాజ్ఞ ! ధిక్కరించినచోఁ దగినట్లు బుద్ధిఁ జెప్పవలసియుండును. ముందా పీఠమును దిగుము.''

అందులకు జాణక్యుడు నవ్వి "అధర్మాచరణను ఖండించుట నా మతము. నన్ను మించిన పండితుఁ డిచటఁ గలఁ డను విషయము దేలువఱకు నే నీ యగ్ర స్థానము దిగుటకు వీలుకాదు.''

అని దృఢనిశ్చయముతో ననఁగా, నందరాజు లందఱి ముఖములును గ్రోధముతో నెఱ్ఱగా జేవురించినవి. అప్పుడచట నెట్టి ప్రళయము జరుగునో యని యెల్లరును భయకంపితులయిరి. మహారాజు వెంటనే భటులను రావించి-

"రాజాజ్ఞను ధిక్కరించుచున్న యీ మొండిబాపని వెంటనే బయటికి గెంటుఁ డు!'' అని యాజ్ఞాపించెను. ఆ రాజాజ్ఞతో భోజనశాల దద్దరిల్లెను. అమాత్యాదులు మౌనముద్రలు వహించిరి. వెంటనే కొందఱు భటులు చాణక్యుని రెక్కలు పట్టి లాగి పీఠమునుండి దించి గెంటుచుండఁగా, నాతని సిగముడి వీడి, కురులు జీరాడినవి. ధరించిన వస్త్రము జారుచుండఁగా నాయన యద్దాని నొకచేతఁ బట్టుకొని రోష భీషణములతోఁ గళ్ళెఱ్ఱజేసి—

"నందరాజుల వినాశనమున కిది నాంది! నన్నింతగా నవమానించి, యధర్మ మొనర్చిన యీ నవనందులను నాశనమొనర్చి గాని, యిప్పుడు వీడిన యీ సిగను

ముడివేయను. ఈ చాణక్యుని భీషణ ప్రతిజ్ఞతో నంద నాశనము, ధర్మ సంస్థాపనము జరుగుఁగాక!''

అని భూనభోంతరాళములు దద్దరిల్లునట్లు పలికి యా బ్రాహ్మణుఁడు రోషావిష్టుఁడై భోజనశాలను వీడి వెడలి పోయెను. తరువాత మఱికొన్ని క్షణములవఱకు నెవరినోటఁ గాని యొక్క పలుకయిన వెలువడలేదు. అంతటను గంభీరమైన నిశ్శబ్దమే యలముకొన్నది.

ఇక్కడి సమాచారము నప్పటికప్పుడే చారునివలనఁ దెలిసికొనిన చంద్రగుప్తుఁడు తా నూహించిన యట్లే జరిగినందులకు మనమున సంతసించి, యా బ్రాహ్మణుని వలననే తన యాశయము నెఱవేఱఁగలదని విశ్వసించెను. భాగీరథుని వెంటఁ దన యింటికే వచ్చుచున్న చాణక్యుని గుర్తించి, యెదురేగి భక్తి గౌరవములతోఁ దోడ్తెచ్చి యుచితాసనాసీనునిఁ జేసి—

"స్వామీ! భుజించితిరా? నందరాజులను దర్శించితిరా?'' అని, తెలిసియుఁ దెలియనివానియట్లు ప్రశ్నించఁగాఁ జాణక్యుఁ డచట జరిగినదంతయు వివరించెను. అందులకుఁ జంద్రగుప్తుఁ డెంతయు నొచ్చుకొని-

"అయ్యో! స్వామీ! ఎంత యపచారము జరిగినది! తమబోటి వేద పండితులు, సర్వశాస్త్ర నిధులు నిలువెత్తు ధనము గుమ్మరించిన నతిథులు గాఁగలరా! మూర్ఖులైన నా సోదరుల కాపాటి యింగితము లేకపోయినది-'' అని పలుకఁ జాణక్యు! డచ్చెరువంది—

"నీవు నందులకు దాయాదివా? అదియెట్లు?'' అని ప్రశ్నించెను.

"స్వామీ! నా దీనచరిత్రను సావధానముగా వివరింతునని తమ కీవఱకే మనవి చేసికొంటిని. అపరాహ్ణము తిరిగి పోయినది. తమ రింకను భుజింపలేదు. పితృ కార్యమును ముగించుకొంటిని కాని, నేనుగూడ నింకను భుజింపలేదు. ఇటఁగూడ శ్రోత్రియులయిన బ్రాహ్మణులే వంట చేయుదురు. తమరు ముందు భుజించినఁ గాని నేను భుజింపను. నన్ననుగ్రహించి నా యాతిథ్యమును స్వీకరింపుఁడు.''

అని చంద్రగుప్తుఁడు బెక్కురీతులఁ బ్రార్థింపఁగా-

"నందనాశనము, ఈ మగధ సింహాసనమునఁ జంద్రగుప్తునకుఁ బట్టాభిషేకము జరుగునందాఁక చాణక్యునకు నిద్రాహారములతోఁ బనిలేదు,'' అని చాణక్యుఁ డనెను.

"తమ రంతటి ప్రతిభావంతులే యగుదురు. కాని, శరీర పోషణ కాహార నిద్రాదు లావశ్యకములు గదా! తమకుఁ దెలియని విషయము లేముండును! వెంటనే భోజనమునకు దయచేయుఁడు."

అని చంద్రగుప్తుఁ డాయన నంగీకరింపఁజేసి, యనంతరము తానును భుజించి యిరువురు సావధానులై యున్నప్పుడాయనకుఁ దన పూర్వగాథ నీ విధముగా వివరించెను—

## 4. పూర్వగాథ :

"ఈ యఖండ భూవలయంబున జగద్విఖ్యాతమైన మగధసామ్రాజ్యము నొకప్పుడు సర్వార్థసిద్ధి యను ధరణీశుఁడు పరిపాలించెను. ఇప్పుడుండిన రాక్షస మహామంత్రియే యా రేని తరమునుండియుఁ బ్రధానియై, తన ప్రజ్ఞా బలములచే రాజ్యమును సురక్షితముఁ జేయుచుండెను. సర్వార్థసిద్ధి మహారాజునకు సుక్షత్రియ కులజయగు సునందాదేవి యొక భార్యగను, ముర యను శూద్రకాంత రెండవ భార్యగను నుండిరి. ఆ రేఁ డిరువురు భార్యలవల్లను సంతులేక చిరకాలము గుందెను.

కొన్నాళ్ళకొక బ్రాహ్మణుఁ డా మహారాజున కతిథిగా వచ్చెను. రాజు తన భార్య లిరువురితోడను బ్రాహ్మణునకు భక్తి శ్రద్ధలతోఁ బూజలుచేసి సేవించి, ఆయన పాదోదకమును దన యిద్దఱు భార్యల శిరస్సుల యందుఁజల్లెను. ఆ సమయమున ముర శిరస్సునం దొక జల బిందువును, సునందాదేవి శిరస్సునఁ దొమ్మిది బిందు వులును రాలెను. త్రికాలవేది యగు నా బ్రాహ్మణుఁడు మహారాజు యొక్క భవిష్యత్తును గ్రహించి—

"ప్రభూ! మీరిఁక సంతులేమికిఁ గుందవలసినది లేదు. భార్య లిరువురివలనను మీకీ కొఱఁత తీఱఁగలదు-" అని నుడివి వెడలిపోయెను. సునందాదేవి యా మాటల యందు నమ్మికలేక యనాదరణఁ జూపెను. ముర బ్రాహ్మణ వాక్కునందు విశ్వాసముంచి భక్తి గౌరవములతో నెదురు చూచుచుండెను. దాన మున్ముందుగా ముర గర్భవతియై, నవమాసములును దాఁటిన యనంతర మొక శుభ ముహూర్తమునఁ బుత్రసంతానమును గనెను. మహారాజు మహానందముతోఁ బుట్టిన బిడ్డకు జాతకర్మాదికర్మలు జరిగించి, దానధర్మములు, వేడుకలు విరివిగా నొనర్చెను. మురయందు గలిగిన వాఁడగుటచే నా బిడ్డ మౌర్యుఁడని పిలువఁబడెను.

తనకు లేని సంతానయోగము సవతికిఁ గలిగెనన్న యసూయతోఁ గుందుచున్న సునందాదేవికి మఱి కొన్నాళ్ళకు తొమ్మండుగురు శిశువు లుద్భవించిరఁట. వారే నవనందులు.

మహారాజు మురసంతానమునకును, సునందాదేవి పుత్రులకును గూడ అస్త్రశస్త్రాది సకలవిద్యలు నేర్పించి, క్రమముగా బ్రాజ్ఞులఁ జేసెను. అప్పటి కా మహారాజునకు వృద్ధాప్య మాసన్నమగుటచే, నందులకు రాజ్యపాలనా భారము నప్పగించి, మౌర్యునికి దండనాయక పదవి నొసఁగి తాను మునివృత్తిఁ గైకొనెను.

నవనందు లేడాది కొక్కరుగా మహారాజ పదవితో సింహాసన మధిష్ఠించి, ధరాపాలనము సేయుచుండిరి.

## 5. పరారి :

నందులతని తండ్రి తాతల కిచ్చిన దళవాయి యుద్యోగమునే చంద్రగుప్తునికిఁ గూడ నిచ్చిరి. అదికూడ నొకందులకు మంచిదేయనుకొని చంద్రగుప్తుఁ డా యుద్యోగమునే చేయుచుండెను. చంద్రగుప్తుని ధైర్య సాహసముల నెఱిఁగియున్న నంద సైన్యము లాతఁడు తమకు నాయకుఁడుగా వచ్చినందులకెంతేని సంతోషించి, వానిని దేవునిగా నెంచి కొలువుజొచ్చిరి. క్రమముగాఁ బ్రజల యాదరాభిమానములు చంద్రగుప్తునియం దెక్కువగుచుండుటను గుర్తించి, నందులసూయా పూరితు లగుచుండిరి. ఇటు సైన్యములకు, అటు ప్రజలకుఁ జంద్రగుప్తుడు తలలో నాలుకయై గౌరవ పాత్రుఁడగుటను వారు సహించలేక పోయిరి. అతని నేదో వంకఁబెట్టి రాజ్యములో నుండి తరిమివేయుట మంచిదని యూహించిరి. విషసర్ప మెందున్నను బ్రమాదకారణమే యనియు, దానిని సంహరించుటయే నీతియనియు మహామంత్రి రాక్షసుఁడుపదేశించిన హితవు నందులకు నచ్చెను. చంద్రగుప్తుఁడు నిస్సహాయస్థితిలో నున్న సమయము గనిపెట్టి, యేదో నేరము నారోపించి బంధించవలె ననియు, ననంతరము విచారణతంతు నడిపి, అతనిపై దొంగ సాక్ష్యములఁ జెప్పించి, శిరశ్ఛేదనశిక్షను విధింపవలయు ననియుఁ గుట్రలుపన్నుచు, సమయమునకై కాచుకొని యుండిరి.

ఇది యిట్లుండ, చాణక్యుఁడు తన బాల్యమిత్రుఁడును, జ్యోతిష, వైద్య, మంత్ర శాస్త్రములలో మహా ఘటికుఁ డును నయిన ఇందుశర్మను గలసికొనఁ గోరి, పాటలీ

పు(త్రమున కిరువది(క్రోసుల దూరములో నున్న వర్ధమానపురమేగెను. బాల్యమి(త్రుఁడు పెద్ద కాలమునకుఁ దన యింటికి వచ్చెనని, ఇందుశర్మ మహానందముఁ బొంది చాణక్యునికి సుస్వాగతము లిచ్చి, (ప్రేమతో కౌఁగలించి కుశల మడిగెను.

చాణక్యుఁడు పాటలీపు(త్రమున నందరాజుల కొలువులోఁ దనకుఁ గలిగిన యవమానమును గుఱించి మి(త్రులకు వివరించి, తన (ప్రతీకార యజ్ఞమునకు సహకరింప వలసినదిగాఁ గోరెను. అందుల కిందుశర్మ సంతోషముతో నంగీకరించెను. ఇందుశర్మ ఒక బౌద్ధ జ్యోతిష్కుని వేషముతో నందుల కొలువుఁ జేరవలయు ననియు, వారికిఁ దన మం(త్ర తం(త్ర జ్యోతిష శా(స్త్రముల ద్వారా భక్తి విశ్వాసముల బుట్టించు కొనవలెననియు, దాన ననేకములయిన చీకాకులు - అనారోగ్యములు పుట్టించు టయేకాక, వారి రహస్యాలోచనల నెప్పటి కప్పుడు తనకుఁ దెలుపుచుండవలెననియుఁ గోరెను. ఇందుశర్మ వల్లె యని జీవసిద్ధియను మాఱు పేరుతో బౌద్ధ పండితుని వేషము ధరించి, పాటలీ పు(త్రమునఁ (బ్రవేశించుటకును, చాణక్యుఁడు జరిగించనున్న (ప్రతీకార యజ్ఞమునకు నవనందులను బలి పశువులుగా నొనర్చుటకును బాస యొనర్చి, నాఁడే మి(త్రునితోఁ గలసి పయనమయ్యెను.

అట చం(ద్రగుప్తుని సహకారముతో ఇందుశర్మ జీవసిద్ధిగా మాఱి, నందరాజుల కొలువు చేరుటలో సంపూర్ణవిజయము నందెను. అంతేకాక, తన మం(త్రముల (ప్రభావముచేతను, ఔషధుల గుణములవల్లను వ్యాధులు లేని వానికి వ్యాధులఁ బుట్టించుచు, నున్నవారికిఁ దొలఁగించుచు నందులకు దైవసముఁడై పూజింపఁ బడు చుండెను. సర్వవేళలయందు వారతనిని దమ కుడిభుజమువలె నెంచుకొనుచుండిరి. (క్రమముగా వారు చం(ద్రగుప్తుని మారణాపాయమును గురించి యొక నిశ్చయమునకు వచ్చుటను జీవసిద్ధి (గహించెను.

ఒకనాఁటి తెల్లవాఱుజామున నాల్గవ ఘడియలో వారు చం(ద్రగుప్తుని బంధించి చెరయం దుంచుటకు ముహూర్తము నిర్ణయించి, తగిన మనుష్యుల నేర్పాటు గావించిరి. జీవసిద్ధి వారియేర్పాటును ముందుగనే చాణక్యునకుఁ దెలుపుడు చేయఁగలిగెను. ఆ రా(త్రి రెండవయామముననే చాణక్యుఁడు చం(ద్రగుప్తుని బసకుఁబోయి, యతనిని ని(ద్రనుండి లేపెను. అటువంటి యకాలములో గురువుల రాక కతఁ డచ్చెరువందెను. చాణక్యుఁ డిక జాగుచేయక చం(ద్రగుప్తునకు, (ద్రోహులకుతం(త్రమును వెల్లడిచేసి, యతనితో వేషములు మార్చుకొని బయలుదేఱెను. తా నొకచోట సిద్ధముగా నుంచిన బట్టలబండి నెక్కుమని చం(ద్రగుప్తుని కాదేశించెను. చాణక్యుఁడు బండి తోలువాని

వలెను, చంద్రగుప్తుఁడు బట్టల వ్యాపారిగను నుండి, వా రాబండిమీఁద ప్రయాణము సాగించి, తెల్లవారక మునుపే నగరపు పొలిమేరలు దాఁటఁగలిగిరి.

ఉదయము కాఁగానే చంద్రగుప్తుఁడు చాణక్యునితో పరారియైన సమాచారము నందాదులకుఁ దెలిసెను. వారు కీడును శంకించిరి. తమచే నవమానితుఁడైన బ్రాహ్మణుఁడు ప్రతీకారము చేయుటకే చంద్రగుప్తునిఁ దనతోఁ గొనిపోయి యుండునని, బుద్ధిశాలియగు రాక్షసామాత్యుడు సులువుగా గ్రహించెను. చంద్రగుప్తుని తుద ముట్టించగల తమ ప్రయత్నము వృథాయగుటయే కాక, యాతండు చాణ క్యునితోఁ జేరి తమపైఁ గత్తికట్టఁ దలఁచుకొన్నందులకు నందులు మఱింత సంకటపడిరి. వెంటనే సమర్థులైన కొందఱు చారులను బంపించి, చంద్రగుప్తునిఁ బట్టి తెచ్చినవారి కిరువదివేల బంగారు పణములు బహుమాన మిత్తు మని ప్రకటనలు చేయించిరి. అందువలన చారులు, నితర ప్రముఖులు తీవ్ర ప్రయత్నములఁ జేయఁ దొడఁగిరి.

చాణక్యుని ప్రాణమిత్రుఁడగు ఇందుశర్మ జీవసిద్ధియను మాఱుపేరుతో నందుల కొలువులో నుండి, యెక్కువ పలుకుబడిని సంపాదించెను. చాణక్యుని వలన నా రాజులకు ముప్పు వాటిల్లకుండఁ జేయుటకుఁ గాను, అతఁడు జపములు, హోమములు మొదలయినవానిని జేయుచుండెను. ఔషధ ప్రయోగములు చేసినందులకు జ్వరములు, తాపములను బుట్టించుచు, అదియంతయు మంత్ర తంత్రములు నేర్చిన చాణక్యుని ప్రయోగ ఫలితమని చెప్పుచుండెను. తిరిగి విరుగుళ్ళు పెట్టి వారికి తనపై నధిక విశ్వాస మేర్పడునట్లు చేయుచుండెను. చాణక్యుని యాటలు సాగనియ్యక యతనిని మారణహోమము చేయుదునని ప్రగల్భములు పలుకు చుండెను.

క్రమముగాఁ గొన్నాళ్ళ కెవరినోట విన్నను జీవసిద్ధి యొక్క ప్రభావమే వినఁ బడుచుండెను. చాణక్యశపథమునుండి నందులను రక్షించఁగలవాఁ డాబౌద్ధ పండితుఁ డొక్కఁడే యని చెప్పుకొనసాగిరి. ఎవరి కెటువంటి ఇబ్బంది కలిగినను, జీవసిద్ధి కడకుఁబోయి నివారించు కొనుచుండిరి. పాటలీపుత్రమున జీవసిద్ధియొక్క పలుకుబడి దినదినమును బెరుగుచుండెను. నందరాజులును, రాక్షసా మాత్యుఁడును నతని నొక యవతార పురుషునిగా నెంచుచుండిరి.

ఆ నాఁడు చంద్రగుప్తునిఁ బ్రమాదమునుండి తప్పించి, బట్టలబండిలో నెక్కించుకొని పోయిన చాణక్యుఁడు ఆగ్నేయ దిశాభిముఖముగాఁ బయనించి వర్ధమాన

పురమార్గము ననుసరించెను. గండముల నెన్నింటినో దాఁటి చాణక్య చంద్రగుప్తులు మరి మూఁడు దినములకు వర్ధమానపురముఁ జేరఁగలిగిరి. అటఁ గొంత స్తిమితము నంది, ముందు కార్యక్రమమును గుఱించి దీర్ఘాలోచన చేయఁగొడఁగిరి. "నాయనా! మన మిఁక నవలంబింప వలసిన పద్ధతులను గురించి చెప్పుచున్నాను వినుము. నిన్ను కడతేర్చవలెనని నందులు గావించిన తంత్రమును గురించి, జీవసిద్ధి మనకు దెలుపుడు చేయుటవలన, నా గండమునుంచి తప్పించుకొని యెట్లో బయటఁ బడితిమి. ఇఁక జరుగవలసిన దేమనఁగా, తగిన బలములను జేకూర్చుకొని, నందరాజులను దుదముట్టించుట -నిన్ను మగధ సామ్రాజ్యమునకుఁ బట్టభద్రునిఁ జేయుట-" యని చాణక్యుఁడు చెప్పఁగా చంద్రగుప్తుడు సావధానుఁడై యాలకించి-

"లెక్కలేనన్ని సైనిక సమూహములు గలిగి, మహాబలవంతులై యున్న నందులను జయించుట యెట్లు?" అని ప్రశ్నించెను.

"ఆ విధమునే చెప్పుచుంటిని. కార్యశూరులయిన వారి కసాధ్య మనునది యుండదు. అజేయమని పేరుమోసిన పారసీక రాజ్యమును జయించిన ఆలీసాందరు పరాక్రమమును గురించి నీవు వినియుందువు. అత నిపుడు తన సర్వసైన్యములతో గాంధార దేశమున నున్నవాఁడు. మన మొకింత యాశ పెట్టిన, నతఁడు మనకు సహకరింప వచ్చును. లేక, కిరాత కాంభోజులతోడను, తక్షశిల-కాశ్మీర ప్రభువుల తోడను మనము మైత్రి చేసికొనవచ్చును. అవసరమని తోఁచినయెడల పారసీకాది మ్లేచ్ఛులతో నయినను మనము కూడవచ్చును. వితస్తా ప్రాంతములకు ప్రభువైన పర్వతకుఁడు రాజ్యవిస్తీర్ణమునకుఁ బ్రబల ప్రయత్నములు చేయుచున్నాఁడు. అతని కొకింత యాశపెట్టితిమేని మనపక్షమవలంబించును. ఇట్లొకరినిఁ బట్టి, యొకరు మనకు సహకరించఁ గలరు."

"మంచిదే కాని స్వామీ! అంత బలవంతులతో వ్యవహారములు పెట్టుకొన్న, చివరకు వారు మనకే యెదురు తిరిగి, మగధసామ్రాజ్యమును గబళింతురేమో యని నాకు భయముగా నున్నది. స్వదేశమును విదేశీయుల హస్తగతముఁ జేయుటకంటె నధర్మవర్తను లయినను దాయాదులే యనుభవించుట నాకు సమ్మతము!"

"కుమారా! చాణక్యుఁడు నీ దేశమును పరుల కొప్పగించు నంతటి యవివేకి గాఁడు."

అని నుడివి చాణక్యుఁ డింకను జంద్రగుప్తున కనేకములయిన రీతులు బోధచేసి, యాతనితో నామఱునాఁడే పాంచాలమునకు బయలుదేఱెను. కొన్నాళ్ళకుఁ జాణక్య

చంద్రగుప్తులు యమునా తీరమగు ఇంద్రప్రస్థమును చేరిరి. కాని, యప్పు డా నగరమంతయు రథ గజ తురగ పదాతులతో నిండియుండెను. ఎటు పోవుటకును వలను పడదయ్యె. ఒక సేనిని వారి నొక ద్వారము చెంత వారించి-

"ఎవరు మీరు? ఎటకుఁ బోవలెను?" అని ప్రశ్నించెను.

"మేము యాత్రికులము. ఈ క్షేత్రమును జూచి పోవలెనని వచ్చితిమి." చాణక్యుఁడు జంకక బదులుచెప్పెను.

"క్షేత్రమును సేవించుట కిది సమయముకాదు. దురాశా పరుఁడైన ఆలీసాందరు, హిందూ రాజ్యము లన్నిటిని జయించు తలంపున సర్వ సైన్య సన్నద్ధుఁడై బయలు దేఱెను. పర్వతకు నోడించి, తక్షశిలను వశపఱచుకొని, సాంగల క్షత్రియుల నవమానించి యింకను విజయయాత్రలు సాగించుచున్నాఁడు. ఆయవను లార్యావర్తమున నడుగు పెట్టకుండఁ జేయవలెనని, మగధసైన్యము లీ ద్వారమునఁ గాపున్నవి. ఈ సైన్యములకు భద్రపాలుఁడు నాయకుఁడు," అని నంద సైనికులలో నొకఁడైన బలదత్తుఁ డనువాఁడు చెప్పఁగా—

"ఈ సైన్యములందు చంద్రగుప్తుఁడు లేఁడా నాయనా?" అని చాణక్యుఁ డడిగెను. అందులకు బలదత్తుఁడు నిట్టూర్చి—

"అయ్యో! ఆ సింహవిక్రముఁడు - ఆధర్మావతారునకు నందులు ద్రోహముఁ జేయ సంకల్పించుట చేతనే, ఆయన స్వదేశమును వీడిపోయె" నని చెప్పెను.

చంద్రగుప్తునెడ వానికిఁ గల యభిమానమును గుర్తించిన చాణక్యుఁడు, తమ నిజస్థితిని వానికిఁ జెప్పి, నంద సైన్యములకుఁ దాము చిక్కకుండ, యమునానదిని దాఁటించి రక్షించ వలసినదని కోరెను. బలదత్తుఁ డందులకు సంతోషముతో నంగీకరించి, చాణక్య చంద్రగుప్తులను సురక్షితముగా యమునానదిని దాఁటించి పంపెను.

## 6. బంధవిముక్తి :

విశ్వవిజేత కాఁదలఁచిన ఆలీసాంద రప్పటి కెదురులేని దండయాత్ర లెన్నో సాగించి, యెదురు తిరిగినవారిని శిక్షించుచు, శరణన్నవారిని లోబఱుచుకొనుచు వివిధదేశములలోఁ దన విజయపతాకముల నెగురవేసి, యనంతరము వ్యాస నదీ

తీరముఁ జేరెను. వితస్తా వ్యాసపదములకు మధ్యఁ గల భూఖండము నంతటిని జయించి, దానికిఁ బర్వతకునిఁ బట్టభద్రునిఁ జేసెను. ఆ యెడారికిఁ బూర్వ దిశయందు గంగా యమునలు ప్రవహించు చున్నవనియు, వానికావల ప్రాచ్యదేశమున మగధ సామ్రాజ్య మున్నదనియు విని, యా రాజ్యమును గబళింప నుత్సాహుఁ డయ్యెను.

మగధ సామ్రాజ్యమునుగూడ జయించి, తన యవక్ర పరాక్రమమును లోకమునకుఁ జాటవలెనని ఆలీసాందరెంతేని యుత్సాహపడెను. కాని సైన్యము లందు కంగీకరించక, తాము అలసియుంటిమనియు, నిఁక ముందుకుసాగ దుస్సా ధ్యమనియు సూచించిరి. ఆలీసాందరందులకుఁ గినుక వహించియు జేయునదిలేక, తిరోగమించుటకే సంసిద్ధుడయ్యెను.

అదేసమయమున చాణక్యుఁడు చంద్రగుప్తునితో సింహపురాధీశుఁడైన విజయ సింహునిఁ జూడవలయునని వచ్చి, ఆలీసాంద రాప్రాంతమునందే సర్వసైన్యసమేతుఁ డై విడిదిచేసెననియు, మగధరాజ్యముపై దండెత్తనున్నాడనియుఁ దెలిసి, యాతనిఁ గలిసికొని సహకారముఁ గోరవలసినదిగాఁ జంద్రగుప్తున కుపదేశించెను. అతఁ డౌదార్య గాంభీర్యగుణములు గలవాఁడగుటచేఁ జంద్రగుప్తుని దప్పక యాదరించునని నుడివెను. అతఁడు రత్నాదులపై నాశగలవాఁడగుటచే, వానిని సమృద్ధిగా సమర్పించిన, సహకారము సులభసాధ్యమగునని చెప్పెను. ఇంకను, నుపదేశింపవలసిన రీతుల నెన్నింటినో యుపదేశించి, చాణక్యుఁడు చంద్రగుప్తుని ఆలీసాందరు చక్రవర్తి సాన్నిధ్యమునకు బంపెను.

చంద్రగుప్తుఁడు గ్రీకు సార్వభౌముని దర్శనమునకు బోవుచుండఁగా విజయసింహుని కుమార్తెయగు శాంతిమతి యుద్యానవనమందుండి చూచుట జరిగెను. నవమన్మథాకారుఁడైయున్న చంద్రగుప్తునిపై నీమెకు మనసు దగిలెను. చెలికత్తెయలన విచారించి, యాతఁడు చాణక్య శిష్యుడైన చంద్రగుప్తుఁడనియు, మున్ముందు మగధ సామ్రాజ్యమును పరిపాలింపగల ధీరుడనియు, నాసందర్భముననే ఆలీసాందరు సహాయము నపేక్షింపఁ బోవుచున్నాఁడనియుఁ దెలిసికొనియెను. అప్సరస కన్నియవంటి యా లేఁబ్రాయపుఁ బడుచు మనంబున, నేమేమో యాలోచనలు పరుగెత్తినవి. తోడనే యామె చెలును వీడి యెటకో పోయెను.

ఆలీసాంద రప్పుడు పర్వతకుని మందిరమందుండెను. శాంతిమతి పర్వత కరాజ్ఞికి మేనగోడలగుటచే నామె గూడ నందే యుండెను.

ఆలీసాందరు తన దర్శనముఁ గోరి వచ్చిన చంద్రగుప్తునిఁ దగు మర్యాదలతో నాహ్వానించి, యాతఁడు వచ్చిన కార్యమును గురించి సాదరముగా నడిగెను. చంద్రగుప్తుఁడు తనతండ్రి తాతల చరిత్రయు, నందులు తనకుఁ గావించిన ద్రోహములును వివరించిన తర్వాత,

"ఉదారగుణసంపన్నులైన తమ సాహాయ్యమువలన మగధసామ్రాజ్యమును జయింపఁగోరుచున్నాను." అనియెను.

"మంచిదేగాని, నాకిప్పుడు సైన్యసహకారము దూరమైనది. వారింతవఱకు జరిగిన యుద్ధములలో నలసి సొలసి యున్నవారఁట! దండయాత్ర లిప్పటికి ముగించి, స్వదేశమునకుఁ బోఁగోరుచున్నారు. అది యటుండ, నేనొకవేళ నీకు సహకరించి, మగధను జయించినయెడల, నీ ఇతరపాలకులవలె నాకు లొంగి, కప్పముఁ గట్టుచుండవలెను. అందులకు సమ్మతమా?"

ఆలీసాందరు నిర్మొగమాటముగా నడిగినదానికి చంద్రగుప్తుని ముఖమెఱ్ఱబాఱి రక్తముతో జేవురించెను.

"అసంభవము! మగధరాజ్యమొకరికి సామంతమైయుండుట సర్వము కల్ల - మేమే యా సింహాసనమును సర్వ స్వతంత్రులమై యధిష్ఠించవలయును!"

"పర్వతకుఁడు, అంభి మొదలగువారికన్నను మీరు ఘనులా?"

"ముమ్మాటికిని ఘనులమే. పర్వతకుఁడు మీ కోడినాఁడు. కనుక సామంతుఁ డైనాఁడు. తక్షశిలాప్రభు లాది నుండియు నొకరికి సామంతులే! మీరు సహృదయముతో సహకరించునెడల యుద్ధపుఖర్చులను మేము భరించుకొందుము. - అయిదుకోట్ల బంగారుపణములతో మిమ్ము సత్కరించెదము."

"కట్టిపెట్టుము-దిగంతయశోవిరాజితుఁడైన ఆలీసాందరెచ్చటను గూలి యుద్ధము చేయలేదు. అమర్యాదగా మాటలాడుచున్నందుకు నిన్ను శిక్షింపవలసియుండును!"

"ఈ చంద్రగుప్తుఁ డటువంటి బెదరింపులకు జంకువాఁడు గాఁడని తమరు గుర్తింపవలెను."

"ఏనాటికయినను మగధను జయించఁగలవారము మేమే!"

"చంద్రగుప్తుని కంఠమునఁ బ్రాణముండఁగా నా పని జరుగదు!"

"నీ ప్రాణములు తీయుటకు మాకు క్షణము పట్టదు. ఆ పని, యిప్పుడు జరిగినను జరుగవచ్చు."

"నమ్మి - దర్శింపవచ్చినవానికే ద్రోహముచేయఁగల నీచులు మీ రనుకొనలేదు. మీ రింతటి అధర్మవర్తనులని యిప్పుడు తెలిసినది."

"ధర్మము దేశకాలపాత్రలను బట్టి మాఱుచుండును."

"ఆ మార్పు మీవంటి క్షుద్రులకు!"

ఆ మాటతో ఆలీసాందరు కళ్ళంట నిప్పులు రాలెను.

"ఏయ్! ఎవరక్కడ!"

ఆలీసాందరు మహాక్రోధమున నురిమిన యుఱుముతోఁ గొందఱు సాయుధపాణులైన భటులు లోనఁ బ్రవేశించిరి.

"ఈ పొగరుబోతును తక్షణమే బంధించి, ఖైదు చేయుఁడు."

అని యాజ్ఞాపించెను. వెంటనే భటులు రాజాజ్ఞ పాలించి, చంద్రగుప్తుని బంధించి కొనిపోవుచుండ నాతఁడు నిస్సహాయుఁడై-

"అలీసాంద రిటువంటి రాక్షస హృదయుఁ డనుకొనలేదు" అనియెను.

"వీనికి కారాగారమున, నీరుగాని యాహారముగాని యీయవద్దు" అని, ఆలీసాందరు కఠోరకంఠమునఁ దిరిగి యాజ్ఞాపించెను.

చక్రవర్తి యాజ్ఞానుసారము, చంద్రగుప్తుఁ డొక చీఁకటికొట్టులో బంధితుఁడై యుండి, తన దుష్కర్మను గురించి దుఃఖితుఁ డగుచుండ, నట చాణక్యుడు-ఆలీసాందరును దర్శింపఁబోయిన చంద్రగుప్తుఁ డెంతకును దిరిగి రాకపోవుటను గురించి, పలుతెఱఁగుల యోచనలు చేయదొడఁగెను. అతని మనస్సు కీడును శంకించుటచే నన్వేషణకు బయలుదేఱ నుండ, శిష్యుఁడగు సిద్ధార్థకుఁడు వడి వడిగా వచ్చి—

"స్వామీ! మన చంద్రగుప్తుని ఆలీసాందరు బంధించినాఁడు!" అని చెప్పెను.

ఆ పిడుగువంటి వార్తను వినినంతనే, చాణక్యుఁడు వివరము లడిగి తెలిసికొని-

"ఈ దుర్వార్తను జెప్పుటకే వచ్చితివా! లేక విడుదల కేదయిన మార్గము నాలోచించితివా?" అని యడిగెను.

"స్వామీ! తమ యానతిచొప్పున మాఱు వేషముననుండి యంతయుఁ గనిపెట్టుచునే యుంటిని. మన చంద్రగుప్తుల వారు చక్రవర్తిని దర్శింపఁ బోవుచుండఁగా, మార్గ మధ్యమునఁగల యొక పూఁదోటలో విహరించుచున్న శాంతిమతి యను నొక నవమోహనాంగి చంద్రగుప్తుని గాంచి మోహించెను."

"అందువలన లాభమేమి? ఆమె యెవరు?"

"ఆ కన్నియ పర్వతకుని మేనగోడలును, సింహపురాధీశ్వరుఁడైన విజయ సింహుని కుమార్తెయు నని తెలిసినది."

"అట్టులా! చంద్రగుప్తుఁ డామె ప్రేమ గుర్తించెనా!"

"సంగతి నాకుఁ దెలియదు గాని, ఆమె సహకారము వలన మన మిప్పుడు చంద్రగుప్తుని విడుదల చేయింపఁ గలము."

"అదియెట్లు!"

"తమ రొక్కసారి యా కన్యను గలిసికొనిన సర్వముఁ దెలియఁగలదు."

"ఏర్పాటు చేసితివా?"

"చేసియే వచ్చితిని. చంద్రగుప్తుఁ డామెను దప్పక బరిణయ మాడునని, తమ రాకన్నియకు వాగ్దానముఁ జేయవలెను."

"వాగ్దానమే కాదు - పరిణయమే చేయించవచ్చును. ఆమె జనకుఁడు విజయ సింహుఁడు నాకుఁ దెలియనివాఁడు కాఁడు."

"మీ దర్శనముకొఱ కామె పూఁదోఁటలో కాచుకొని యుండునట్లు చేసి వచ్చితిని. తమ రాలసింపరాదు."

అని హెచ్చరించి, మహామేధావియైన సిద్ధార్థకుఁడా వెనువెంటనే చాణక్యుని సాంకేతిక స్థలమునకుఁ గొంపోయెను.

* * *

ఆనాఁటి నడిరేయిని, దుర్భేద్యమైన యంధకార కూపములో బంధితుఁడై యున్న చంద్రగుప్తుఁడు విమోచన మార్గముఁ గానక పరితపించుచుండ, నున్నట్లుండి ఒక గోడలో నుండి వెలుతురు కనిపించెను. ఎవరో తన్ను వధించుటకు వచ్చియుందురని తలంచి, యతఁడు ప్రాణములపై నాశ వదలు కొనెను. అంతలో నొక ముసుగువేసికొన్న వ్యక్తి దాపునకు వచ్చి, బంధములు విడఁగొట్టి-

"రాకుమారా! నీకు విమోచన గలిగించుటకు నేను వచ్చితిని - త్వరపడుము," అనఁగా, చంద్రగుప్త ఁడు విభ్రాంతుఁడై-

"నీవెవరు? నిన్నెట్లు నమ్మవచ్చును?" అని యడిగెను.

తోడనే, యా వ్యక్తి ముసుగును దొలఁగించి, వెంటఁ గొనివచ్చిన పూలహారము నాతని మెడలో వైచి-

"ఆర్యు లిప్పుడైన నన్ను నమ్మవచ్చును! నేను సింహపురాధీశుఁడైన విజయసింహుని కుమార్తెను. నా పేరు శాంతిమతి" అనియెను.

"పర్వతకుని మేనగోడలివా? ఏమి టీసాహసము!"

"ప్రేమను గాంక్షించువా రింతకంటె నెక్కువ సాహసములే చేయఁగలరు. తమరు జాగుచేసిన ప్రయత్నభంగమగును. నగరబాహ్యమున, కాళికాలయము చెంత గురువులు చాణక్యులవారు వేచియుందురు. తమరు వారినిఁ గలిసికొని, యీ రాత్రియే యశ్వారూఢులై చని సింహపురిలో మా జనకునిఁ గలిసికొని, యాతనివద్ద సురక్షితులై యుండఁగలరు. నేనును, అనతి కాలములోనే వచ్చి, యటఁ దమ్ముఁ జేరఁగలను."

ఆమె ధైర్య సాహసములకును, గావించిన యేర్పాటునకును జంద్రగుప్తుఁడు కృతజ్ఞతను దెలిపి, యామెతో వెలుపలకు వచ్చెను. అనంతర మామె యొసంగిన యుత్తమాశ్వము నధిరోహించి, యాతఁడు గురువును గలియఁబోయెను. ఆ సాహసికురాలు దిరిగి ముసుగు గప్పుకొని, నిజనివాసాభిముఖముగాఁ జనియెను.

## 7. సమర సన్నాహములు :

సైనికుల యభీష్టముఁ దీర్చుటకే నిశ్చయించి, ఆలీ సొంద రంతటితో

దండయాత్రలు నిలిపి, నిజ రాజ్యమునకు మరలనున్నాఁడని తెలిసి, పెక్కురు మండలాధిపతులును, సామంతులును, మిత్రులును, చక్రవర్తినిఁ బరామర్శించి వీడ్కోలుపుటకై యతఁడు విడిసియున్న పర్వతక రాజ్యమైన వితస్తా తీరమునకు వచ్చి చేరిరి. చక్రవర్తి యెల్లర సమాగమమునకును సంతసించి, యొక పేరోలగముఁ జేసెను. సభలో నెల్ల రాయనకు వెలగల కాన్క లర్పించి, కంఠమును మాణిక్యహారములతో నలంకరించిరి. చక్రవర్తి వారి వారి సన్మానము లందుకొన్న తరువాత నిట్లని వచించెను- ఈనాఁటివఱకు మాకుఁ గలిగిన లెక్కలేని విజయములతో మాకుఁ బరిపూర్ణమయిన తృప్తిగలిగినది. కాని, గంగా యమునలవద్దకుఁ జేరుసరికి మా సైనికులకు నిరుత్సాహము పుట్టుటచే, నా నదులను దాఁటి మగధపై దండయాత్ర చేయుట పొసఁగలేదు. మా సైన్యముల కోరిక ననుసరించి యిప్పటికి మరలిపోవుచున్నాము. అనతికాలములోనే తిరిగి వచ్చి, బలీయమైయున్న యా మగధ రాజ్యమునుగూడ జయించఁగలము. ఆ జాతికిఁ జెందిన చంద్రగుప్తుని పొగరు చవిఁ జూచినప్పటినుండియు, మా కా రాజ్యమును జయింపవలెనన్న కోరిక మఱింత బలీయమైనది.

మేము కూలితీసికొని, తన పక్షమున యుద్ధము చేయవలయునఁట! అతఁడు తనజన్మలో నొకరికి సామంతుఁడైయుండడఁట! మాకు బందీగానున్న యీ గర్విష్ఠి నిప్పుడే సభా సమక్షమునకుఁ బిలిపింతును. వానినిక్కడ బంధించి, నేను మరలిపోవుట భావ్యము కానేరదు. తాను ఆలీసాందరు వంటి విశ్వ విజేత యెదుటఁ బలికిన పలుకు లపరాధములని, యీతఁ డొప్పుకొనిన క్షమించి ప్రాణములతో విడిచి పుత్తుదము. లేదా, యీ పేరోలగంబుననే, యా పొగరుఁబోతు శిరస్సును ఖండింతుము!...

అంతలోఁ జంద్రగుప్తునిఁ గారాగారమునుండి కొని తెచ్చుటకుఁ బంపఁబడిన కొందరు దండనాయకు లరుదెంచి, వణఁకుచున్న శరీరములతోఁ బ్రభువులకు విన్నవించుకొనిరి-

"ప్రభూ! కారాగార ద్వారములు మూసినవి మూసినట్లే యున్నవి! చంద్రగుప్తుఁ డటఁ గానరాలేదు. పోయిన మార్గముగూడ నేదియుఁ గాన్పించుట లేదు. రక్షకభటులు కనురెప్ప మూయక యథాప్రకారము జాగరూకులుగ నే యున్నారు! ఈ విపరీత మెట్లు జరిగినదో తెలియుటలేదు...

ఆ విషయముఁ దెలిసి, ఆలీసాందరు మండిపడుచుఁ బర్వతకుని జూచి, "ఈ మహామాయను గురించి యేమనవచ్చు!" అని తీక్షణముగా నడిగెను.

"మహాప్రభూ! ఇది నిక్కువముగా మహామాయయే యగును ! చంద్రగుప్తుని గురువైన చాణక్యుఁ డనుబ్రాహ్మణుఁడు నిజముగా మాయకాఁడు. మంత్ర తంత్రము లన్నింటిని నేర్చిన యుద్దండుఁడు. ఇంద్ర మహేంద్రజాలములలోఁ బ్రవీణుఁడు. ఆ చాణక్యుని ప్రజ్ఞ నే నెఱుఁగుదును గాన మనవి చేయుచుంటిని. చంద్రగుప్తుని మగధ సింహాసన మెక్కింతునని యీ బ్రాహ్మణుఁడు శపథమూని యుండుటఁ జేసి, యా మాయలమారియే తన యైంద్రజాలిక విద్యలతోఁ జంద్రగుప్తుని కారాగారమునుండి మటుమాయముజేసియుండును" అని పర్వతకుఁడు చెప్పఁగా విని, ఆలీసాందరు చక్రవర్తి వెంటనే యా బాపనితోఁ జంద్రగుప్తుని బట్టి తేవలయునని భటుల కాజ్ఞాపించి, యానాఁటికి సభను జాలించెను.

తన నగరమున బంధితుఁడైన చంద్రగుప్తుఁడు పరారి యగుటవలనఁ, దనయం దత్యంతాదరమును జూపుచున్న చక్రవర్తి దృష్టిలోఁ దానేమిగా భావింపఁబడునో యన్న కించతో, సభానంతరము పర్వతకుఁడు నిజ నివాసమున కరిగి దీర్ఘాలోచనాపరుఁ డయ్యెను. రాణి యతని మనసునఁగల దిగులును గుర్తించి, దాపునఁజేరి-

ఆర్యుల మనసును గలవరపెట్టుచున్న విషయమును నే నెఱుఁగుదును. మన్నిం తురని మాట యిచ్చినచో మనవిఁ జేసికొందును" అని నుడువఁగా-

"దేవీ! మన యిరువురిలో నట్టి భేదభావ మెందుకుండవలెను? తప్పక మన్నింతును. నీకుఁ దెలిసిన విషయమును దాఁచక చెప్పుము" అని పర్వతకుఁడు భార్యతో ననియెను.

"అన్నకూతురు శాంతిమతి, యుద్యానవనమందుండఁగాఁ జక్రవర్తినిఁ జూడఁ బోవు చంద్రగుప్తునిఁ గాంచినది. అతని రూపరేఖా విలాసములు గాంచి మోహించినది. ఆ వెనువెంటనే యా రాజకుమారుఁడు చక్రవర్తిచేఁ బందీ యాయెను. ప్రేమించినవానిని బరిణయమాడనిదే తాను జీవించుట కల్లయని యేడ్చెను. అతని విడుదల కుపాయమును జెప్పవలసినదని నా కాళ్ళు పట్టుకొని బ్రతిమాలినది. నా మనసు కరఁగినది. ఆ బిడ్డ జీవితమును సార్థకముఁజేయ సమకట్టితిని. కారాగారమునకుఁ గల రహస్యపు సొరంగ మార్గము నాకుఁ దెలిసినదగుటవలన, నద్దాని నామె కెఱుకపఱచి, ప్రియుని విడిపించుకొనవలసినదిగా నుపదేశించితిని. ఆమె యట్లే యొనరించి, చంద్రగుప్తుని చాణక్యునితోఁ దన తండ్రిగారింటికిఁ జేర్చినది. ఇది జరిగిన యథార్థము! మీరు శిక్షింపఁదలఁచిన నన్ను శిక్షింపుఁడు గాని, యా కన్యను శిక్షింపవద్దు!"

పర్వతకుఁ డొకింతతడ వాలోచించి, యొక దీర్ఘ నిశ్వాసమునువిడచి - "ఎవరిని శిక్షింపఁ బనిలేదు. మీయన్న రాజసింహుని తనయకు, ధీరోదాత్తుఁడు, విక్రమోపేతుఁడు నైన చంద్రగుప్తుని వంటి భర్త లభించుట నాకును బరమ సంతోషమే. ఈ విషయమునే మీ యన్నకు లేఖ మూలమునఁ దెలియఁబఱచెదను.'' అనెను.

ప్రక్క మందిరమునఁ బొంచియుండి, వారి సంభాషణ నాలకించిన శాంతిమతి హృదయ మానందముతో నిండెను. వెంటనే వెలుపలకు వచ్చి మామకును, నత్తకును బ్రణమిల్లెను. వారామెను గళ్యాణ ప్రాప్తికై యాశీర్వదించిరి.

అట చాణక్య చంద్రగుప్తులు సింహపురముఁ జేరకమునుపే పర్వతకునిచే వ్రాయబడిన లేఖ రాజసింహునికిఁ జేరెను. ఆతఁడును పరమానంద భరితుఁడై, వారు పట్టణము జేరునప్పటికి సర్వముఖముల నలంకరణలఁ జేయించి, యాహ్వానముల నేర్పాటు గావించెను. చాణక్య చంద్రగుప్తులటఁజేరి, యా రాజుచే గౌరవ మర్యాదల నందుచుండు సమయమున శాంతిమతియుఁ బుట్టినింటికి వచ్చి చేరుకొనియెను. చాణక్యుఁడు తానంతకుముం దాకన్నకుఁ గావించిన వాగ్దానమును గురించి చంద్రగుప్తునికిఁ జెప్పఁగా, నతఁడామెను బరిణయమాడుట కంగీకరించెను.

ఒక శుభముహూర్తమున చాణక్య పండితుని యాశీర్వాదములతో శాంతిమతీ చంద్రగుప్తుల వివాహము జరిగెను. అంతియే కాక, యారాజునకుఁ బుత్రసంతానము లేక పోవుటం జేసి, చంద్రగుప్తుని సింహాసన మెక్కించి పట్టము గట్టెను. చాణక్యుఁడేప్రతిఫలమును గోరి యా వివాహమును జేయించెనో, యది నెఱవేఱుటవలన నాతఁడు కృతకృత్యుఁ డాయెను. చంద్రగుప్తుఁ డా వివాహమువలన శూరులయిన పదునైదు వేల సైనికులకు నాథుఁడయ్యెను. ఆ వెనువెంటనే ఎనిమిదివేల మద్రకులు చంద్రగుప్తునితోఁ గలిసిరి. అంతే కాక, విజయసింహుని మిత్రుఁడైన విజయశర్మ తన సైన్యములతోఁ జంద్ర గుప్తునికిఁ దోడై నిలచెను. మరియు, రెండువేల మంది వీరులతో మగధనుండి తరలివచ్చిన రాజసేను డనువాడును చంద్రగుప్తుని జేరెను. ఇట్లను కూలించిన వాతావరణము నుపయోగించుకొనుచుఁ జాణక్యుఁడు, చంద్రగుప్తుని సైనికబలములను వృద్ధి గావించుచు, విరోధులపై హేయభావమును గలిగించుటయే కాక, నంద వినాశన మొనర్చుట కదనుకై వేచియుండెను.

అంతలో ఆలీసాందరు భారతభూమిని వీడిపోయెనను వార్త చాణక్య చంద్రగుప్తులకుఁ దెలిసెను. అదియే తమ కనుకూలించిన వాతావరణ మనుకొని, వేయి యేనుఁగుల బలముతో వారు కార్యరంగమున దిగిరి.

పాటల దుర్గమును చంద్రగుప్తుఁడును, మహార్ఘ్య దుర్గమును చాణక్యుఁడును ముట్టడించి, వశపఱచుకొనిరి. క్రమముగా మిగిలిన జానపదములు గూడ చంద్రగుప్తునికి వశమయ్యెను. ఎంతోకాల మధిక వ్యయ ప్రయాసల కోర్చి, విశేష సైనిక నష్టముతో నాలీసొంద రార్జించిన విజయ పతాకములన్నియు నేలమట్ట మయ్యెను. తక్షశిలా ప్రభువును, పర్వతకుఁడును నీ విడ్డూరమును గురించి వింతగా నాలోచింపఁ దొడఁగిరి. అదే సమయమునఁ దమతోఁ జేరి మగధసామ్రాజ్య విజయమునకు సాయపడవలసినదని, చాణక్యుఁడు పర్వతకునకు రాయబారమంపెను. మగధసామ్రాజ్యమును గెలుచుకొన్నయెడలఁ, దన కర్ధభాగమిచ్చు పద్ధతిలోఁ దన సహకారము లభించునని పర్వతకుఁడు వార్తనంపెను. చాణక్యుఁ డాతఁడు మహాబలములు గలవాఁడగుటచే, మగధ విజయము సులభసాధ్యమగునని యెంచి, యాతఁడు కోరిన దాని నిచ్చుటకు వెంటనే యంగీకరించెను.

కాని, ఈ యేర్పాటు చంద్రగుప్తునకు సమ్మతముగా లేకపోయెను. సహకరించిన వాని కర్ధరాజ్యమిచ్చి, తాము యుద్ధముచేయుట యనావశ్యకమని యతఁడు చాణక్యుఁ నితో ననియెను.

"వత్సా ! ఇందలి తంత్ర మిప్పుడే నీ కర్థముకాదు. పర్వతకున కర్ధరాజ్య మీయవలసి వచ్చి నప్పుడేమి జరుగునో, నీ వప్పుడే చూడఁగలవు. అంతదనుక వ్యవహారములు నాకు వదలి, నీవు సహనమువహించి యుండవలసినది"

అని చాణక్యుఁడు చంద్రగుప్తుని మృదువుగా మందలింప, నాతఁడు మిన్నకుండెను.

## 8. మంత్రుల తంత్రాలోచన :

అటుపిమ్మట, చాణక్య చంద్రగుప్తులు, దినదినము వృద్ధియగుచున్న తమ సైనికబలముల నందందు నిలుపుచుఁ దాము కళింగమున కరిగిరి. ఆరేఁడు, వారితో నెయ్యముఁ గోరెను. వేయి యేనుఁగులతో వారిని గౌరవించి, అదను కలిగినప్పుడు మగధకుఁ దాను సర్వసైన్యములతోఁ దరలి వత్తునని బాసచేసెను. అతని సౌహృదయమునకుఁ జాణక్య చంద్రగుప్తు లెంతయు నలరి, యా వెనువెంటనే మరలి వచ్చుచు మార్గమున వైరాత్యవీరులతో నెయ్యముఁ గలుపుకొని సింహపురికి వచ్చి చేరిరి.

వారు నిజనివాసముఁ జేరుటయే తడవుగా, క్రీ. పూ. మూఁడువందల యిరువది మూఁడవ యేఁట, విశ్వవిజేత కాఁగోరిన గ్రీకు చక్రవర్తి ఆలీసాందరు, తన ముప్పదిమూఁడేండ్ల వయసులో బాబిలోను నగరమునందు మరణించె నను వార్తనందుకొనిరి. ఈ పిడుగువంటి వార్త, భారతదేశమునందుఁ గల యవనుల నందఱను నిర్వీర్యులఁ జేసెను. చంద్రగుప్తుని సేన లత్యంతో త్సాహముతో యవనదుర్గములన్నిటిని వశపఱచుకొనిరి. మున్ను, చాణక్యునన్వేషించు సందర్భమున గ్రీకు చక్రవర్తి, యెందరు బ్రాహ్మణుల నుఱి వేయించెనో, యంతకు రెట్టింపు గ్రీకులను చాణక్యుఁడు వధింపఁ జేసెను. పెక్కుమంది గ్రీకు నాయకులను నిర్దాక్షిణ్యముగాఁ బట్టించి, శిరచ్ఛేదముఁ జేయించెను.

అప్పటికిఁ జంద్రగుప్తుని సైన్యములన్నియుఁ గలసి సుమారు ఒకటిన్నరలక్ష లాయెను. మగధసామ్రాజ్యము నెదిరించుట కా పాటి బలము చాలదని చాణక్యుఁ డంచనా వేసెను. తమ సర్వ సైన్యములను సింహపురికిఁ జేర్చి, యటఁ గొంతకాలము వేచియుండిరి. పర్వతకరా జంతవఱకును విశ్రాంతిఁ గైకొని, తామంతకుమున్ను గావించుకొనిన యేర్పాటు ననుసరించి, చాణక్య చంద్రగుప్తులెప్పుడు కోరిన, నప్పుడు మగధపై దండెత్తుటకు సిద్ధముగా నుందునని చాణక్యునకు రహస్యవార్త నంపెను. ఆవార్తకుఁ జంద్రగుప్త చాణక్యులెంతయు సంతసించిరి. అంతట, మగధపై దండెత్తుట కొక శుభముహూర్తము నిర్ణయించి, ఆ ముహూర్తమునకే పర్వతకుఁడు గూడఁ దనసైన్యములతో వచ్చి, మగధపైఁ బడవలయునని చాణక్యుఁ డాతనికిఁ బ్రతిసందేశము నంపెను.

నిర్ణీత ముహూర్తమునందు చాణక్యుఁ డేర్పాటు గావించిన మహా సైన్యములన్నియు మగధపై దండెత్తుటకు తరలెను. చాణక్యుఁడు దమ సర్వ సైన్యములను రెండు భాగములుగ విడఁదీసెను. ఒక భాగమును బర్వతక, వైరోచక, మలయ కేతులును, మఱియొక భాగమును చాణక్య చంద్రగుప్తులును నడుపుచుండిరి. జరుగనున్న యీ మహా సంగ్రామమును గురించి దేశదేశముల మాఱుమ్రోఁగెను. కళింగ భూపాలుఁడు తనసేనలతో దక్షిణమునుండియు, విజయసింహాదు లుత్తరమునుండియు, కామరూప మహారాజు తూర్పునుండియుఁ బాటలీపుత్రమును బట్టుకొని, చంద్రగుప్తునకు సహకరించుటకుఁ దమదమ సైన్యముల నాయత్త పఱచుకొని బయలుదేఱిరి.

శత్రుసేన లెట్లెట్లు బయలుదేఱినదియు, చారులవలన నందు లెప్పటికప్పుడు వార్తల నందుకొనుచుఁ దాము బ్రహ్మాండమైన సమరసన్నాహముఁ జేయఁదొడఁగిరి. జీవసిద్ధి - రాక్షసాది ముఖ్యమంత్రులను రావించి, నందులొక సమయమున యుద్ధనీతిని గురించి చర్చింపఁదొడఁగిరి. శత్రు సేనలు చుట్టుముట్టక మునుపే తగిన జాగ్రత్తలు తీసికొనుట కా సభ యుద్దేశింపఁబడియెను.

ఇంతటి మహాసైనికసంపత్తిగల బలీయమైన రాజ్యము వాస్తవములో నెట్టి శత్రువునయిన నవలీలగ జయించవచ్చును. కాని, ఆయా శాఖలయందు నిర్ణీతులైయున్న నాయకులు కలసిరామి, విజయము సందేహాస్పదమే యగుచున్నది. భద్రభట, పురుషదత్త, బలగుప్త, సింహబలాది సేనాపతులు నందుల యకార్యముల నేవగించువారును, చంద్రగుప్తునియం దభిమానము, గలవారునునై యుండిరి. జీవసిద్ధి భాగురాయణులు చంద్రగుప్త విజయమునే కోరుచుందురు గాన, వారిని గురించి వేరుగఁ జెప్పవలసినది లేదు. పోఁగా నిఁక మిగిలినవాడు మహామంత్రి రాక్షసామాత్యుడు! అతఁడు మహా బుద్ధిశాలి, రాజ్యతంత్ర నిపుణుఁడు. ఆదినుండియు నంద వంశమునం దధిక విశ్వాసముగలవాఁడు. చాణక్యున కెల్ల విధముల సమానమైన చెయ్యి! మంత్ర తంత్రములు నేర్చిన మహా పండితుడు. సర్వ శక్తులను వినియోగించి, ప్రాణమైన నొడ్డి, నందప్రతిష్ఠను, నంద సామ్రాజ్యమును నిలుపుటకుఁ గంకణముఁ గట్టుకొన్న ప్రతిభావంతుఁడు. అట్టి మహా మంత్రియే లేనియెడల మగధ సామ్రాజ్య మేనాఁడో పరులపాలయ్యెడి దనవచ్చును.

ఆనాఁటి సభలో, జరుగనున్న మహా సంగ్రామమును గురించి పలువురు పలువిధములుగాఁ జర్చలు సాగించిరి. శత్రువులను రాజధాని పొలిమేరలు దాటనీయకుండ, మార్గమందే ఎదిరించి తరిమివేయుట మంచిదని కొందఱనిరి.

"అట్లొనర్చిన, శత్రువులు వెనుకకు మరలి, బలములు కూడఁగట్టుకొని, తిరిగి దాడిసల్పుదురు. కనుక, వారిని రాజధానిలోఁ జొరనిచ్చి, అడకత్తెర వ్యూహముతో నొకేసారి నాశముచేయుట లెస్స" అని సర్వసేనాని భద్రశాలుఁడు పలికెను. అతని యాలోచన సమంజసముగా నున్నదని నందు లామోదించిరి. జీవసిద్ధి తదనగుణముగానే మాటలాడెను. వారివారి చర్చలు విని, మహామంత్రి ముక్కుమీద వేలిడుకొని యిట్లనియెను-

"ఇవి యేమి యాలోచనలు? శత్రువులు దాడి మొదలిడి, మార్గములందుఁ గల ఇంద్రప్రస్థ, హస్తినాపుర, కాశీ, కన్యాకుబ్జాది దుర్గము లన్నింటిని వశపఱచుకొని,

రాజధానిని జుట్టుముట్టునందాక, మనమును, మన సైనికబలములును గాజులు దొడిగించుకొని కూర్చుండవలెనా? ఇది యెక్కడి యుద్ధనీతి? సైనిక సర్వాధికారుల కీయాలోచన స్వయముగాఁ దోఁచినదా? లేక, యెవ్వరయినఁ జెప్పి పెట్టిరా?'' అని మోమాటములేక యడిగెను.

"నేను సర్వ సేనానులతోడను నాలోచించియే యీ నిశ్చయమునకు వచ్చితిని'' భద్రశాలుఁడు పలుకఁగా, నామీఁదట జీవసిద్ధి యందుకొని-

"ప్రధాన దండనాయకులు పలికినదానిలో నపసవ్య మెద్దియుఁ గాన్పింపదు. మరియు, నా యాలోచన మిక్కిలి క్షేమదాయకమైనది కూడనైయున్నది. ఏమందురేని, శత్రుసేనలు నలుదిక్కులనుండియు వచ్చి పడుచున్నవి. వాని నెదురించుటకుఁ బంపవలెనన్న, మన సేనలఁగూడ చతుర్విభాగములు చేయవలెను. అప్పుడు ప్రతియొక భాగమును బలహీనమయియే యుండును. అంతే గాక, సేనలు చీలి పోయినప్పుడు, రాజధానికిఁ జాలినంత రక్షణ యుండదు. రాజధానిలోని ధనాగారములకును క్షేమము లేదు. కనుక సర్వ సేనలును రాజధానియందుండుటయే మంచిది. శత్రువు లెన్ని దిక్కులనుండి వచ్చినను, మనము దుర్గములోనుండియే వారి నెదిరించి పారఁ దోలవచ్చును.''

అని, జీవసిద్ధి వివరించినదానిని నందులతోఁబా టితర ప్రముఖులెల్లరు నామోదించిరి. మహామంత్రియైన రాక్షసుఁ డా సందర్భమున నిస్సహాయుఁడయ్యెను. అతనివాద మోటమిని పొందెను. ''ఇక్కడ సైన్యములను శత్రువులమీఁదికిఁ బంపకపోయినను, కనీస మాయాదుర్గములకుఁ గావలియున్న సైన్యములయినను, శత్రువులు ముట్టడించినప్పు డెదిరించి పోవలెనని యాజ్ఞలు పంపవలెను'' అని రాక్షసమంత్రి యనఁగా-

"ఆ పని తప్పక జరుగవచ్చును!'' అని నందు లామోదించిరి. మిగిలినవారును కాదనలేదు.

నందులు గావించుకొన్న యీ యేర్పాటులను, జీవసిద్ధి చారులమూలమునఁ జాణక్యునకుఁ దెలియఁజెప్పెను. తోడనే చాణక్య చంద్రగుప్తులు సర్వసైన్య సమేతముగా యమునానదిని దాఁటి, యింద్రప్రస్థమును ముట్టడించిరి. ఆ దుర్గనాయకుడు తన మగధరాజధానినుండి సైనిక సాహాయ్యము రాదని ముందుగానే తెలిసికొన్నవాఁ డగుటచే, శత్రువుల నెదిర్చి ప్రయోజనముండదని గుర్తించి, వెంటనే దుర్గద్వారములను

దెరిపించి, కోటను చంద్రగుప్తాదుల వశమొనర్చెను. ఇదేప్రకారము, మిగిలిన దుర్గపాలకులు నిస్సహాయులై తమతమ దుర్గములను పోరులేకయే చాణక్య చంద్రగుప్తులకు వశమొనర్చిరి. చంద్రగుప్తు డాయా దుర్గ పాలకులకును బ్రజలకును నభయ మొసఁగుచు, మగధ రాజ్యమున నే ప్రాణికిఁగాని, ఎవరి యాస్తులకుగాని హాని జరుగరాదని నాయకుల నాజ్ఞాపించెను.

విశేష జననష్టము లేకుండగను, రాజధాని రక్తపాతము గాకుండగను, విజయమును పొందవలెనని చాణక్యుఁ డంటకుమున్నే చంద్రగుప్తున కుపదేశించెను. తదనుగుణముగానే వారు యుద్ధక్రమమును నడుపుచుండిరి. ఆ నాఁడు పౌర్ణిమ, సోమవారమైనది. అసంఖ్యాకములయిన శత్రుసేనలు రాజధానిని జుట్టు ముట్టి, లోని కరుదెంచుచుండెను. నందు లిఁక నుపేక్షఁ జేయకూడదనుకొని, యా మరునాఁటి మంగళవారమున సర్వసన్నద్ధులై, తొమ్మండుగురును తొమ్మిది బంగారు రథములపై రణరంగమునఁ బ్రవేశించిరి. ఆ రంగమున నిరు తెగలకును పోరు ఘోరమయ్యెను. రక్తపుకాలువలు వెల్లువలై పాఱఁ జొచ్చెను. అది గుర్తించిన చాణక్యుఁడు, శత్రుసేనలకు భయపడి పలాయితుఁడగునట్లు నటింపవలసినదిగాఁ, బర్వతకున కుపదేశించెను. అతఁ డట్లే పగతులకు వెన్నిచ్చి పలాయనమగుచుండుటను దెలిసి, నందులు వానిని తరిమి పట్టుకొనుటకుఁ బోయిరి. ఆ యదనునఁ జాణక్యుఁడు, తన సేనలను మరలించి, నందుల ననుసరించెను.

ఒక రంగమునఁ బర్వతకుఁడు హఠాత్తుగా పలాయనమునాపి, శత్రువులవైపు మరలెను. నందు లాతనిధాటికిఁ దాళలేక వెనుక మరలిన సమయమున, చాణక్యుడు తన సేనలతో వారి కెదురాయెను. వారప్పుడు శత్రువ్యూహమునఁ జిక్కుకొన్న విషయమును గ్రహించి ధైర్యముఁ గోలుపోయిరి. ఇటు చాణక్యుఁడు, అటు పర్వతకుఁ డును దమ సేనలతో ముందుకురికి, దూదిపింజలయట్లు శత్రు శిరస్సులఁ దునుమాడుచు, నందులను సమీపించుచుండిరి. నందు లింక ప్రయోజనము లేదనుకొని, రథములపైనుండి యురికి హస్తఖడ్గములతోఁ బోరనారంభించిరి. చాణక్యుఁ డు తన సైన్యములను దాఁటి ముందుకుఱికి-

"బ్రాహ్మణావమానము గావించిన పాపులు ! మీ కందుల కిదియే తగిన ఫలిత మనుచు నొక్కవ్రేటుతో నా తొమ్మండుగుర శిరస్సులను దెగనేసి, వారు నేలఁ గూలిన వెంటనే రక్తహస్తములతో తన జీరాడు కురులను ముడివేసికొనియెను. చాణక్యునిచే నందులు నేలఁగూలిరను వార్త తెలియఁగనే, మఱియొక రంగమునఁ

జంద్రగుప్తునితో నవక్రపరాక్రమంబునఁ బోరుచున్న రాక్షసామాత్యుడు నిర్విణ్ణుఁడై, కరమునందున్న కరవాలమును నేలరాల్చి కోటకు మరలవలసినదని, తన దళముల నాజ్ఞాపించెను. నందనాశముతో నెక్కడివా రక్కడ చెల్లాచెదరై చల్లారిరి. రాక్షసామాత్యుఁడు చాణక్యునిఁ బ్రార్థించి, నందుల మృతకళేబరములను గోటకుఁ జేర్పించిన తదుపరి, నందవృద్ధుఁడగు సర్వార్థసిద్ధిచే నా మృతదేహములకు శాస్త్రవిహితముగా నంత్యక్రియలఁ జేయించెను. అంతేకాక, నందవంశ మంతటితో నిర్మూలముగాకుండ, సర్వార్థసిద్ధినే పాలనాభారమును వహించవలసినదిగాఁ గోరెను. కాని, యప్పటికే విరక్తుఁడై యున్న యా వృద్ధుఁడు రాక్షసామాత్యుని పలుకులఁ బెడ జెవినిఁ బెట్టి తపోవనముల కరిగెను.

అప్పటికి గత్యంతరములేక మహామంత్రి, తాత్కాలికముగఁ జంద్రగుప్తునికే రాజ్యభారము నప్పగించి, నిదానముగఁ బ్రతీకారముఁ జేయ నిశ్చయించెను. చాణక్య చంద్రగుప్తులను నాశమొనర్చినఁగాని, తన యాత్మకు శాంతి యుండదని యాలోచించెను. చాణక్య చంద్రగుప్తులు సపరివారముగఁ బాటలీపుత్ర దుర్గమునఁ బ్రవేశించిరి. సైనిక బృందములు విజయాట్టహాసములు గావించుకొనుచు, నగరము నాక్రమించిరి. కాని, రాక్షసామాత్య పర్వతకులవలనఁ జంద్రగుప్తున కే క్షణమున నేప్రమాదము సంభవించునో యని, చాణక్యుఁడు వేయికన్నులఁ గనిపెట్టుచుండెను. రాక్షస, సర్వార్థసిద్ధి, పర్వతప్రముఖులను సంహరించినఁగాని, చంద్రగుప్తుని మార్గము నిష్కంటకము గాదనియుఁ దన ప్రతిజ్ఞ సాంతమొందదనియుఁ జాణక్యుఁడు తనలో ననుకొనియెను. అంతియేకాక, యందులకు వివిధమార్గముల నన్వేషింపఁ దొడఁగెను. పర్వతకుఁడు తన కర్ధరాజ్యము వచ్చునని విఱ్ఱవీగుచుండెను. రాక్షసామాత్యుఁడది గమనించి, యొక దినమున చంద్రగుప్తునిఁ జేరి-

"మేము చిరకాలమునుండి నందరాజ్యమున నమాత్య పదవిలో నుండి సేవించుచున్నాము. మీ రాజరికమునఁ గూడ, నట్లే జరుగవలయునని మా కోరిక. మరియు మీరు ప్రభువులగుటను బ్రజలు సంతోషముతో నంగీకరించుచున్నారు. కాని, విదేశీయుఁడైన పర్వతకున కర్ధరాజ్యమిచ్చుటను సహించరు." అనియెను.

చెంతనున్న చాణక్యుడది, తన యాలోచనల కనుకూలించు విషయము గనుక 'వల్లె' యనియెను. రాక్షసుని మంత్రిగానే యుంచి, పర్వతకునికి తన సహాయమున నర్ధరాజ్య మిచ్చుటను మానవచ్చునని యాలోచించెను. అప్పటికిఁ దన మంత్రిపదవి నిలిచెను గదా యని రాక్షసుఁడును సంతసించెను. తమ కామహాయుద్ధమున సహకరించిన కళింగ, కామరూపాది భూపతులకు, మిత్రులకుఁ చాణక్యుఁడు

చంద్రగుప్తునిచే రత్నసువర్ణాదులను విరివిగా నిప్పించి, సత్కరించి, తిరిగి వారెల్లరు చంద్రగుప్తుని పట్టాభిషేక మహోత్సవమునకు రాఁగలరని హెచ్చరించి, వారి వారి దేశములకుఁ బంపెను.

## 9. మారణయంత్రము :

రాక్షసుఁ డేయుద్దేశముతో మంత్రిపదవిని గోరెనో యతఁ డా యుద్దేశములను వెంటనే నమలు జరిపింప సాగెను. వనములందు తపోనిష్ఠలో నున్న సర్వార్థసిద్ధి చంద్రగుప్తునకు దేవుని ప్రసాదము పంపెనని చెప్పి, విషముఁ గలిపిన పదార్థమును చంద్రగుప్తున కొసఁగెను. చారుఁడగు సిద్ధార్థకునివలనఁ చాణక్యుఁ డీసమాచారమును ముందుగనే యెఱిఁగి యా విష పదార్థములను దానందుకొని, చంద్రగుప్తునకు వేఱుపదార్థము లంపెను. ఆ విషపదార్థమును రాక్షసుఁ డంపినటుల తిరిగి సర్వార్థసిద్ధికే పంపెను. విష పదార్థములు భక్షించి సర్వార్థసిద్ధి మరణించె ననువార్త వెంటనే రాక్షసునికిఁ జేరెను. తన ప్రయత్నము వక్రించినదని తెలిసికొని, రాక్షసమంత్రి విభ్రాంతుఁడయ్యెను.

వృద్ధమహారాజు మరణించి నప్పటికిని, తా నంతకాలమా కొలువులోనుండి వారి సొమ్ము దినుచున్నందులకు, మౌర్యుడు సింహాసన మెక్కకుండఁ జేసి రాక్షసమంత్రి నందుల ఋణముఁ దీర్చుకొన నెంచెను. చంద్రగుప్త, పర్వతకులకు వైరము గల్పించుట యొకపని యనుకొని, రాక్షస మంత్రి వెంటనే పర్వతకునిఁ గలసికొని, యాతనిని చక్రవర్తిగా నొనర్తుననియు, చంద్రగుప్తుని సంహరింపవలసినదనియు నుపదేశించెను. చంద్రగుప్తుఁడు, తన మేనగోడలయిన శాంతిమతికి భర్తయగుటఁజేసి, పర్వతకుఁడు చంద్రగుప్తుని సంహరించుట కంగీకరింపలేదు గాని, యతని రాజ్యమును గబళించుట కంగీకరించెను. అందువలన రాక్షసామాత్యుఁ డితర ప్రయత్నములకుఁ బూను కొనియెను.

ఒకనాఁటి రేయి, పర్వతక చంద్రగుప్తులు చదరంగమాడుచు క్రీడా వినోదములఁ గాలముఁ గడుపుచుండిరి. ఆ సమయమున పర్వతకుఁడు మధుపానముఁజేసి యొడలు మఱచి యుండెను. ఆ విషయముఁ దెలియని రాక్షసామాత్యుడొక విషకన్యను సృష్టిఁ జేసి యామెను చంద్రగుప్తునికిఁ గాన్కగాఁ దెచ్చి సమర్పించెను. పర్వతకుఁ డాకన్యను గాంచి మోహించెను. ఆ సమయమున, నందేయున్న చాణక్యుఁ డదను జారవిడువక - "పర్వతకులు పెద్దలు - మాకు విశేషించి గౌరవనీయులు, వారి కోరికఁ దీర్చుట

మాకు విధి. కనుక, వారు కామించుచున్న యీ కన్యను వారికి సమర్పించవలెను'' అనెను. చంద్రగుప్తుడు వెంటనే తనకు సమర్పించఁబడిన మోహనాంగిని బర్వతకున కొసఁగెను. మధుపానమత్తుఁడైన పర్వతకుఁడు మోహావేశుడై, పట్టలేని యానందముతో కన్యాకరగ్రహణము మృత్యుదేవతా పరిగ్రహణమని తెలియక, ఆమెతో శయ్యామందిరమున కేగెను. జరిగిన విపరీత సంఘటనకు రాక్షసామాత్యుఁడు నోట మాట లేక, యెట్లెట్లో చాణక్య చంద్రగుప్తులయొద్ద శెలవు దీసికొని యప్పటికి వెడలిపోయెను.

తెల్లవాఱుసరికి, పర్వతకుఁడు శయ్యాగారమున మరణించియుండె నను వార్త గుప్పుమనియెను. విషకన్య మాయమయ్యెను. రాక్షసామాత్యులవారు విషకన్యను సృష్టించి పర్వతకునిఁ జంపిరని చాణక్యుఁడు నగరమంతటను సాటింపించెను. ఈ యపరాధము తలపైఁ బడెనని తప్పించుకొనుటకు రాక్షసమంత్రి భార్యాబిడ్డలను చందనదాసుఁడను నొక వర్తకునియింట నుంచి, తాను నగరము వదలి పరారి యయ్యెను.

రాక్షసామాత్యుఁడు పరారియయ్యుఁ దన ప్రతీకార ప్రయత్నము లంతటితో మానలేదు. చంద్రగుప్తునకు పట్టాభిషేకము జరిగించుటకు శుభ ముహూర్తము నిర్ణయించబడినదని తెలిసికొని, దారువర్మ యనునొకశిల్పిచే చంద్రగుప్తునిఁ జంపించుట కొక మారణ యంత్రమును నిర్మింపఁ జేసెను. ఆ మహోత్సవ సమయమున బంగారు తోరణములలో నా మారణయంత్రము నమర్చి, చంద్రగుప్తుఁ డేగుమార్గమునం దలంకారముగా దానిని వ్రేలఁ గట్టించెను. దారువర్మ గావించు నీ మారణ ప్రయత్నములో రాక్షసామాత్యునకు మఱియొక మిత్రుఁడైన వైరాంతకుఁ డను మావటివాఁడు సహకరించెను.

రాక్షసామాత్యునిచే బన్నఁబడిన యీ తంత్రమును జాణక్యుఁడు చారులవలన ముందుగనే తెలిసికొని, యా మారణయంత్రమున కెవరిని బలిచేయవలయునా యని యోచించెను. శత్రుకూటమునకు జెందినవారిలో నప్పటికొక్క 'వైరోచకుఁడు' మాత్రమే మిగిలియున్నట్లు దెలిసికొని, వెంటనే యతనికడకేగి యిట్లు చెప్పెను.

"నాయనా! నీ మిత్రులు గతించినందుకు నీ వెక్కువ విచారపడుచుందువు. కాని పర్వతక, రాక్షసాదులకు నేను గావించిన యపకృతి గోరంతయును లేదు. ఎవరు త్రవ్వుకొన్న గోతిలో వారే పడిరి. చంద్రగుప్తుఁడు ప్రభువైనను రాక్షసుని నెప్పటివలె

మంత్రిగా నుంచి, యతని కోరికను నెరవేర్చితిని. కాని, యతఁడు నిలుపుకొనలేక పోయెను. పర్వతకున కర్ధ రాజ్యమిచ్చి యొడంబడికను నెఱవేర్చ నేను సిద్ధముగా నున్నప్పు డాతఁడు, విషకన్యచే దుర్మరణమునందెను. పోనీ యతని, కొమారుఁడైన మలయకేతువునకే తండ్రి కీయవలసిన అర్ధరాజ్య మీయఁదలఁచినప్పు డాతఁ డేరికినిఁ జెప్పకయే పరారియయ్యెను. వారి కాప్తులయిన వారిలో నీ వొక్కఁడవుగదా యున్నావు! ఆ యర్ధ రాజ్యమును నీకయిన నిచ్చి, మా యొడంబడికను నెఱవేర్చవలయునని నా కోరిక! అందులకు నీ వేమందువు?''

"సిరిరా నెవరు మోఁకా లొడ్డుదురు స్వామీ! మీ యుదార సంకల్పము చాల మంచిది. కాని, నా కర్ధ రాజ్యమిచ్చుటను ప్రజలంగీకరింతురా యని!'' "ప్రజల నంగీకరింపఁ జేయువాఁడను నేను! కాని, యా సంగతి వారికి ముందుగఁ దెలియఁ గూడదు.''

"అదియెట్లు?''

"నీవు చంద్రగుప్తుని వలెనే దుస్తులు ధరించి, యతఁ డధిరోహించు భద్రగజమునే యధిరోహించి, లాంఛన యుక్తముగ నభిషేక స్థలమున కరుదెంచితి వేని - యెల్లరు, నీవే చంద్రగుప్తుఁడ వనుకొందురు. నీకే పట్టాభిషేకము జరుగును. ఆ తరువాత, ప్రజలకుఁ దెలిసినను నష్టము లేదు. వారికిఁ జెప్పఁగల రీతులను, ఒప్పించఁ గల పద్ధతిని - నేనీ వఱకే యాలోచించుకొని యుంటిని. నా యందు విశ్వాసమున్న, నీ వీయేర్పాటున కంగీకరించి, మగధ సామ్రాజ్యమునకు సార్వభౌముఁ డవుగమ్ము.''

అని చాణక్యుఁడు పెక్కు రీతులఁ జెప్పఁగా నా దురాశాపాశ బద్ధుఁడు కాదనలేక పోయెను. చాణక్యుఁడు చెప్పినట్లు చేయుట కంగీకరించెను.

చాణక్యుఁడు ప్రకటించిన శుభముహూర్తమునకుఁ, జంద్రగుప్తుని పట్టాభిషేక మహోత్సవమును గనులారఁ దిలకించుటకు వివిధరాజ్యముల నుండి, పెక్కురు ప్రముఖు లరుదెంచిరి. పాటలీపుత్రనగరవాసు లెల్లరు సర్వాలంకృతులై, తమరేని వైభవమును జూడవచ్చిరి. నగరమంతయు దేవేంద్ర వైభవముగ శృంగారింపఁ బడెను. ఆ శుభసమయమున వైరోచకుఁడు చంద్రగుప్తుని దుస్తులు ధరించి, యతని స్వర్ణాభరణముల తోడనే యలంకరించుకొని, చాణక్యుఁ డుపదేశించిన ప్రకారమే భద్రగజము నెక్కి యభిషేక స్థలమున కరుదెంచుచుండెను. ప్రజలెల్లరాతఁడు చంద్రగుప్తుఁడే యనుకొని, కంఠమునుండి ముఖార్ధభాగము వఱకుఁ, బూలమాలలతో

నలంకరించిరి. ముందు వెనుకల, సైనిక పరివారము లరుదేర భేరీ, ఢంకా, మృదంగాది మంగళ వాద్యములు మిన్నుముట్టుచుండ, నా యుత్సవము మంగళ తోరణము సమీపించు సమయమున, దారువర్మ ప్రక్కన నక్కియుండెను. అనుచరుఁడైన మావటీఁడు దారువర్మకంటె ముందు తానే యా ఘనకార్యమును నెఱవేర్చి, రాక్షసామాత్యుని మన్ననల నందవలయు నని, మొలయందుంచుకొన్న బాకును లాగి, చంద్రగుప్తుఁడుగా నున్న వైరోచకునిఁ బొడువఁ జూచెను. అతని యలజడికి జంకి భద్రగజము వెనుకంజవేసెను. అందువలన వైరోచకునిపైఁ బడవలసిన మారణ యంత్రము మావటివానిపైఁ బడఁగా, తానే యేనుఁగుపై కుఱికి, వైరోచకునిఁ బొడిచి చంపెను. చంద్రగుప్తుఁడు హతుఁడయ్యెనను హాహాకారములు చెలరేగెను. సైనికు లావెనువెంటనే, దారువర్మను బట్టి తునాతునియ లొనర్చిరి. చాణక్యుఁ డావెనువెంటనే భద్రగజము నెక్కి నిలుచుండి ఉచ్చైస్వరముతో, హత్యచేయఁబడినవాఁడు చంగ్రగుప్తుఁడు గాఁడనియు, నాతఁడు శత్రు పక్షమునకుఁ జెందిన వైరోచకుఁడనియు, చంద్రగుప్తుఁ డా తక్షణమే భద్రగజము నెక్కుననియుఁ బ్రకటించెను.

చేరువలో నున్న చంద్రగుప్తుని కడ భద్రగజము మోఁకరించి శిరము వంచెను. అతఁడు గజారోహణ మొనర్చి యెల్లరకు నమస్కరించి-

"రాక్షసామాత్యులవారు పరోక్షమున నుండియు, నాకై మారణ యత్నములఁ జేయుచునే యున్నారు! అయినను, గురుదేవులైన చాణక్యులవారు నాయండ నుండునంతకాలము, నేను సజీవుఁడనై యుండి యీ మగధ సామ్రాజ్యమునకును, ఇందలి ప్రజలకును శక్తివంచన లేక సేవలఁ జేయుదు నని ప్రమాణము స్వీకరించుచుంటిని. ఈ నాటి శుభముహూర్తము కేవలము, శత్రుతంత్రములను విచ్ఛేదించుటకై యేర్పఱుపఁబడినది గాన, చాణక్యుల వారు పట్టాభిషేక మహోత్సవమునకు సంతోషముఁ జేకూర్పఁగలరు. నేను చక్రవర్తి నయినప్పటికిఁ బ్రజాసేవకుఁడనే కాని ప్రభువును గాను!"

అని పలుకఁ బ్రజాసమూహము లొనర్చిన జేజే ధ్వనులతో భూనభోంతరాళములు నిండెను.

## 10. చాణక్యనీతి :

చాణక్యుఁ డానాఁ డొకింత మనఃక్లేశమున నేకాంతుఁడై యున్న సమయమున, చంద్రగుప్తుఁడు దర్శనార్థమై యరుదెంచి, యాయన తీరును గమనించి-

"ఆర్యు లీదినమున విచారగ్రస్తులై యున్నట్లు దోఁచుచున్నది. కారణ మారయవచ్చునా?" అని ప్రశ్నించెను.

చాణక్యుఁ డందులకు వెంటనే బదులు చెప్పకపోవుటవలనఁ జంద్రగుప్తుని మనసు మఱింత కలవరపడెను. "తమ ప్రతిజ్ఞ నెఱవేరినది ! మహాబల సంపన్నమైన మగధరాజ్యమును జయించి, నన్ను ప్రభువుగా నొనర్చితిరి! పట్టాభిషేక మహోత్సవమునకు ముహూర్తమును గూడ నిర్ణయించితిరి. ఇట్టి శుభసమయమునఁ దమ విచారమునకుఁ గారణము దెలియరాకున్నది."

"నాయనా! ఎన్నివిధములఁ బ్రయత్నించినను రాక్షసామాత్యుని జాడలు దెలియుటలేదు. అతఁడు పట్టుపడినఁ గాని, నా మనసునకుఁ గుదుట యుండదు. నీ పదవి సుస్థిరము కాఁజాలదు. మగధసామ్రాజ్యమునకు క్షేమముండదు. అందును గురించియే నా మనసిప్పుడు విశేషముగఁ గలవర పడుచున్నది."

"అతఁడు మనకుఁ బ్రబల శత్రువుగదా!"

"కనుకనే వానినిఁబట్టి తీరవలెను."

"పట్టి మరణదండన విధించెదరా?"

కాదు వాని అద్వితీయమేధాగుణ సంపత్తిని, ప్రజ్ఞా విశేషమును మన మామోదించి తీరవలెను. నందులయెడ నాతనికిఁ గల స్వామిభక్తి విశ్వాసము అపారము. అట్టి బుద్ధిమంతుని మంత్రిగాఁగొను రాజ్యము గొప్ప యదృష్టముఁ జేసికొనినదై యుండవలెను. నాబుద్ధి కింతటి శ్రమను కలిగించుచున్న అతనిదే ప్రజ్ఞ! ఆతనిదే ప్రతిభ! ఏనాఁటికయిన నాతని సాధించి, పట్టి తెచ్చి, నీకు మంత్రిగాఁ జేసినఁ గాని, నా మనసునకు శాంతి కలుగదు."

"ప్రబలశత్రువును మంత్రిగా గ్రహించుటయా! అతఁడు ప్రతిభాశాలియే యగుఁ గాక! మహా మేధావియే యగుఁగాక! గర్భవిరోధి నెవరయిన మంత్రిగా నిర్ణయించుకొందురా స్వామీ!"

"అతని శత్రుత్వము నాపైఁ గాని, నీపై నెంత మాత్రముఁగాదు. రాక్షసుఁడు నిజమైన దేశభక్తుఁడు. అతని కీమగధ సామ్రాజ్యముపైనను, నందులపైనను అపారమైన ప్రేమ! ఇప్పుడు నందులు లేరుగనుక, యతని ప్రేమ విశ్వాసములు నీపై మఱలఁ

గలవు. నీకతఁ డమాత్యుఁడైన నాఁడు, మగధ సామ్రాజ్యలక్ష్మి నీ చేతులలోఁ గలకాలము మనఁగలదు.''

"గురూత్తమా! ఇప్పు డారాక్షసామాత్యుఁ డెందున్న దియుఁ దెలియుట లేదందురా?''

"అవును, తెలియుటలేదు. విశ్వప్రయత్నములఁ జేసియు, విఫల మనోరథుఁ డ నగుచుంటిని. తను సృష్టించిన విషకన్యవలనఁ బర్వతకుఁడు మరణించినతోడనే, యా నేరము తనపైఁ బడునని గుర్తించి, యాతఁడు పరారి యయ్యెను గదా! అట్లు పోవునపుడు ఆలు బిడ్డలను చందన దాసునింట అతి రహస్యముగ నుంచెను. చారులవలన నే నా విషయము నెఱింగి, సిద్ధార్థకు నటకుఁ బంపితిని. అతనికి రాక్షసామాత్యుని ముద్రికమాత్రమే లభించినది!''

"అదియెట్లు లభించెను?''

"ఆ ముద్రిక నాతని భార్య ధరించియుండ, ఏమరిక వలనఁ బోఁగొట్టుకొన్నది. అద్దానిని మన సిద్ధార్థకుఁ డెట్లో సంపాదించి నా కొసంగెను. నే నాముద్రిక నుపయోగించి, కొన్ని కార్యములు సాధింపఁ గలిగితిని. కాని, ఆమంత్రి శేఖరుఁ డింకనుఁ బట్టుపడునట్లు లేదు.''

అని చాణక్యుఁడు చంద్రగుప్తున కింకను మఱికొన్ని రీతులు పలికి, వానిని సాగనంపిన కొన్ని క్షణములకు సిద్ధార్థకుఁ డరుదెంచెను.

"స్వామీ! తమయాజ్ఞ ననుసరించి చందనదాసును గొని వచ్చితి'' నని యాతఁడు పలుక, చాణక్యుఁ డా వెను వెంటనే చందనదాసును లోనఁ బ్రవేశ పెట్టించెను. అంత, చందనదాసు చాణక్యునకు నమస్కరించి-

మావలనఁ గాఁగలకార్యమెట్టిదో శెలవిండు!''

"పూర్వపు రాజులవలె చంద్రగుప్తుఁడు మీనుండి ధనలాభమును గాంక్షింపఁడు. మీరాయన కపకృతిఁ జేయకుండుటయే మహోపకారము.''

చందనదాసుఁ డామాటకుఁ ద్రుళ్ళిపడి, యొకింత తడవు సంబాళించుకొని తిరిగి-

"నేను గావించిన యపకృతి యేమి స్వామీ!"

"శత్రుకుటుంబమును నీయింట దాచిపెట్టుట రాజ ద్రోహము కాదా?"

వెలవెలఁబోవుచున్న ముఖముతోఁ జందనదాసు-

"స్వామీ! వారు నాయింట లేరు. ఒకవేళ నున్నను నేను వారిని బట్టి యిచ్చి మిత్రద్రోహమునకుఁ బాల్పడువాఁడనుగాను."

"రాజద్రోహమునకుఁ బాల్పడుదువా?"

"రాజద్రోహమని మీకుఁదోఁచిన శిక్షింపుఁడు."

"రాక్షసామాత్యుని యుదంతమే నీకుఁ దెలియదందువా?"

"తెలిసినను జెప్పఁదలఁప లేదనుచుంటిని."

"చావునకుఁ గూడ సిద్ధముగ నుంటిని."

"చందనదాసూ! తలారులు ని న్నురికంబముపై నెక్కించి శిరశ్ఛేదముఁజేయు సమయమున నేమిత్రుఁడును వచ్చి, నిన్ను రక్షింపఁజాలఁడు. మూర్ఖుఁడవై నీ యాలు బిడ్డల నేల వృథా దిక్కుమాలినవారినిఁ జేయుదువు? సత్యము నంగీకరించి, రాక్షసామాత్యుని కుటుంబమును మా కప్పగింపుము."

"సర్వమానవులకుఁ బ్రాణము లెప్పుడో యొకప్పుడు పోవలసినవే. ఒక మిత్రుని కొఱకు, అతని కుటుంబ రక్షణ కొఱకు, నాప్రాణము లుపయోగపడుచున్నందులకు నేనెంతయు సంతసించుచుంటిని" అని, చందనదాసు తన నిశ్చయమును దెలుపఁ గాఁ జాణక్యుఁ డాశ్చర్యమందెను. అంతలో సిద్ధార్థకుఁడు కొందరు రాజభటులను గొనివచ్చెను. చందనదాసును గొంపోవలసినదిగఁ జాణక్యుఁడు భటుల నాజ్ఞాపించి-

"ఈతఁ డొనర్చిన రాజద్రోహాపరాధమునకుఁగాను, మరణదండనఁ బొందుచున్నాఁడు" అని యెల్ల తావులయందును వివరముగఁ జాటింపించిన యనంతరము మాత్రమే వీనికి దండన జరుగవలయు" నని సిద్ధార్థకున కుపదేశించి పంపెను. అనంతరము, భటులు చందనదాసును బంధించి కొంపోయిరి.

చంద్రగుప్తుఁడు సిద్ధార్థకునివలనఁ జాణక్యుని యాజ్ఞనెఱిఁగి, మొదటఁ దెల్లఁ బోయియు, ననంతరము రాక్షసామాత్యునిఁబట్టుట కదియు నొకతంత్రమై

యుండవచ్చునని గ్రహించి, ఆయన కోరినప్రకారము చందనదాసును వధించుట కాజ్ఞలు పంపెను.

## 11. చంద్రగుప్త విజయము :

చంద్రగుప్తునిఁ జంపుటకు దాఁపన్నిన మాయా తంత్రములకు, మారణ యంత్రములకుఁ బర్వతక వైరోచకులు బలియైనదాదిగఁ దనయాత్మరక్షణ కొఱకుఁ బరారియైన రాక్షసామాత్యుఁ డా నాఁటనుండియు, వృషపాలారణ్యములయందొక గుహలోఁ బ్రచ్ఛన్నముగఁ గాలము గడుపుచుండెను. నందులు నశించినను మగధ సింహాసనమునెడ నాతనికిఁ బూజ్యభావము నశింపలేదు. తానంతవఱకుఁ గుడిచిన నందరాజుల యన్నమునకుఁ బ్రత్యుపకారము జరిగి, వారి ఋణముఁ దీర్చవలెనన్న, స్వర్గీయులైనవారి యాత్మలకు శాంతి చేకూర్చవలెనన్న, వారికి గర్భవిరోధులయిన చంద్రగుప్త చాణక్యులనుఁ దుదముట్టించుటయే యని యాతఁ డెఱిఁగెను. అందులకై తీవ్రప్రయత్నములు జరుపుచుండ నొకనాఁడు పాములవాని వేషముతోఁ బాటలీపుత్ర మున మెలఁగి, యచటి రహస్యవార్తలఁ దెచ్చు విరాధ గుప్తుఁ డరుదేరగా నమాత్యుఁ డాత్రమున-

"మిత్రమా ! పాటలీపుత్రమునందలి విశేషములేమైన నున్న వెంటనే వివరింపుము!" అనియెను. అంతట నా చారప్రముఖుఁడు నిట్టూర్చి-

" మహాప్రభూ! ఇతర విశేషముల కేమిగాని, యింతవఱకుఁ దమ సంసారమును సంరక్షించుచున్న చందన దాసునకుఁ జంద్రగుప్తునిచే మరణదండన విధింపఁబడినది. రేపటి సూర్యాస్తమయ ఘడియలలో నతనికి శిరశ్ఛేదము జరుగునఁట!"

ఇట్లు చెప్పగాఁ బిడుగువంటి యా దుర్వార్తను విని రాక్షసామాత్యుఁడు మొదలు నఱికిన తరువువలెఁ గూలి-

"శివ శివ! నాకే కాక, నా మూలమున నా మిత్రులకుఁ గూడ నెట్టి యిక్కట్టులు వాటిల్లెను! ఈ సమాచారమును నీవెట్లు తెలిసికొంటివి? శిక్షకుఁ గారణమేమి?" అని యడిగెను.

"పర్వతకాదుల మరణములకుఁ గారణభూతుఁడును, చంద్రగుప్తుని హత మార్చుటకుఁ బూనుకొనిన రాజద్రోహియు నయిన రాక్షసామాత్యుయని కుటుంబమును దాఁచి, తానును రాజద్రోహ నేరముఁ గావించెను గనుక,

చందనదాసునకు మరణదండన విధింపఁబడినదని, యెల్ల తావుల యందును జాటింపులు జరుగుచున్నవి. చాణక్య చంద్రగుప్తులిక్కార్యమును రహస్యముగఁ జేయుటలేదు...''

ఇట్లు చారప్రముఖుఁడు చెప్పుచుండ, నమాత్యుని నేత్రము లశ్రుపూరితములాయెను.

నేనింతదనుక బ్రతికియున్నది మిత్రుల చావు కబురు వినుటకే కాఁబోలు ! 'మిత్రమా ! నీ కుటుంబము నా యింట సురక్షితముగనున్నది. వారలకై నీవెంతమాత్రమును దిగులు పడవలసినదిలేదు. నిర్విచారముగ నీ పనులఁ జక్కఁ బెట్టుకొనుము.' అని చందనదాసు నాకు వార్తనంపినపుడెల్ల పరమానందభరితుఁడ నగుచుండెడివాఁడను. ఇంకేమున్నది? చందనదాసు బంధితుఁడై కొంపోఁబడినపుడు నా భార్యాబిడ్డలే గతిని బొందిరో-''

''చందనదాసు, తనకు రానున్న ముప్పును ముందుగనే పసిగట్టి తమ కుటుంబమును మఱియొక సురక్షిత స్థలమునకుఁ బంపెనఁట. ఆ చోటు తనకుఁ గూడఁ దెలియదని చందనదాసుని భార్యవలనఁ దెలిసికొంటిని.''

''మిత్రమా! చందనదాసూ! నాకై నీవు ప్రాణములర్పించుచుండ, నేనీ రహస్యస్థలమున నసువులు బిగఁబట్టుకొని యుండుట నీతియే ! ఇదిగో, నేను నీ వెనువెంటనే వచ్చుచుంటిని. శత్రుకూటమున నుఱికి, మిత్రరక్షణమునో, లేక, మరణమునో పొందువాఁడ!''

ఇట్టి గంభీరోక్తులతో నమాత్యుఁడు దుఃఖోద్రేకములు మనమున నినుమడింప, గుహాప్రదేశమును వీడి, ఒడలుదెలియని వానివలెఁ బర్వులిడుచుండ, చారప్రముఖుఁడైన విరాధ గుప్తుఁడును, వాని ననుసరించెను, వారిరువురు నొకరితరువాత నొకరు క్రమముగాఁ బ్రయాణమునలిపి, నాఁటిమధ్యాహ్నమునకుఁ బాటలీపుత్ర సమీపారణ్యమునందుఁ జేరిరి.

అమాత్యరాక్షసుఁ డా వనమున నిలిచియుండెనను వార్త, యప్పటికప్పుడే చాణక్యుఁడు తన గూఢచారుల వలన నెఱిఁగెను. నిపుణకుఁడను ప్రియశిష్యు నొకనిఁ బిలిచి, యాతఁ డాచరింపవలసినరీతుల నన్నింటినిఁ జెప్పి, అమాత్య రాక్షసుఁడుండు వనమునకుఁ బంపెను.

అట, వనమున రాక్షసునికి కనుచూపుమేరలో నొకచోటఁ బెనుమంటలఁ దిలకించి, వడివడిగ నాతావునకుఁ బోయెను. అమర్చబడియున్న యొక చితినుండి యాకసమెత్తున కెగయుఁ బెను మంటలలో నుఱుక నుద్యుక్తుఁడైయున్న యొక పౌరుఁడు గాన్పించెను. రాక్షసామాత్యుఁ డతని ప్రయత్నమును వారించి-

"ఓయీ! నిండుప్రాణములఁ దీసికొన నీవిట్టి సాహస కార్యమునకేల పూనుకొంటివి? చచ్చి సాధించునదెవరిని? బ్రతికియుండినఁగదా సుఖములు వడయవచ్చు!" ననెను.

"నేను ధనపాలుఁడను నొక వర్తకుఁడను. పాటలీ పుత్ర నివాసిని. నాకు దయానిధియను నొక సోదరుఁడు కలఁడు. వానికిని, జందనదాసను నొక వ్యాపారికినిఁ బ్రాణ స్నేహము. ఆ చందనదాసు, రాక్షసామాత్యుఁడను నొక రాజద్రోహి కుటుంబమును దనయింట దాఁచెనఁట. అది యెఱిఁగిన ప్రభువు లాతనికి మరణదండన విధించిరి. నా సోదరుఁడు, మిత్రుఁడైన చందనదాసును రక్షింపఁగోరి, ప్రభువైన చంద్రగుప్తుని దర్శించి-

"నా మిత్రునికి బదులు నన్నుఱిదీయింపుఁడు. చందన దాసు ఆలుబిడ్డలు గలవాఁడు. నే నవివాహితుఁడనైన యేకాకిని. నా మిత్రుఁడు మరణించిన నతని దారాపుత్రులు మరణించిన భూభారము తగ్గునే గాని, అంతగా దుఃఖితులై నాపై నాధారపడువారు లేరు. కనుక, దయయుంచి చందన దాసుకు బదులు నన్నుఱిదీయింపుఁడు" అని పెక్కు రీతులఁ బ్రార్థించెనఁట.

అందులకు మహారాజు నవ్వి-

"ఇది నంద పరిపాలన గాదు. కనుక నీవు కోరినట్లు జరుగదు. నేరము చేసినవాఁ డు మాత్రమే శిక్షింపఁబడు!" నని చెప్పి పంపివేసెను.

"అంత నా సోదరుఁడు మితిలేని దుఃఖమందుచుఁ దన ప్రాణ సఖుఁడు మరణింపకమునుపే తా నాత్మహత్య చేసికొని మరణింపనై యుండెను. దయానిధి మిత్రునికొఱకే యంతటి త్యాగము జేయుచున్నప్పు డాతఁడు నాకు సోదరుఁడుగదా! ఏకగర్భజనితుని దుర్మరణమును విని, నేనెందులకు బ్రదుకవలెను? అందులకే యిపుడిట్టి మరణమునకై పూనుకొంటిని. తమరు నన్ను వారింపఁ బనిలేదు."

అని ధనగుప్తుఁడు చెప్పఁగా విని, రాక్షసామాత్యుఁడు-

"ఔరా! నాకై దుర్మరణము నందుచున్న చందనదాసు కొఱకు, నే నాచరింపలేని త్యాగము నాతని మిత్రుఁడు చేయుచుండెను. సర్వజ్ఞుఁడననియు మహామంత్రి ననియుఁ జెప్పుకొనఁబడుచున్న నేను సామాన్యులవలెఁ గూడఁ బ్రవర్తింపలేక పోయితిని."

అని తనలో నొకింత తడవు విచారించి, రాక్షసామాత్యుఁ డనంతర మా ధనగుప్తునితో నిట్లనియెను.

"అయ్యా! ఆ చందనదాసు నాకును మిత్రుఁడే! వానికై మీపాటి త్యాగమును నేనును చేయఁగలను. అతని ప్రాణములు రక్షించుటకై యిదే బయలుదేఱుచుంటిని. చందనదాసు ప్రాణములను నేను గాపాడి తీరుదును. నీ వాత్మహత్యా కార్యమును విరమించుకొమ్ము-నీ సోదరునకుఁ గూడ నా ప్రతిజ్ఞ వివరించి, యాతనిఁగూడ బ్రదికించుకొమ్ము."

అనుచు రాక్షసామాత్యుఁడు మహోద్రేకమున నొఱనుండి కత్తిని దూసి బయలు దేఱుచుండ నా నూతన వ్యక్తి వారించి-

"అయ్యా! తమరెవరో నాకుఁదెలియదు. మీరు పోనున్నది వధ్యస్థానమే యైన, యటకుఁ గరవాలాది ఆయుధములను గొనిపోరాదు. ఆయుధపాణు లటఁ బ్రవేశించినఁ దలారులు మున్ముందు వారినే వధింతురు. అంతియేకాక, పాటలీ పుత్రమున నాయుధములు ధరించిన యే క్రొత్తవారు కనుపించినను వెంటనే వధింప వలసినదని రాజాజ్ఞ-" అనియెను.

"భళిరా! చంద్రగుప్తుని రక్షించుటకు జాణక్యుఁ డెన్ని విధుల నేర్పఱచెను! అతని రాజనీతికిని, పరిపాలనా దక్షతకును నేను జోహారు లర్పింపవలసినదే గదా!" అని రాక్షసామాత్యుఁడు తనలో దలంచి అస్త్రహీనుఁడై పయనమాయెను.

అంత ధనగుప్త వేషధారియై యున్న నిపుణకుండును, గురువు లాదేశించిన తెఱంగునఁ దానుఁ గృతకృత్యుఁ డయ్యెఁ గదా యని సంతసించుచు నా తావును వీడిపోయెను.

అట వధ్యస్థానమునఁ జందనదాసు బలిపీఠమున నిలుపఁ బడియెను. ఇరువురు చండాలురు ఖడ్గధారులై, వాని కిరుదెసల నిలిచి ఆజ్ఞలకై వేచియుండిరి. చెదరిన హృదయముతో నాతని యిల్లా లిందుమతి భర్తతోఁబాటు తన్నుఁ గూడ వధింపుడని

తలారులను వేఁడుకొనుచుండెను, బిడ్డల రక్షణకై యామె బ్రదుకవలెనని చందనదాసు భార్యకు హితవులు గఱపుచుండెను. అంతలో, వెనుక గోడపై నుండి యందుఱికిన వానిని జూచి తలారు లదరిపడిరి-

"ఓరీ! ఈ దండన జరుగుటకు వీలులేదు. నేను రాక్షసామాత్యుఁడను వచ్చితిని, పోయి మీ ప్రభువులకుఁ జెప్పుఁ" డనుచు మిత్రుఁడైన చందనదాసునుఁ గౌఁగలించుకొని-

"మిత్రమా! నావంటి నిర్భాగ్యుని కొఱకు నీవు ప్రాణము లర్పించుట ధర్మముకాదు. నీవంటి పుణ్యాత్ములీ భూమిపై నిలిచిన, లోకమునకు మేలు! సర్వనాశనమయిన పిదప నాకెట్టి యాశలు నుండఁగూడదు - నీకు బదులు నేనుఁ జావనెంచి వచ్చితిని."

అనుచుండ నంతలోఁ జాణక్య, చంద్రగుప్తు లట కరుదెంచిరి. చాణక్యుఁడు ముందుగ రాక్షసామాత్యుని సమీపించి-

"ఆమాత్యశేఖరా! చాణక్యుఁ డిదే నమస్కరించుచున్నాఁడు. మౌర్యుని వీరప్రతాపములను, నా బుద్ధిబలమును సాంతముగఁ బరీక్షించి, విజయమందిన నీకిదిగో అమాత్య ఖడ్గము నర్పించుచున్నాను. దీనితో నీ కిష్టమైనవారి నొక్కరిని వధించి, నీ పగ సాధించుకొమ్ము." అనుచుఁ దన ఖడ్గము నాతని కందించెను. చాణక్యుని చేష్టలకు రాక్షసామాతుఁడు డిల్లవడి, తిలకించుచుండ-

"నీ ప్రబల విరోధి యెవరో వానిని వెంటనే ఖండింప వచ్చును!" అని చాణక్యుఁడు తిరిగి హెచ్చరించెను.

"మహాత్మా! మీ బుద్ధిప్రభావములముందు నేనేపాటివాఁడను! మీ యాత్మశక్తుల కివిగో నాజోహారులు! మత్సరముచేఁ గన్నులు మూసికొని, యింతదనుక, మీ మాహాత్మ్యమును గుర్తింపలేకపోయితిని. చందనదాసును విడిచి, నాతప్పులకుఁ దగిన శిక్షను విధింపుఁడు." అని రాక్షసామాత్యుఁ డంజలి ఘటియించి ప్రార్థించెను.

"దండనలు విధించుట కర్తృఁడైన ప్రభువుండఁగా నే నెంతటివాఁడను?" అని చాణక్యుఁ డటనున్న చంద్రగుప్తునకు సౌంజ్ఞ జేసెను. చంద్రగుప్తుఁడా వెనువెంటనే రాక్షిసామాత్యుని సమీపించి-

"మహామంత్రులవారికిఁ జంద్రగుప్తుఁడిదే నమస్కరించుచున్నాఁడు. ప్రస్తుతము మా దండనాధికారములను జాణక్యులవారే వహింపవలసినదిగాఁ బ్రార్థించు చున్నాము." అనెను.

"అయిన, తమరీక్షణమునుండియు, చంద్రగుప్తునకుఁ బ్రధానామాత్యులై, మగధసామ్రాజ్యలక్ష్మికి హృదయపూర్వకమైన సేవలు చేయవలెను. చంద్రగుప్తుఁడు మీ బిడ్డ యనియు, నీ మగధసింహాసనమునకుఁ దమరు సంరక్షకులనియు, గుర్తింతురుగాక! తమరు గాయత్రిసాక్షిగాఁ బలికిన పలుకులను సార్థకము చేయుదురుగాక!"

చాణక్యుని ప్రార్థన రాక్షసామాత్యుఁ డంగీకరించెను. చంద్రగుప్తుని జేరఁదీసి, కౌఁగలించి "చంద్రగుప్త మహారాజులకు జయము!" అనెను. చందనదాసు రక్షింపఁ బడుటయు, చాణక్య చంద్రగుప్త, రాక్షసామాత్యులేకమగుటయుఁ దెలిసి యెల్లరును జయజయధ్వానములొనర్చిరి. అదేసమయమున, చాణక్య, రాక్షస మహా పండితులిరువురునుఁ జంద్రగుప్తుని పట్టాభిషేకమహోత్సవమునకై యొక శుభ ముహూర్తమును నిర్ణయించిరి.

చాణక్యుఁడు నిర్ణీత శుభముహూర్తమునఁ జంద్రగుప్తుని రత్నసింహాసనముపైఁ గూర్చుండఁజేసి, అమూల్య మగధసామ్రాజ్య మకుటమును దానే స్వయముగ నాతని శిరమునందుంచెను. పుణ్యాంగనలు కర్పూరహారతులిచ్చి, మంగళాశీస్సులు పాడిరి. పండితాశీర్వాదములు మిన్నుముట్టెను. చాణక్య రాక్షసామాత్యు లానంద బాష్పములు రాల్చిరి. ప్రజాసమూహములు చేయు జేజేధ్వనులతోడను, నానావిధ మంగళ వాద్యములతోడను భూనభోంతరాళములు నిండెను.

**ప్రశ్నలు :**

1. చాణక్యుని బాల్యము, ప్రతిజ్ఞను వివరింపుము.
2. చంద్రగుప్తుడు రాజ్యమునుండి పరారగుటకు కారణములు వివరింపుము.
3. చంద్రగుప్తుడు అలెగ్జాండరు బంధము నుండి తప్పించుకొన్న విధమెట్టిది?
4. చంద్రగుప్తుని చాణక్యుడు కాపాడిన విధము వివరింపుము.
5. చాణక్యుని రాజనీతిని వివరింపుము.

